ఉభాభ్యాం జ్ఞానకర్మభ్యా మారాధ్యో భగవాన్ హరిః
తజ్జ్ఞానమేవ విజ్ఞానం తత్కర్మ పరమం శుభమ్ ॥ ४८॥

జ్ఞానకర్మంబులు రెంటిచేతను భగవంతుం డగు శ్రీహరి సేవింపఁ దగినవాఁడు-అట్టి శ్రీహరిని సేవింప వలయు ననెడిజ్ఞానమే విజ్ఞాన మనఁబడును - అట్లుసేవించుటయే అన్ని మేలులలో నుత్తమమైనది

ఉభావపి వియుక్తౌతు నతత్ప్రాప్తికారకౌ।
యుక్తాభ్యాం భగవత్ప్రాప్తి స్సంసారఫల మన్యథా॥ ४९॥

నిష్కామకర్మ మార్గమునుగాని జ్ఞానమార్గమునుగాని యవలంబించునట్టివారిద్దఱును భగవద్భక్తియోగము గలవారైననే భగవత్ప్రాప్తి గలవారగుదురు గాని భగవద్భక్తి లేకుండ నెన్నికర్మంబులనుజేసినను ఎట్టి వేదాన్తజ్ఞాన మున్నను భగవత్ప్రాప్తి గలవారు గారు-మఱియేమనఁగా సంసార ఫలము గలవారేయగుదురు అనఁగా జననమరణములు గలవారే యగుదురనుట

తచ్ఛాస్త్ర మేవ సచ్ఛాస్త్రం తదీయా ఏవ పణ్డితాః।
శోచ్యాహి భగవత్కర్మపరిచర్యావిధిం వినా॥ ५०॥

భగవద్భక్తిని గలుగఁ జేయునట్టి శాస్త్రమే మంచిశాస్త్రము-భగవద్భక్తిగల వారే పణ్డితులు- నిర్హేతుకకరుణానిధి యగుభగవన్తుఁడు తనకైంకర్యమునుజేసి సంసార సాగరమును దాటుటకై కరణకళేబరముల నిచ్చి యుండఁగా భగవత్కైంకర్యము నొనర్పని వారిని గూర్చి అయ్యో యట్టి కైంకర్యము లేకుండఁ జెడిపోవుచున్నారే యని దుఃఖింప వలయును.

కృతకృత్యధియో మూఢా అహో హాత మిదం జగత్।
ఇత్యాది సాత్త్వికజ్ఞాననిశ్చయేన దృఢీకృతా॥ ५१॥
అభేద్యా పరమా బుద్ధి శ్శ్రద్ధేతి పరికీర్త్యతే॥ ५१½॥

లోకమందు జనులు భగవద్భక్తి లేకుండ ననేకకర్మంబులను జేసి కృతార్థుల మని (జన్మమెత్తినతరువాతఁ జేయుంపగిన కార్యములేవో వానిని జేసితిమిగదాయని) తలంచు చున్నారు అట్లుతలంచినవారు మూఢులు- అట్టి మూఢులచే జగమంతయుఁ జెడిపోవు చున్నది. జనులు తామేకర్మంబులను జేసినను అల్పఫలమును గోరక కర్తృత్వము తమ దనితలంపక భగవన్ముఖోల్లాసార్థము భక్తితోఁజేయవలయునుగదా అయ్యో అట్లుచేయక కృతార్థులమని తలంచుచున్నారే యేమి యాశ్చర్యమిదియజ్ఞానముగదా - అనునట్లు

జ్ఞానము సాత్త్వికులకుఁ గలుగును గాని యితరులకుఁ గలుగదు, అట్టినిశ్చయజ్ఞానముచే విషయసుఖములమీఁదికిఁబోకుండ స్థిరముగా భగవద్ధ్యాననిష్ఠ గలబుద్ధి యెదో యది పరిశుద్ధమైనది

పరదారపరద్రవ్యపరహింసానుచిన్తనమ్॥ ౨౨॥
వైరానుచిన్తనం ద్వేష మలభ్యార్థానుచిన్తనమ్।
సుదూరం బహుధా యానం భోక్తవ్య మితి చిన్తనమ్॥ ౨౩॥
అసత్కథానుస్మరణం మసత్కార్య నిరూపణమ్।
ఇత్యాదిదోషరూపాణి హిత్వా కర్మాణి నిశ్చలమ్॥ ౨౪॥
భగవత్కర్మసిద్ధ్యర్థం వ్యావృత్తం భగవత్పరమ్
అవిషణ్ణ మనాయస్త మహఙ్కారవివర్జితమ్॥ ౨౫॥
అసద్విషయసక్తానా మిన్ద్రియాణా మహర్నిశమ్।
దమకం సర్వయత్నేన బాహ్యారంభవినిస్పృహమ్। ౨౬॥
సర్వదా భగవజ్జ్ఞాన సంసర్గ విగతజ్వరమ్।
భగవద్భక్తసద్వాక్య గఙ్గాజలపవిత్రితమ్॥ ౨౭॥
సదర్థగ్రాహకం సూక్ష్మ జ్ఞానరూపవిచారకమ్॥
సమర్థ మప్రధృష్యంచ పుష్టం తుష్ట మసఙ్గిచ ౨౮॥
ఏవమాదిగుణోపేతం నిర్మలం మన ఉచ్యతే॥

తా॥ ఇతరులభార్యలనుగోరుట - పరద్రవ్యములనపహరించుట - పరులను హింసించుట - వైరమును దలంచుట - పరులతో ద్వేషించుట-దొరకనివస్తువును గోరుట పలుమాఱు మిక్కిలి దూరదేశములకుఁ బోవుట-తిండిపోతుగానుండఁదలంచుట-అసత్కథలను దలంచుట-సంబన్ధము లేకుండ మాటలాడుట మొదలైనదోషములు లేనదై నిశ్చలమైన భక్తితో భగవత్కైంకర్యము సిద్ధించుటకుఁదగినతలంపుగలదై-ఁసిగిఁణొనుట-విచారపడుట లేనిదై ప్రతిదినము సద్విషయములమీఁదికిఁ బోవునట్టియిన్ద్రియములను మరలించునదై సర్వప్రయత్నముచేతను ఇన్ద్రియములబాహ్యకార్యములైనపరస్త్రీసంగాదులయందాశ లేనిదై ఎల్లప్పుడును భగద్విషయకజ్ఞానముచేత నేవిధమైనగుఃఖంబును లేనిదై భగవద్భక్తులసద్వాక్యశ్రవణమనెడిగఙ్గాజలస్నానముచేతఁ బరిశుద్ధమై మంచియంశములను గ్రహించునదియై సూక్ష్మదృష్టితో స్వరూపానుసన్ధానమును జేయునదియై

నేర్పుకలదై ఒకదానికి లోబడుట దుస్సఙ్గము-లేనిదై-లోన బైటను సంతోషము గలదై యింకనిట్టిమంచిగుణములతోఁ గూడినదియు నైనమనస్సు పరిశుద్ధమైనదని చెప్పఁబడుచున్నది

ఇన్ద్రియాణాం సదేహానాం బుద్ధేశ్చ మనసస్తథా ।
ఆఖ్యాత శ్శుద్ధి వేషోఽత్ర ద్రవ్యాణా మధునోచ్యతే ॥ ౫౯॥

తా॥ ఇట్లు ఇన్ద్రియశుద్ధికిని దేహశుద్ధికిని బుద్ధిశుద్ధికిని మనశ్శుద్ధికిని లక్షణము చెప్పఁబడెను - ఇఁకను ద్రవ్యశుద్ధికి లక్షణము చెప్పఁబడును వినుఁడు-

ఇచ్ఛయా దేవదేవస్య ప్రకృతి స్త్రిగుణాత్మికా ॥ ౬౦॥
జగత్కారణభూతాం తాం విద్యేత్యాహు ర్మనీషిణః ।
తద్వికారం జగత్సర్వం సదేవాసురమానుషమ్ ॥ ౬౧॥

దేవదేవుం డగుభగవన్తునియొక్క యిచ్ఛచేత సత్త్వరజస్తమోగుణాత్మికయైన ప్రకృతి యనునది కనబడెను. ఆప్రకృతి జగత్కారణమనియు విద్యయనియు విద్వాంసులు చెప్పుచున్నారు ఆదియే దేవాసురమనుష్యాదులతోఁ గూడినజగత్తుగాఁ బరిణమించె (మారెను) ననియుం జెప్పుచున్నారు.

తస్యా స్స్వరూపం సత్త్వం హి తద్దోషా వితరౌ గుణౌ ।
అతఏవ వికారోయ మభవ త్త్రిగుణాత్మకః ॥ ౬౨॥

తా॥ ఆవిద్యయొక్క స్వరూపము సత్త్వగుణమె ఇతరములైన రజోగుణతమోగుణము లాసత్త్వగుణమునకు దోషగుణములుగా నుండునవి గావున నీజగద్రూపవికారము త్రిగుణములు గలదియాయెను.

విద్యాయాః పఞ్చ భూతాని జాయన్తే ప్రకృతేః కిల ।
పఞ్చభూతా న్యధిష్ఠాయ సర్వం వస్త్విహ జాయతే ॥ ౬౩॥

తా॥ విద్యయనియెడి నామాన్తరముగల ప్రకృతివలన మొదటఁ బఞ్చభూతంబులు పుట్టుచున్నవి. ఆపఞ్చభూతముల నాధారముగాఁ జేసికొని సకలవస్తువులును గలుగుచున్నవి.

సాత్త్వికాంశేన జాయన్తే కర్మణ్యా ద్రవ్యసంపదః ।
రజస్తమస్స్వరూపేణ భావా ద్రవ్యబహిష్కృతాః ॥ ౬౪॥

తా॥ యజ్ఞాదివేదోక్తకర్మంబుల ననుష్ఠించుట కుపయుక్తము లైనద్రవ్యసంపదలు సత్త్వగుణాంశముచేఁ గలుగుచున్నవి, అట్టికర్మంబుల కుపయుక్తములు గానిద్రవ్యములు రజోగుణాంశముచేతను తమోగుణాంశముచేతను బుట్టుచున్నవి.

స్వభావతో౽న్యతో౽వాపి కేషాంచి ద్దేయతా భవేత్ ।
నిషిద్ధ మితి యద్ద్రవ్యం వర్జ్యతే శాస్త్రవర్తనా ॥ ౬౩

తా॥ కొన్నివస్తువులు స్వభావముచేతనే దుష్టములు కొన్నిద్రవ్యములు దుష్టద్రవ్యసంసర్గాదులచే దుష్టము లైనవి గావున నట్టిద్రవ్యములు గ్రాహ్యములు గావని శాస్త్రముచే నిషేధింపఁబడినవి గనుక నట్టిశాస్త్రనిషిద్ధద్రవ్యములు గ్రహింపఁదగినవి (ఉపయుక్తములు) గావు

రాజసం తామసం చేతి తజ్జ్ఞేయం పణ్డితై ర్నరైః ।
ద్రవ్యం రజ స్తమోద్భూతం వైష్ణవే కర్మవర్తని ॥ ౬౪

తా॥ రాజసపదార్థములు తామసపదార్థములు కలవు వానిస్వరూపమును బణ్డితులెఱుంగుదురు. విష్ణువునుద్దేశించి చేయుకర్మములయం దట్టి పదార్థము లుపయుక్తములు కావు.

సంయోజయతి యో మోహా త్తస్య సా విఫలక్రియా ।
స్వయం యది తదశ్నీయా న్నిషిద్ధం ముగ్ధచేతనః ॥ ౬౫
అజానన్ప్రాప్రదయా న్తద్ధంభో౽క్షారంనససాత్త్వికః ।

తా॥ విష్ణువు నుద్దేశించి చేయునట్టికర్మములయం దెవఁ డజ్ఞానముచేత రాజస తామసపదార్థముల నుపయోగించుచున్నాఁడో అట్టివానిక్రియ ఫలము లేని దగును మఱియు నెవ్వఁ డట్టిపదార్థములను దెలియక భుజించునో వాఁడు రజస్తమోగుణములు గలవాఁడేయగును గాని సాత్త్వికుఁడు గాదు దానిచేతి శ్రోత్రియులకు గమ్యుం డైన హృదయపుండరీకములోనుండువాఁడును అందఱిని బాలించు వాఁడునగుభగవన్తుని దెలిసికొనఁజాలఁడు.

యాదృశం ద్రవ్య మశ్నాతి రాజసం సాత్త్వికం తువా ।
తాదృశం రూప మాప్నోతి తతః కర్మగతిం తథా ॥ ౬౬

తా॥ రాజసపదార్థమును భుజించినవాఁడు రాజసరూపమునొంది రాజసకర్మములను జేయును. సాత్త్వికపదార్థమును భుజించినవాఁడు సాత్త్వికరూపమునొందిసాత్త్వికకార్యములను జేయును. తామసపదార్థమును భుజించినవాఁడు తామసరూపమును బొంది తామసకార్యములను జేయును.

విశిష్టం భోజ్య ముద్దిష్ట మనియోజ్యైకకర్మసు॥ ౧౯॥
యద్యశ్నాతి స్వయం మోహా త్తత్తస్యైవ స్వపాపకృత్।
నిషిద్ధం వస్తు తద్రౌద్రం రక్షః ప్రేతాదిసంమతమ్॥ ౨౦॥

తా॥ భక్ష్యములు లోనుగాఁ గల భుజింపఁదగినపదార్థములను హవ్యకవ్యాది ముఖ్యకర్మములయందుఁ బరులకు నుపయోగింపఁ జేసి తాను భుజింప వలయునుగాని అట్లు చేయక తాను తలంచినప్పుడంత భుజింపఁ గూడదు అజ్ఞానమువలనఁ దానొంటరిగా నట్లు భుజించినను రక్షఃప్రేత పిశాచాదులకు సమ్మతమైన శాస్త్రనిషిద్ధంబులైన రాజస తామసపదార్థములను భుజించినను అట్టివాఁడు దొంగ యనియుం బాపియనియుం జెప్పఁబడును.

సాత్త్వా దేవ విశుద్ధం య త్సాత్త్వికం తద్గుణోజ్జ్వలమ్।
నిషిద్ధవర్జనా దేవ వర్ధతే సాత్త్వికంపరమ్॥ ౨౧॥

తా॥ స్వభావముగాఁ బరిశుద్ధమైనవస్తువేదో యది సాత్త్వికపదార్థమనియు జ్ఞానాదిగుణములను ప్రకాశింపఁజేయునది యనియుం జెప్పఁబడును అట్టిసాత్త్వికపదార్థమును భుజించువాఁడు శాస్త్రనిషిద్ధవస్తువుల భుజింపకున్ననే సత్త్వగుణము మిక్కిలి వర్ధిల్లును గాని భుజించినయెడల వృద్ధినొందదు.

సాత్త్వికస్య వివృద్ధ్యైవ జ్ఞానం భవతి నిర్మలమ్।
శాస్త్రదృష్ట్యా సమీక్ష్యైవం శుద్ధానాం ద్రవ్యసంపదామ్॥ ౨౨॥
యత్నస్తుసంగ్రహే పద్భిర్ద్రవ్యశుద్ధి రితీష్యతే।
వక్ష్యామి దేశశుద్ధించ సంక్షేపేణ యథాగమమ్॥ ౨౩॥

తా। సాత్త్వికపదార్థములనే భుజింపవలె భుజింపనంత కంతకు జ్ఞానము నిర్మలమగును గావున నిట్లు శాస్త్రదృష్టితో నట్టిపరిశుద్ధ సాత్త్వికపదార్థములసంగ్రహించుట యందు యత్నింప వలయును. ఇట్లీవిధముగా ద్రవ్యశుద్ధి చెప్పఁబడెను ఇఁకను దేశశుద్ధిని శాస్త్రోక్తప్రకారముగా సంగ్రహముగాఁ జెప్పెదను వినుఁడు.

యత్ర తాముపకారాయ భవే త్సుగతికాఙ్క్షిణామ్।
మ్లేచ్ఛపాషణ్డరహితం ధార్మికేశ్వర పాలితమ్॥ ౨౪॥

తా॥ ఏచోట, మ్లేచ్ఛులు పాషండులు లేకుండ ధర్మాసక్తులైనరాజులచేఁ బాలింపఁబడినదై సద్గతిని గోరువారు నివసించుటకు యోగ్యమైనదో యచ్చోటు పరిశుద్ధమైనది.

ధార్మికై స్సేవితం శశ్వ ద్వ్యాఘ్రసింహాదివర్జితమ్।
నిహా న్త్రృదస్యుకహితం సారఙ్గశిఖిసేవితమ్ ॥ ౨౫॥

తా॥ పులులు సింగములు మొదలైన క్రూరమృగములును జీవహింసచేయువారును దొంగలును లేనిదై జింకలు నెమళ్లు లోనగునవి గలదియు ధర్మము నాచరించువారెల్లప్పుడును నివసించునట్టిదియునగుచోటెద్దియో యది పరిశుద్ధమైనది

మోక్షభూమి రితి ఖ్యాతం విమలం సాధు సమ్మతమ్ ।
దివ్యాపగా దేవఖాత వాప్యాది విమలోదకమ్॥ ౨౬॥

తా॥ గఙ్గలోనగు దివ్యనదులలోను దేవతలచేత్రవ్వఁబడినవాపీకూపాదులలోను ఉండునిర్మలోదకముచేఁబరిశుద్ధమైన ప్రదేశ మెద్దియో యది సాధువులకు సమ్మతమైనదనియును మోక్షభూమియనియుం జెప్పంబడును

ప్రభూతకదలీచూతనారికేళాదిమణ్డితమ్ ।
సుసమృద్ధసమిత్కాష్ఠసంపన్నకుసుమోదకమ్ ॥ ౨౭॥

తా॥ అరఁటులు మామిళ్లు టెంకాయచెట్లు లోనగుఫలవృక్షంబులును మల్లెలు మొల్లలు చేమంతులు లోనగు పుష్పప్రధానవృక్షంబులును తఱుచుగాఁగలదియై ఫలపుష్పములసమృద్ధియు సమిధలయొక్కయుఁగాష్ఠములయొక్కయు సమృద్ధియుంగల చోటునుపరిశుద్ధమైనది

ఆసన్నాధోజలం రూఢపలాశతులసీకుశమ్ ।
గోసహస్రసమాకీర్ణం సశష్పం సోత్పలాంబుజమ్ ॥ ౨౮॥

తా॥ వాపీకూపాదులయందుఁ దైననే చేతికందఁ దగినంతదూరమున జలముగలదై మోదుగలు తులసీవృక్షములు కుశలు లోనగునవియు సంపూర్ణముగాఁ గలదియు వేనవేలు గోవులును వానికిమేయుటకు సంపూర్ణముగా లేఁతకసువును గలదై కలువలు పద్మంబులును దఱుచుగాఁ గలదియునైన చోటును బరిశుద్ధమైనది

ఏవమాది గుణోపేతం భూతలం యదిలభ్యతే ।
వివిక్తదేశ భూభాగే దుష్టదోషవివర్జితే ॥ ౨౯॥
ప్రాసాదం పర్ణశాలాం వా కృత్వా నిజబలోచితమ్ ।
అవిస్తృతం త్వనిర్బధం పరితోపి మనోహరమ్ ॥ ౩౦॥

తత్రా ప్యుచ్ఛిష్టమాత్రాసృక్కేశకీటవివర్జితే ।
కరీషమృజ్జలాలిప్తే దృష్టమాత్రేణ చేతసః ॥ ౨౧॥
సంప్రీతిజనకే స్థిత్వా భూతలే భగవత్క్రియా ।
కర్తవ్యా తిప్రయత్నేన యా శుద్ధి ర్భూమిగోచరా ॥ ౨౨॥
దేశశుద్ధి రితి ఖ్యాతా సే యం సచ్ఛాస్త్రవర్తని॥

తా॥ ఇంక నిట్టి మంచిగుణములతోఁగూడిన భూప్రదేశంబును బరిశుద్ధమైనది తాను జేయఁబూనిన భగవద్ధ్యానాది కార్యములకు దుష్టులు విఘ్నములను జేయుటకు వీలు గాని యట్టిపరిశుద్ధప్రదేశమందుఁ దనశక్తికిఁ దగినట్లు ప్రాసాదము లైనను బర్ణశాలలైనను రమ్యముగా నల్పముగా నిర్మించికొని యందును ఎంగిలి మాత్రము రక్తము వెండ్రుకలు పురుగులు లేకుండఁజేసి గోమయమును మంటిని నీటితోఁ గలిపి దానితో నంతట నలుకఁగా జూచినమాత్రాన మనస్సంతోషకరం బగునట్టి భూతలమందు సుఖాసీనుండై భగవద్ధ్యానాది క్రియ నతిప్రయత్నముతోఁజేయ వలయును. ఇట్లు దేశశుద్ధియను శాస్త్రోక్తప్రకారముగాఁ జెప్పఁబడెను.

అనార్యజనసంరోధవీక్షణాదివివర్జితమ్॥ ౨౩॥
శ్రద్ధాతిరేకసంయుక్తం దమ్భలోభవివర్జితమ్।
ఆత్మార్థం త్యక్తసంసిద్ధిరూపాలోకన మత్వరమ్॥ ౨౪॥
అచఞ్చలావిషణ్ణాన్తఃకరణానుసృతేన్ద్రియమ్।
నిర్మలం నిరహంకారం జితక్రోధ మతన్ద్రితమ్॥ ౨౫॥
వికారకర్మసాఙ్కర్యవర్జితం కర్మనిగ్రహమ్।
నష్టాభిమానలేశంచ పరమప్రీతిసంయుతమ్॥ ౨౬॥
సంకల్పపూర్వకం ధ్యేయపదాబ్జన్యాసయోగిచ।
ద్రవ్యమన్త్రేశమన్త్రేషు సమీహితమహామతి ॥ ౨౭॥
బుద్ధిసంచారరహితం శుద్ధమాన మవిచ్యుతమ్ ।
పూర్ణమన్త్రాక్షరం మన్త్రతుల్యరూపసమాప్తిచ॥ ౨౮॥
రసాద్యుత్పన్నదుష్టవిషయభోగం మోక్షమహాసుఖమ్ ।
వినయాదిగుణోపేతం భక్తిజ్ఞానో జ్జ్వలీకృతమ్॥ ౨౯॥

దృష్టమాత్రేణ హృద్యంచ పరమంకర్మ మఙ్గళమ్।
దేహేన్ద్రియాన్తఃకరణబుద్ధిభూమ్యర్థశుద్ధిమత్॥ ౯౦॥

తా॥ ఇట్లు ఇన్ద్రియదేహబుద్ధిమనోద్రవ్యదేశశుద్ధులనుజెప్పి ఇప్పుడు క్రియాశుద్ధిని జెప్పుచున్నాఁడు. భగవన్మన్త్రమును జపించునపుడు అయోగ్యులు దగ్గరనున్నయెడల విఘ్నమును జేయుదురు గావున వారు చూడకుండ జపింపవలయును కపటము అత్యాశయు లేకుండ నతిశ్రద్ధతోడ జపింపవలయును మోక్షేతరములైన నశ్వరఫలములను గోరక ఇన్ద్రియములు మనస్సునకు లోఁబడునట్లును, మనస్సు చఞ్చలము విషాదయుక్తముగా కట్టిదిగాను, అహంకారము కామక్రోధాదులు పరాకును లేకుండనుండునట్టిదిగాను జేసికొని సావకాశముగా జపింపవలయును అప్పుడితరకార్యములు తటస్థించినయెడల వానినెట్లైనను నిగ్రహించి విడువవలయును. గర్వము లేశమైననుండఁ గూడదు అధికప్రీతితోనుండవలయును. సంకల్పపూర్వకముగా భగవత్పాదారవిన్దములయందు మనస్సును నిలుపవలయును మన్త్రమందును మన్త్రాధిదేవతయందును మన్త్రానుష్ఠానమున కుపయోగించువస్తువులయందును జ్ఞప్తినుంపవలయును. ఇతరవిషయములయందు జ్ఞప్తినుంచక యెవ్వరితోను మాటలాడక ఆమన్త్రము నుచ్చరించునపుడొక యక్షరమునైనను విడువక యుచ్చరించుచు మన్త్రానుష్ఠానమునకుఁదగిన సమాప్తి యగునంతవఱకు నవిచ్ఛిన్నముగా జపింపవలయును. షడ్రసోపేతములైనభోజ్యవస్తువులయందు జిహ్వాచాపల్యము గలిగియుండఁ గూడదు శాస్త్రనిషిద్ధములైనవిషయభోగములయం దాశను విడువవలయును. భక్తిజ్ఞానవైరాగ్యములు గలిగియుండవలయును. ఇంకనిట్టి శ్రేష్ఠగుణములతోఁగూడిన భగవన్మన్త్రజపాద్యనుష్ఠానక్రియ దర్శనమాత్రాన మనోహరమై సర్వోత్తమమైయుండును క్రియాశుద్ధిస్వరూపమిట్టిది ఇట్లు దేహేన్ద్రియమనోబుద్ధిభూమిద్రవ్యముల శుద్ధి గలమన్త్రానుష్ఠానకర్మను పరమమఙ్గళరూపమైనది.

అత్రోక్తలక్షణోపేతం కర్మభాగవతం పరమ్ ।
సప్తసంశుద్ధిసంయుక్తా పరిపూర్ణా భవేత్క్రియా॥ ౯౧॥

ఇట్టి లక్షణములు గల మన్త్రజపానుష్ఠానాదికర్మమే భాగవతులకు నుత్తమమైన యనుష్ఠేయకర్మము (చేయఁదగిన మేలైనపని) ఇట్లు దేహేన్ద్రియ మనోబుద్ధిభూమి ద్రవ్య క్రియల శుద్ధిగలక్రియ పరిపూర్ణమగును

సప్తైతే విమలా భావాః శ్రద్ధావా నారభేత్క్రియామ్ ।
అథానాద్యై ర్విశుద్ధాత్మా సంస్కారైః పఞ్చకాలినామ్॥ ౯౨॥

తా॥ ఇట్లు చెప్పఁబడిన దేహేన్ద్రియాది పదార్థములు ఏడును బరిశుద్ధములైనవి శ్రద్ధాభక్తులతో భగవదారాధన మారంభింపవలయును, ఇట్లారంభించినవాఁడే ప్రాతః

కాలము మొదలైన అయిదుకాలములయందుఁ జేయఁబడిన వేదోక్తకర్మానుష్ఠానములచేతఁ బరిశుద్ధమైనమనస్సుగలవాఁడగును.

కుర్యాద్బ్రాహ్మణ ఏవైత త్త్రైవిద్యో వా విశుద్ధధీః॥
శ్రద్ధావా న్భగవద్ధర్మే రాగాదిరహితేన్ద్రియః॥ ౯౩॥

తా॥ గృహస్థబ్రాహ్మణుఁడుగాని మూఁడువేదములు చదివినబ్రహ్మచారి గాని ఈ భగవత్కర్మమును జేయవలయును. అట్లుచేయునపుడు పరిశుద్ధమైన మనస్సు గలవాఁడుగాను కామక్రోధాదులతో సంబన్ధింపని యితరేన్ద్రియములు గలవాఁడు గాను భగవద్ధర్మమందు శ్రద్ధ గలవాఁడుగాను ఉండవలయును.

బ్రాహ్మణా న్పూజయే న్నిత్యం పఞ్చకాల పరాయణాన్।
వస్త్రగోభూమిదానేన ధనధాన్యాదిభి స్తథా॥ ౯౪॥

తా॥ మఱియు నైదుకాలములయందును జేయఁబడినకర్మములను జేయునట్టి బ్రాహ్మణులకు వస్త్రములను గోవులను భూమిని ధనధాన్యాదుల నిచ్చి వారిని ప్రతిదినము యథాశక్తిగాఁ బూజింపవలయును.

తోషయే త్పరయా భక్త్యా నిత్యం భాగవతా న్నరాన్।
సిద్ధి ర్భవతి వా నేతి సంశయో చ్యుతసేవినామ్॥
న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్।
కేవలం భగవత్పాదసేవయా విమలం మనః॥ ౯౫
నజాయతే యథానిత్యం తద్భక్తచరణార్చనాత్।
విశిష్టకులసంజాత స్సంస్కారై స్సంస్కృతో నిజైః॥ ౯౬॥

తా॥ మఱియును నిత్యము భగవద్భక్తుల నతిభక్తిచేత సంతోషపెట్టవలయును భాగవతులను సేవించుటయందు దాశగలవారికిఫలముగలుగునో లేదోయనుసందేహముండదు భగవన్తుని సేవించెడివారికి ఫలముగలుగునో లేదో అను సందేహముండును భగవద్భక్తుల పాదములను బూజించుటచేత నెంతపరిశుద్ధమైయుండునో యట్లు భగవన్తుని సేవించుట చేత మనస్సు మిక్కిలి పరిశుద్ధమైయుండును. మఱియు, పరిశుద్ధవంశమందుఁబుట్టి తన కుఁజెప్పఁబడినవేదోక్తకర్మములనుజేయువాఁడు గూడ భగవద్భక్తులపాదములను సేవించువాని తో సమానుఁడు గాఁడు.

త్యైరితే యది సద్ధర్మే చరే త్కృచ్ఛ్రాణి శాన్తధీః।
తప శ్చరేత్ మనోక్తశ్చే ద్ధనవా న్దాన మూపరేత్। ౯౭

త్సరితముగా శ్రేష్ఠమైన పుణ్యము కావలసిన పక్షమున మనస్సును జయించి కృచ్ఛ్రచాన్ద్రాయణాదితపస్సును జేయవలయును అట్లుచేయుటకు శక్తి లేనియెడల ధనముగలవాఁడు దానమును జేయవలయును

ఉభయో రప్యశక్తశ్చే న్నామసంకీర్తనం చరేత్ ।
యథాశక్తి తపశ్చర్త్వా దత్త్వాచైవ యథాబలమ్ ॥ ౯౯॥

తా॥ అట్లు కృచ్ఛ్రచాన్ద్రాయణాది తపస్సుచేయుటకు శరీరమందువిశేషశక్తియుం దానముచేయుటకు విశేషధనంబును లేనిపక్షమున శక్త్యనుసారముగాఁ దపస్సును దానమును జేయుచు హరినామ సంకీర్తనమును జేయవలయును

నృసింహమూర్తిం తం ధ్యాత్వా జపే త్సర్వాఘశాన్తయే ।
ఉపవాసా త్తథా దానా త్సద్భక్తానాంచ సేవనాత్ ॥ ౧౦౦॥

సంకీర్తనా జ్జపా త్తాపా చ్ఛ్రద్ధయా శుద్ధి మృచ్ఛతి ।
ఉపాసీత నిరస్తోపి పంచకాలపరాయణాన్ ॥ ౧౦౧॥

తా॥ విహితకర్మములను విడిచినపతితుఁడును తనపాపంబులను బోఁగొట్టుకొనుటకై నృసింహ మూర్తిని ధ్యానించి యానృసింహమన్త్రమును జపింప వలయును-మఱియు నుపవాసవ్రతము దానము సద్భక్తసేవ హరినామసంకీర్తనము జపము తపము వీనిని శ్రద్ధతోఁజేయువలయును అయిదు కాలములయందును దప్పక తమకుఁ దగిన కర్మంబులను జేయువారిని తానువారిచే వెడలగొట్టఁబడినను సేవింప వలయును. అట్లుచేసిన పక్షమునఁ బాపశాన్తిని బొందుచున్నాఁడు.

యదీచ్ఛే ద్భగవత్కర్మ సేవయా పాపశాన్తయే ।
పూర్వోక్తాచార సంపన్నం యువానం గృహమేధినమ్ ॥ ౧౦౨॥

ఉత్తమైః కృతసఖ్యంచ నీచసేవావివర్జితమ్ ।
ప్రఖ్యాతశుద్ధచరితం సద్భక్తైక పరాయణమ్ ॥ ౧౦౩॥

భగవత్కర్మసంసక్త మర్థిసందేహనోదకమ్ ।
ప్రతిపాదనసామర్థ్యయుక్తం పత్నీవ్రత పత్నికమ్ ॥ ౧౦౪॥

ఉదారం భక్తివివశం వశీకృతజగజ్జనమ్ ।
హ్యాస్యవాక్యం కృతజ్ఞంచ దయార్ద్రీకృత మానసమ్ ॥ ౧౦౫॥

అశూద్రశిష్యం శూద్రాణాం జ్ఞానదానే ష్వనాదృతమ్।
అక్రోధన మనుత్సిక్త మవిషణ్ణం విపత్స్వపి॥ ౧౦౬॥
భగవద్భక్తియుక్తేషు దృష్టమాత్రేషు సుప్రియమ్।
సాధూనా ముపకారాయ వ్యాపృతం క్లేశవర్జితమ్॥ ౧౦౭॥
అన్యూనానతిరిక్తాఙ్గం విషయాగ్రహకేన్ద్రియమ్।
సౌమ్యవేషం ప్రశాన్తంచ పాపరోగవివర్జితమ్॥ ౧౦౮॥
అదుర్బలం చాగమార్థే యుక్తం భగ్నాభిమానినమ్।
శిష్యాణాం సంగ్రహే దేవప్రతిష్ఠాపనకర్మణి॥ ౧౦౯॥
శాన్తికే పౌష్టికే భీతం గురుశుశ్రూషణే రతమ్।
ఏవమాదిగుణోపేత మాచార్యం వరయేద్ద్విజః॥ ౧౧౦॥

తా॥ భగవంతునికి సంతోషమును జేయునట్టి వేదోక్తకర్మంబులను జేసి యట్టి భగవత్సేవచేత సంసారదుఃఖమును బోఁగొట్టుకొనఁ దలంచినవాఁడు ఆట్టిభగవత్సేవా ప్రకారమును నుపదేశించుటకు గురువు నాశ్రయింపవలయును. ఆగురు వెట్టి లక్షణములు గలవాఁడై యుండవలయుననఁగా, ఇదివఱకుఁ జెప్పఁబడిన సదాచారముగలవాఁడును యౌవనవంతుఁడును గృహస్థుఁడును నీచసేవను విడిచి యుత్తములతో సఖ్యము జేయు వాఁడును సచ్చరిత్రములచేత లోకప్రసిద్ధుఁడును సచ్చిదానన్దబ్రహ్మమందే యాసక్తిగల వాఁడును-భగవత్సుఖోల్లాసకరంబు లైనకర్మంబులను జేయుటయందాసక్తిగలవాఁడును-శిష్యులకుఁగలిగెడి సందేహములనుబోఁగొట్టుటయందు సమర్థుఁడును-శిష్యులమనస్సులకు దానుపదేశించునట్టి విషయము చక్కఁగాఁ దెలియునట్లు లోకానుభవసిద్ధదృష్టాంతముల నుపన్యసించి చెప్పి సందేహములను బోఁగొట్ట సమర్థుఁడును-సత్పుత్రవంతుఁడును గుణవతియగు భార్యయుఁగలవాఁడును - దాతయును భక్తితో భగవంతుని ధ్యానించున పుడు ప్రపఞ్చజ్ఞానములేనివాఁడును- భగవత్కథలను జెప్పునట్టి నేర్పుచే జనులు నమ్రులగునట్లు చేయువాఁడును - మనోహరముగా మాటలాడువాఁడును- ఇతరులు తనకుఁ జేయునుపకారమును మఱవనివాఁడును - అట్లు తనకుఁజేయునట్టి శుశ్రూషను మఱవని వాఁడు గనుకనే శిష్యులకు సదుపదేశమును జేయవలయుననెడి సంపూర్ణదయగలవాఁడును-అసచ్ఛూద్రులకు జ్ఞానోపదేశమును జేయనివాఁడును శూద్రులకు శిష్యుఁడుగాఁనట్టి వాఁడును-కామక్రోధాదులు లేనివాఁడును లేశమైనను గర్వములేనివాఁడును ఆపత్కాలమందు ధైర్యముగలవాఁడును భగవద్భక్తిగలవారనిఁజూచుటచేతనే వారియందు మిగుల

నాపిరముగలవాఁడును సజ్జనుల కుపకారమును జేయువాఁడును మనోదుఃఖము కొంచెమైనను లేనివాఁడును హెచ్చుతక్కువలులేని శాస్త్రోక్త శరీరప్రమాణముగలవాఁడును ఇన్ద్రియనిగ్రహముగలవాఁడును చూచుటకు రమ్యమైన వైదికవేషము గలవాఁడును- మనస్సును వశపఱచికొన్నవాఁడును-ఆరోగ్యము గలవాఁడును-కుష్ఠాదిపాపరోగములులేనివాఁడును-వేదవేదాఙ్గాదుల యర్థమును బాగుగాఁ దెలిసినవాఁడును- భగవత్ప్రాప్తికిఁగగిన యుపాయంబుల నెఱిఁగినవాఁడును - కొంచెమైనను దేహమందాత్మబుద్ధి లేనివాఁడును- శిష్యులసంపాదించుటయందును దేవప్రతిష్ఠాదికర్మమందును గురుసేవయందును ఆసక్తిగలవాఁడును శాన్తికపౌష్టికకర్మములఁ జేయుటయందు భీతిగలవాఁడును- ఇఁక నిట్టి సుగుణము లనేకములు గలవాఁడునై యుండవలయును ఇట్టియాచార్యు నుపనయనసంస్కారము గలవాఁడు వరింపవలయును.

ఆచార్యచిత్తానుగుణం సిద్ధాన్తానుగుణం త్వపి।
అన్యత్ర శృణుయాజ్ఞేయ మనుజ్ఞాప్యైవ జీవతి॥ ౧౧॥

తా॥ ఒకయాచార్యు నాశ్రయించిన తరువాత మఱియొక యాచార్యునాశ్రయింపవచ్చునా? అని సందేహింపవలదు - ఆచార్యుఁడు జీవించియున్నప్పుడుగూడ నాతని యాజ్ఞను బొంది యతనిచిత్తానుసారము గాను వేదాన్త సిద్ధాన్తానుగుణముగాను మఱియొక గురువువలన వేదాన్త శ్రవణాదికమును జేయవచ్చును.

యస్మిన్స్వైరమవిద్యా యాం న సంసిద్ధి రబోధతః।
గురోర్వ్యాప్యన్యతో గ్రాహ్యా పరా విద్యాగుణాన్వితాత్ ౧౨॥

తా॥ మఱియును మొదట నాశ్రయించిన గురువునకు వార్ధక్యాదులచే బోధకతాశక్తి తక్కువైనయెడల ఉత్తమమగు వేదాన్తవిద్యను బాగుగదెలిసికొనుటకు బూర్వోక్తగురులక్షణములుగల మఱియొకగురువువలననైన నట్టియుత్తమ వేదాన్తవిద్యను దెలిసికొనవలయును

పరిశుద్ధకులోద్భూతం విశుద్ధాచారతత్పరమ్।
విరతంచ మహాపాపా త్పితృదారాదిషు ప్రియమ్॥ ౧౩॥

దాన్తం శాన్తం మృదుం సౌమ్యం ప్రశాన్తం భగవత్పరమ్।
సంతప్త హృదయం భక్త్యా శక్త్యా సర్వార్థసాధకమ్॥ ౧౪॥

ప్రియవాక్యం మహాబుద్ధం సత్యం కుశలవాణికమ్।
శమదమాదిగుణోపేతం శిష్యభావేన సంగతమ్॥ ౧౫॥

సంవత్సరం తదర్థంవా మాసత్రయ మథాపి వా।
పరీక్ష్య వివిధోపాయైః కృపయా నిస్పృహోవదేత్ ॥ ౧౧౬॥

తా॥ గురులక్షణములు చెప్పఁబడినవి శిష్యలక్షణములను జెప్పెదను వినుఁడు శిష్యుఁడెట్టి లక్షణములుగలవాఁడై యుండవలయుననఁగా, పరిశుద్ధవంశమందుఁబుట్టిన వాఁడును పరిశుద్ధాచార మందాసక్తిగలవాఁడును పాపకార్యములను జేయనివాఁడును తల్లిదండ్రులయందును భార్యలోనగు వారియందును బ్రీతిగలవాఁడును బహిరింద్రియము లను మనస్సును వశపఱచికొన్నవాఁడును మృదుస్వభావము వైదికవేషము ఓర్పును గలవాఁడును భగవంతునియందు భక్తిగలవాఁడును దయానువును భక్తియుక్తియుఁ గల వాఁడై ధర్మార్థ కామమోక్షములను సాధింపవలయుననెడి యాశగలవాఁడును బ్రియ వాక్యమును జెప్పువాఁడును చులుకనైనబుద్ధియు సత్యవాక్యంబును గలవాఁడును యుక్తి యుక్తముగా మాటలాడ నేర్పుగలవాఁడును ఇంక నిట్టి యనేక సుగుణములుగలవాఁడై శిష్యుఁడుండవలయును అట్టివాఁడు గురువునొద్దకు వచ్చి నన్నుశిష్యునిగాఁ బరిగ్రహింప వలయునని ప్రార్థించినపక్షమున గురువప్పుడే వానిని శిష్యునిగాఁ జేసికొనఁ గూడదు. మఱియేమనఁగా సంవత్సరముగాని ఆఱునెలలుగాని, మూడునెలలుగాని, వానియందు దయగలవాఁడైయుండి వానిచిత్తమును నానావిధోపాయములచేతఁ బరీక్షించి వీఁడు శిష్యభావమునకుఁ దగినవాఁడని తోఁచినపక్షమున నప్పుడు వానివలన ఫలమునుగోరక వానితో మాటలాడవలయును.

బ్రహ్మవిద్యా ప్రదానస్య దేవైరపి నశక్యతే।
ప్రతిప్రదాన మథవా దద్యాచ్ఛక్తిత ఆదరాత్॥ ౧౧౭॥

తా॥ బ్రహ్మవిద్య నుపదేశించిన గురునకు బదులుగా మఱియొకటి తగినదానినిచ్చుట దేవతలకును శక్యముగాదు ఒకవేళ నేదైనను భక్తిపూర్వకముచే నియ్యఁదలచినపక్ష మునఁ దనశక్త్యనుసారముగా ధనాదికమును ఇయ్యవలయును. ఆదానము కృతజ్ఞతను దెలుపునే కాని బ్రహ్మవిద్యాదానమునకు సమానముగాదు.

న ప్రమాద్యేద్గురోశ్శిష్యో వాఙ్మనః కాయకర్మభిః।
అవిభజ్యాత్మనాచార్యం వర్తేతాస్మిన్ యథాచ్యుతే॥ ౧౧౮॥

తా॥ శిష్యుఁడు గురువునెడ నమ్రుఁడై మర్యాదగా మాటలాడవలయును మన స్సున ద్రోహపుఁదలంపుకుండఁగూడదు పాదములువిగుంటలోనగు నపచారములనుజేయ వలదు ఇట్లు పరాకులేకుండ వాఙ్మనఃకాయకర్మములచే గురునొద్దఁబ్రవర్తింపవలయును ఆచార్యుని మనస్సుతో వేఱుపఱుపక సాక్షాద్భగవంతుని వలెఁజూచినట్లు తలంపవలయును

ఆక్రోశకం దుష్టభావం పిశునం సత్వరక్రియమ్ ।
స్వార్థైక సాధనం లుబ్ధ మలసం సర్వకర్మసు ॥ ౧౧౯॥
వివాద పరివాదాద్యై ర్వృథాంభాషిణ ముద్ధతమ్ ।
పరావమానినం సర్వశ్రేష్ఠంవా పరివర్జయేత్ ॥ ౧౨౦॥

తా॥ తిట్టువాఁడును దుష్టస్వభావముగలవాఁడును చాడీలుచెప్పువాఁడును చేయుపనిని సాధకబాధకములను విచారింపక ఆవసరముగాఁజేయువాఁడును పరోపకారబుద్ధిలేకుండఁ దన కార్యమునే చక్కఁబెట్టుకొనువాఁడును లుబ్ధుఁడును, ఎల్లపనులయందు సోమరితనముగలవాఁడును కలహించువాఁడును లోకులు నిన్దింపఁదగినపనులను జేయువాఁడును అధికప్రసఙ్గియును వినయములేనివాఁడును పరులనవమానించువాఁడును అగు నిట్టిదుష్టగుణములు గలవానినిగాని అన్నివిధములను దనకంటె శ్రేష్ఠునిగాని విడువ వలయును.

మూఢైః పాపరతైః క్రూరై స్స్వాగమపరాఙ్ముఖైః ।
సమ్బన్ధంనాచరేద్భక్తి ర్నశ్యతే తైస్తుసంగమే ॥ ౧౨౧॥

తా॥ పాపకార్యములను జేయుటయందాసక్తిగలవారును జీవహింస చేయువారును ఎల్లప్పుడు వేదశాస్త్రములను నిన్దించువారును నగు మూఢులతో సంబన్ధమును జేయఁగూడదు, అట్టివారితో సంబన్ధమును జేసినపక్షమున భగవద్భక్తి నశించును.

భగవత్కీర్తననిరతైః స్తోత్రపూజాజపాదిభిః ।
అప్రతిగ్రాహకై స్స్వశక్తై ర్వివాదై ర్లోభవర్జితైః । ౧౨౨॥
సుశీలై ర్జ్ఞానశీలైశ్చ బాహ్యాన్తస్తుల్యచేష్టితైః ।
హృద్యవేషై ర్విశుద్ధాన్నై ర్భగవద్గుణలాలసైః ॥ ౧౨౩॥
సత్యవాగ్భి ర్దయాసారై ర్మృదుచేష్టై రమత్సరైః ।
భక్తిపూతై స్సదాచారై స్సదా సహావసేద్బుధః ॥ ౧౨౪॥

తా॥ భగవంతుని స్తోత్రములను పఠించుట భగవంతునికి షోడశోపచారములచేఁ బూజచేయుట లోనగుభగవత్సంతోషకరము లైనపనులను జేయువారును ఎక్కడను దానము తీసుకొనని వారును ఎవరితోను గలహింపనివారును మంచిస్వభావము మంచి జ్ఞానము గలవారును మనస్సునఁ గపటముంచికొని పైకిమాత్రము మధురవాక్యమును జెప్పక

అన్తర్బాహ్యములయందు సమానముగా నడచుకొనువారును మహోదారములైన భగవ
చ్చిహ్నములను మనశ్శుద్ధియు దయాళుత్వము సత్యవాక్యము నడతలయందు నాజూకు
భగవద్భక్తియు భగవద్గుణాసక్తియు సదాచారమునుగలవారును లోభము మాత్సర్యము
లోనగు దుర్గుణములులేనివారు నగునట్టివానితోఁగూడ నివసింప వలయును.

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతి స్తథా ।
కృపయాఽఽశ్రమిణ స్సర్వే ధర్మం బ్రూయు స్స్వలిఙ్గినే॥ ౧౨౫॥
గృహస్థో వాపి సర్వేభ్యో ధర్మం బ్రూయా న్మహామతిః ।
పరివ్రాడపి వా బ్రూయా త్సర్వశ్రేష్ఠో గృహాశ్రమీ ॥ ౧౨౬॥

తా॥ ఇట్టిభగవద్ధర్మము నేయాశ్రమంబుననున్నవాఁడుఁ ఉపదేశింప వచ్చుననఁగా,
బ్రహ్మచారిగృహస్థవానప్రస్థయతులందఱును దయాళువులై పూర్వోక్తశిష్యలక్షణములు
గలవాని కుపదేశింప వచ్చును. అయినను అంఎతికిని బూజ్యుఁడుగనుక సన్యాసిని
యుపదేశించుట యుత్తమము - అన్ని యాశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనది
గనుక గృహస్థువలన నుపదేశమునొందుట రెండవపక్షము.

ఇతిశ్రీ శాణ్డిల్యస్మృతౌ విశిష్టధర్మశాస్త్రే ప్రథమో ధ్యాయః—
సంగ్రహముగా నన్నిధర్మములుగల
శ్రీ శాణ్డిల్యస్మృతియనెడి ధర్మశాస్త్రమందుఁ
బ్రథమాధ్యాయము ముగిసెను.

---

## ద్వితీయాధ్యాయము.

మునయ ఊచుః—మునులు శాణ్డిల్యునితో మరల నిట్లనిరి.

స్నానం ప్రధానం భక్తానాం సమ్యక్ శుద్ధ్యుపపాదకమ్ ।
శ్రోతుకామా విధిం తస్య సహాభిగమనేన చ ॥ ౧॥

తా॥ భగవత్ప్రీతికరములైన ధర్మముల ననుష్ఠించుటయం దాసక్తిగలవారికి
మిక్కిలి పరిశుద్ధిని గలుగఁజేయునట్టి దగుటచే స్నానము ప్రధాన మైనది గనుక నాస్నా
నమును జేయ వలసినప్రకారమును దానికి వెనుక జేయ వలసినకార్యము లేవో వాని
విధిని విశదముగా, మేము విన గోరుచున్నాము-

శాణ్డిల్య ఉవాచ.
శాణ్డిల్యుండిట్లనియె

సహాభిగమనేనైవ ప్రాతఃకాలానుయాయినా ।
వక్ష్యామి యోగా దూర్ధ్వం య త్కర్తవ్యం స్నానపూర్వకమ్॥ ౨॥

తా॥ నిద్రలేచినతరువాత స్నానమునకుఁ బూర్వముఁ జేయవలసినదేదో దానిని ప్రాతఃకాలమందుఁ జేయఁదగిన యభిగమనముగ జెప్పెదను వినుఁడు - (అభిగమన మనఁగాఁ గొంతిమారము నిద్రలేచినతరువాత నడుచుట.)

ఉచ్చైస్స్వరేణ యోగాన్తే స్తుత్వా స్తోత్రై రుదారధీః ।
వాసుదేవాదిదేవానాం నామ్నాం సంకీర్తనం చరేత్ ॥ 3॥

తా॥ తెల్లవాఱఁగానే నిద్రలేచి శుద్ధమనస్సుతో భగవన్తుని గట్టిగా స్తోత్రపాఠములచే స్తుతించి వాసుదేవాదినామసంకీర్తనము జేయవలయును

ప్రాదుర్భావగణం చాపి సంస్మరే త్సర్వసిద్ధయే ।
కీర్తయే త్తద్గుణా న్భక్త్యా పరమాద్భుతచేష్టితాన్॥ ౪॥

తా॥ మఱియు భగవన్తుని విభవావతారములను సర్వకార్యసిద్ధికొఱకుఁ దలంపవలయును. ఆభగవదవతారములయందుఁ జేయఁబడిన పరమాశ్చర్యకరచరిత్రంబులను భక్తితో సంకీర్తనము చేయవలయును.

అతన్ద్రితస్స్వాధ్యాయే యోగయుక్తాత్మన స్సదా ।
తద్భక్త్యై స్విన్నదేహస్య హ్యావశ్యం నామకీర్తనమ్॥ ౫॥

తా॥ వేదపారాయణమును జేయుచు నిత్యము భగవద్భక్తి గలవాఁడై యాభక్తిచేఁ జెమటపోసిన దేహము గలవాఁడై సర్వదా హరినామసంకీర్తనమును ముఖ్యముగాఁ జేయుచుండవలయును

ఆదాయ వస్త్రదణ్డాది గృహీత్వాచ కమణ్డలుమ్ ।
ప్రావృత శ్ఛన్నమూర్ధాచ కర్మారమ్భపరో వ్రజేత్॥ ౬॥

తా॥ తెల్లవాఱలేచి యాపనులకు జేసినపిమ్మట నొకవస్త్రమునుదలకుఁజుట్టుకొని యొకదండమును జేతఁబట్టుకొని చెంబుతో నీళ్లు దీసికొని మలవిసర్జనార్థము బైటఁబోవలయును.

గ్రామా ద్బహి ర్వినిర్గత్య విసృజే త్సహచారిణః ।
అపరిగ్రహదేశేషు కుర్యాన్మలవిసర్జనమ్॥ ౭॥

తా॥ అట్లు పోవునపుడు తనతోఁగూడ దిరుగుచుండెడి వారిని విడిచిపెట్టవలయును గాని వారితోఁగూడ దగ్గఱఁగూర్చుండఁగూడదు మఱియును గ్రామమునకు దూరముగాఁబోయి పైరు పచ్చిక లేనిబయలునందు మలవిసర్జనమును రహస్యముగాఁ జేయవలయును.

మేహనే మైథునే స్నానే భోజనే దన్తధావనే ।
ఇజ్యాయాం సహహోమే చ జపే మౌనం సమాచరేత్ ॥౮

తా॥ మలమూత్రములను విడుచునప్పుడును స్త్రీసంగమకాలమందును స్నాన భోజన దన్తధావనములను జేయునప్పుడును యజ్ఞమును జేయునప్పుడును హోమము చేయునప్పుడును జపకాలమందును మాటలాడఁగూడదు.

స్వదక్షిణశ్రుతిన్యస్త బ్రహ్మసూత్రః సమాహితః ।
న శ్మశానే న కృష్టేషు న మార్గే నచ భస్మని॥ ౯॥

తా॥ మఱియును తనకుడిచెవియందు జంజెమును జుట్టుకొని నియతుఁడై శ్మశానము దున్నినభూమి మార్గము బూడిదె లేనిచోట్ల మలవిసర్జనము చేయ వలయును.

నోషరే నచ సస్యేషు న గుల్మేషు నసైకతే ।
న వృక్షమూలే నామేధ్యే న కీటేషు న చత్వరే॥ ౧౦॥

తా॥ మఱియుఁ జవిటిభూమియందును పైరులున్నచోటను పొదలు ఇసుక దిబ్బ ఉన్నచోటను చెట్టుమొదటను మలమున్నచోటను పురుగులున్నచోటను బహిరంగవీధియందును మలవిసర్జనమును జేయఁగూడదు

నోదకాన్తే నగోవాసే న హ్రదే న గృహాఙ్గణే ॥
న దేవాలయపార్శ్వేషు న నద్యాం నార్యసన్నిధౌ ॥ ౧౧॥

తా॥ జలసమీపమందును ఆవులుండుచోటను మడుగునందును ఇంటిముంగిటను దేవాలయసమీపమందును నదీసమీపమందును బూజ్యులసన్నిధియందును మలము విడువఁగూడదు.

న వల్మీకే న రన్ధ్రేషు న కరీషే నచోపలే ।
న దేవార్కవిశిష్టాగ్నిగురువృద్ధాఙ్గనాముఖః ॥ ౧౨॥

తా॥ మఱియును బుట్టయందును బొక్కయందును పిడకయందును ఱాతియందును మలవిసర్జనమును జేయఁగూడదు దేవతలకును సూర్యునకును పెద్దలకును అగ్నికిని గురువులకును బూజ్యులకును స్త్రీలకును ఎదురుగాఁ గుర్చుండి మలమును విడువఁగూడదు.

నగోగగనదిక్తారాం గృహామేధ్యావలోకకః ।
న జల్పన్నస్పృశన్ శ్లాలిం న చానావృతమస్తకః ॥ ౧౩॥

తా॥ గోవులను ఆకాశమును దిక్కులను నక్షత్రములను గ్రహములను పరిశుద్ధవస్తువులను జూచుచును మాటలాడుచును జేతితోఁ దలను గోఁకుచును దలకు వస్త్రమును జుట్టుకొనకయు మలమును విడువఁగూడదు

చిరం నోపవిశే న్నాతిపీడయ న్నాతి వైశసః ।
ఏకాకీ ముక్తపద్రక్షో యతసర్వేన్ద్రియక్రియః। ౧౪॥

మేహనాదిక్రియాం కుర్యా ద్వస్త్రాచ్ఛాదితనాసికః।
ఉదఙ్ముఖో దివా నక్తం దక్షిణాముఖసంస్థితః॥ ౧౫॥

తా। మఱియు నెప్పుడు చిరకాలము గూర్చుండక యే ప్రాణులకును పీడనుగాని హానినిగాని జేయక పాదరక్షలను విడిచి మఱియే కార్యమును చేయక వస్త్రముతో ముక్కుమూసికొని యెవ్వరును లేనిచోట మలమూత్రాదివిసర్జనమును జేయవలయును, మఱియుఁ బగటియందుత్తరముఖుఁడుగాను రాత్రియందు దక్షిణాభిముఖుఁడుగాను గూర్చుండి యాపనిని జేయ వలయును.

దివేవ సన్ధ్యయోర్గి కుర్యా న్మేహనాద్యం విచక్షణః ।
గృహీతశిశ్నశ్చోత్థాయ సంతిష్ఠేత్ క్షాళనావధి॥ ౧౬॥

తా॥ శౌచశుద్ధిని బాగుగాఁ దెలిసికొని పగటియందువలె సాయంప్రాతస్సంధ్యా కాలములయందు నుత్తరాభిముఖుఁడై మలమూత్రవిసర్జనాదికమును జేయవలయును, మఱియును ప్రక్షాళనమగునంతవఱకును శిశ్నమును బట్టుకొని లేచి మరుగుగా నుండ వలయును.

వల్మీకకృష్టభూతోయకీటాశుద్ధాదియోగినీమ్ ।
వర్జయిత్వా మృదం శౌచం కుర్యా దుద్ధృతవారిణా॥ ౧౭॥

తా॥ పుట్ట దున్నిననేల జలము పురుగులుండుచోట్లు అపరిశుద్ధప్రదేశము మొదలైనవాని సంబన్ధము లేనిచోట నుండుమృత్తికను దీసికొని దానితో రుద్దికొని చెంబుతోనెత్తిన జలముతో బాగుగాఁ బ్రక్షాళనమును జేసికొన వలయును.

పఞ్చధా లిఙ్గశౌచం స్యా ద్గుదశౌచం త్రివేష్టితమ్ ।
మనఃప్రసాదనం కుర్యా ద్యావ న్మలవిలోపనమ్ ॥ ౧౮॥

తా॥ లిఙ్గశుద్ధి అయిదుసార్లు గుదశుద్ధి పదునేను సార్లును జేయవలయును. అప్పటికిని అనుమానమున్నపక్షమున మలము నిశ్శేషముగాఁ బోయినదని మనస్సునకుఁ దోచునంత వఱకును ప్రక్షాళనమును జేసికొనవలయును.

పాదయో ర్లిఙ్గవ చ్ఛౌచం హస్తయోస్తు చతుర్గుణమ్ ।
దన్తా న్విశోధయే త్ప్రాతరి పలాశవటపిప్పలాన్॥ ౧౯॥

విహాయ సుశుభై రామ్రపూర్వై ర్విధివ దత్వరః ।
ఉత్పాదయ న్నరక్తంచ న పశ్యన్ సర్వతో దిశః॥ ౨౦॥

తా॥ పాదములను లిఙ్గమునువలె నైదుసార్లును చేతులను ఇరువదిసార్లును గడుగవలయును. ఇట్లు శౌచవిధియైనతరువాత దన్తధావనమును-ప్రాతఃకాలమందుఁజేసికొనవలయును. మంచిమామిడియాకు మొదలైనవానితో సావకాశముగా దన్తశుద్ధినిజేసికొనవలయును. మోదుగ-మఱ్ఱి - రావి - వీనితో దన్తధావనము జేసికొనఁగూడదు - రక్తము వచ్చునట్లు దన్తములచిగుళ్లకుఁ దగులకుండను పరాకుగానంతటను దిక్కులు చూచుచునుదన్తశుద్ధిని జేసికొనఁగూడదు.

సముద్రగాపగాదేవఖాతవాపీ హ్రదాశ్రయే ।
స్నాయాజ్జలేఽన్యదేవానాం సంసర్గపరివర్జితే॥ ౨౧॥

సర్వైస్సంసేవితే సద్భి ర్దృష్టదోషవివర్జితే ।
విశుద్ధతీరభూభాగే స్నాయాత్ప్లుని వారిణి॥ ౨౨॥

తా॥ ఇట్లుదన్తశుద్ధి యైనతరువాత సముద్రములోఁబ్రవహించునట్టి గఙ్గాదినదుల జలమందుఁగాని దేవతలచేఁ ద్రవ్వఁబడిన దిగుడుబావి కూపము మడుఁగు లోనగువాని జలమందుఁగాని స్నానమును జేయవలయును-ఆజలమునకు నితరక్షుద్రదేవతలసంబన్ధముండఁగూడదు. సజ్జనులు స్నానముచేసినదిగా నాజలముండవలయును పాచి నాఁచు మొదలైనవి యాజలమం దుండఁ గూడదు. ఆనీటితీరము పరిశుద్ధముగానుండవలయును, ఇట్టి సంబన్ధము గలదై తేలికయగు జలమందు స్నానము చేయవలయును.

నాప్సు విక్షోభయే దఙ్గై ర్పాదే నోత్పాదయే న్నచ ।
నాచరే త్ప్లవనక్రీడాం నగణ్డూషం జలే క్షిపేత్॥ ౨౩॥

తా॥ స్నానకాలమందుఁ జేతులతో నీళ్ల క్షోభము గలుగునట్లు చిమ్మఁ గూడదు. పాదములతో జలమును దన్నఁగూడదు. ఈదఁ గూడదు జలమందుఁ బుక్కిలించి యుమ్మివేయఁగూడదు

అన్యోన్యం నాక్షిపే త్తోయం నదేహమల ముత్సృజేత్ ।
నపత్స్న యే దప్సుతిష్ఠ మన్యత్తత్ర నకీర్తయేత్॥ ౨౪॥

తా॥ స్నానకాలమం దొకనిమీఁద నొకఁడు నీళ్లు చల్లుకొన గూడదు; తనమురికిని జలమందు విడువఁ గూడదు, తీర్థోదకమును నిన్దింపఁగూడదు, అతీర్థోదకమందుస్నానమును జేయునపుడు దానిని గఙ్గాదిజలమును గా భావించి పొగడవలయునుగాని నిందింపగూడదు. ఇతరవిషయంబును జెప్పఁగూడదు

శోధయి త్వోద్ధతామ్భోభి ర్దేహం తీరే పున ర్జలైః ।
ప్రక్షాళ్య భూమిం కర్తార్థ మవతారం చ శోధయేత్॥ ౨౫॥

తా॥ స్నానముచేయునపుడు దేహమందలి మురికి దేహమును దోముకొనునపుడు పడకమానదు కదా యెట్లు స్నానము చేయ వలయు ననఁగాఁ జెంబుతో నీళ్లను గట్టునకు దెచ్చుకొని యానీళ్లతో మొదట స్నానమును జేసి యొడలిమురికిని పోఁగొట్టుకొని శుద్ధిపఱచుకొని మరల తీర్థోదకమందు మునిఁగి యాతీర్థజలములతో దేహమును శుద్ధిపఱచుకొనవలయును. పిమ్మట సన్ధ్యావన్దనాదికర్మము ననుష్ఠించుకొనుటకై తాను యారేవునుగూడ శుద్ధిపఱుప వలయును

న స్నాయా త్సహ శూద్రేణ న స్త్రీభి ర్నచ నాస్తికైః ।
నపాపణ్డై ర్న బాలైశ్చ నరోగ్యాశౌచిభి ర్నరైః॥ ౨౬॥

తా॥ తాను స్నానము చేయునప్పుడు శూద్రునితోఁగాని స్త్రీలతోఁగాని నాస్తికులతోఁగాని వేదబాహ్యులతోఁగాని బాలురతోఁగాని రోగులతోఁగాని జాతాశౌచమృతాశౌచము గల వారితోఁగాని చేరి స్నానమునుజేయఁగూడదు.

చణ్డాలం శాస్త్రపతితం శాస్త్రనిన్దాపరాయణమ్ ।
పరిస్రస్తంచ నష్టంచ దూరతశ్శి పరివర్జయేత్॥ ౨౭॥

తా॥ చణ్డాలుఁడు శాస్త్రజ్ఞానములేనివాఁడు శాస్త్రములను నిన్దించువాఁడును కులభ్రష్టుఁడు, స్వధర్మకార్యములను జెఱుపువాఁడును వీరు దగ్గఱనుండ కుండఁ జూచి స్నానము చేయవలయును

శరీరం నిర్మలీకృత్య కర్మారమ్భపురస్సరమ్ ।
శుద్ధావగాహనం కృత్వా సమాచామే ద్యథావిధి॥ ౨౮॥

తా॥ 'అపవిత్రఃపవిత్రోవా' అనునట్టి కర్మారమ్భమన్త్రమును జెప్పుచు జలమును శిరస్సుమీఁదఁ జల్లుకొని శరీరమును శుద్ధపఱచుకొని పిమ్మట శుద్ధావగాహ స్నానమును జేసి శాస్త్రోక్తప్రకారముగా నాచమనమును జేయువలయును.

జాన్వోరన్తరి కరౌ కృత్వా ప్రాఙ్ముఖోవా ప్యుదఙ్ముఖః ।
పాణిఞ్చ సంస్పృశన్నద్భిః ప్రకృతిస్థాభిరేవ చ। ౨౯॥
ఆదాయ విమలం తోయం బ్రహ్మతీర్థేన వాగ్యతః।
హృద్గతంచ చతుర్ప్రాశ్నన్నిశ్శబ్ద మతారయేత్॥ 30॥

తా॥ పిమ్మట చేతులను మోకాళ్లనలోఁగాఁ జేసుకొని పూర్వముఖముగానైనను ఉత్తరముఖముగానైనను గూర్చుండి వేఁడివిగాని జలములతో హస్తములను గడిగికొని పరిశుద్ధపఱచుకొని మౌనవ్రతముగలవాఁడై పరిశుద్ధజలమును బ్రహ్మతీర్థముతోఁ దీసికొని యాజలము హృదయములోఁ బడునట్లు శబ్దములేకుండ నాల్గుసార్లు త్రాగవలయును.

తథాపామార్జనం కుర్యాత్పాణీ పాదావవోక్ష్య చ।
అఙ్గుష్ఠానామికాభ్యాంతు చక్షుషీసంస్పృశేత్తతః॥ 3౧॥
అఙ్గుష్ఠతర్జనీభ్యాంతు నాసాపుటయుగంస్పృశేత్ ।
కనిష్ఠాఙ్గుష్ఠయోగేన శ్రోత్రే చైవ సమాలభేత్॥ 3౨॥

తా॥ ఆట్లాచమించి హృదయశుద్ధిని జేసికొని హస్తములను పాదములను బ్రోక్షించుకొని బొట్టనవ్రేలితోను అనామికతోను నేత్రములను, బొట్టనవ్రేలితోను చూపుడువ్రేలితోను ముక్కురన్ధ్రములను, చిటికెనవ్రేలితోను బొట్టనవ్రేలితోను చెవులను దాఁకవలయును.

అఙ్గుష్ఠమధ్యమాభ్యాంతు బాహుమూలేతు సంస్పృశేత్ ।
హృదయంచ తతోమూర్ధ్ని జలం స్పృష్ట్వా న్తరాన్తరా॥33॥
(సర్వాభి రఙ్గుళీభి శ్చనాభిదేశ ముపస్పృశేత్ ।)

తా॥ బొట్టనవ్రేలితోను నడిమివ్రేలితోను బాహుమూలములను దాఁకవలయును. పిమ్మట నడుమనడుమ జలముదాఁకి యాహస్తముతో హృదయమును శిరస్సును దాఁకవలయును. (అన్నివ్రేళ్ళతోను బొడ్డును దాఁకవలయును)

నతిష్ఠ న్నైకహస్తేన నశూద్రావర్జితేన చ ।
శుద్ధాం మృదం సమాదాయ జప్త్వా మన్త్రచతుష్టయమ్ ॥3౪॥
చతుర్ధా విభజేత్తాంతు వామపాణితలోదరే ।
చతుర్ధస్త్రిరి పరామృశ్య ముఖబాహు కళేబరః॥ 3౫॥

పాశ్యౌ యథా క్రమం లిమ్పే చ్చతుర్థస్త్రేణ మన్త్రవిత్।
తత్రస్థం భావయే ద్దేవ మష్మయె రోగ ఘాశిభిః॥ 3౬॥

తా॥ పరిశుద్ధమైన మృత్తును దెచ్చి 'మృత్తికేహన మే పాపమ్,ఇత్యాది మన్త్రముల నాల్గింటిచేతను జపించి యెడమ యరచేతిలో నునిచికొని నాలుగుభాగములు చేసి మరల నానాలుగుమన్త్రములను జెప్పుచు నామన్త్రముల కర్థము నెఱిఁగి ముఖమును భుజములను శరీరమును పాదములను యథాక్రమముగా మరల నానాలుగుమన్త్రములను జెప్పుచుఁ బూయ వలయును, ఆమృత్తికను నిలుచుచుఁ దీసికొనిరాఁ గూడదు రెండుహస్తములతో నెత్తవలయును గాని యొకహస్తముతో నెత్తఁగూడదు. శూద్రుఁడు తెచ్చి యిచ్చినమృత్తు పనికిరాదు - అట్లు ముఖాదులయందుఁ బూసిన మృత్తికయందున్న దేవుని సుఖప్రదములగు జలమన్త్రములచేత ధ్యానింపవలయును.

ఆసనాద్యై ర్యథాశక్తి సమభ్యర్చ్య జగద్గురుమ్ ।
ధ్యాత్వా గఙ్గాం హరేరి పాదా త్పతమానాం స్వమూర్ధని॥ 3౭॥
పవిత్రాద్యన్తకాల్లిఙ్గమన్త్రై స్సిక్త్వా త్కరా త్కరాత్ ।
ధ్యాయన్నేవ పరంబ్రహ్మ యథాశక్తి నిమజ్జ్య చ॥ 3౮॥
చతు ర్నిమజ్జ్య విధివ దాచమ్యావాయ వాససః ।
ఖణ్డద్వయం శిర శ్చాఙ్గం ప్రత్యేకం పరిమార్జయేత్ ॥ 3౯॥

తా॥ పిమ్మట ఆవాహనము ఆసనము మొదలైన యుపచారములచే లోకగురువైనభగవన్తుని యథాశక్తిగా నర్చించి మరల స్నానమును జేయునపు డాజలమును సాక్షాన్మహావిష్ణువుయొక్క పాదమునుండి పడుచున్న గఙ్గనుగా భావించి 'పవిత్రో' అనునది ఆదిగాను అన్తముగాను గలిగిన యల్లిఙ్గమన్త్రములను జెప్పుచు నాజలమును జేతితో నెత్తి శిరస్సునఁ జల్లుకొనుచు శిరస్సుముదడుపవలయును పిమ్మటయథాశక్తిగాఁ బరబ్రహ్మమును ధ్యానించుచునే యొకసారి మునిఁగి మరల నాలుగుసార్లు మునిఁగి యథావిధిగా నాచమించి రెండువుండుగుడ్డలను బిండి యొకదానితో శిరస్సును మఱియొకదానితో శరీరమును ఇట్లుప్రత్యేకముగాఁ దుడిచికొని శుద్ధుఁడుగావలయును.

అన్తరాచ్ఛాద్య కౌపీనం వాససీ పరిధాయచ ।
ధ్యాన మౌనపరో మన్త్రై స్సమ్యగాచమనం చరేత్ ॥ ౪౦॥

తా॥ ఇట్లు స్నానశుద్ధుఁడైనతరువాత లోపలఁ గౌపీనమును బెట్టుకొని యొకవస్త్రమును గట్టుకొని మఱియొకవస్త్రమును బైకవేసికొని భగవన్తుని ధ్యానించి మౌనముగా భగవన్మన్త్రమును జపించుటకై యథావిధిగా నాచమనమును జేయవలయును

భోజనాద్యన్తయో స్మూత్రశౌచాన్తే యజ్ఞకర్మణి।
ద్విర్ద్విరాచమనం కుర్యాద్వాససః పరివర్తనే॥ ౪౧॥

తా॥ మఱియు నెవ్వఁడెప్పుఁడాచమనమును జేయవలయునగా భోజనాదియందును భోజనాన్తమందును మూత్రశౌచములను జేసిన తరువాతను యజ్ఞకర్మమందును వస్త్రమును ధరించినప్పుడును రెండేసి మార్లు ఆచమనమును జేయవలయును.

పుణ్యక్షేత్రసముద్భూతాం మృదం పాపాపహాం వైష్ణవీమ్।
ప్రణవాద్యేన మూలేన కర్మారంభం పునర్జపేత్॥ ౪౨॥

తా॥ విష్ణుసంబన్ధియగు పుణ్యక్షేత్రమందు దున్న మృత్తును దీసికొని దానిని 'ఓం నమోనారాయణాయ' అను మూలమన్త్రముతో నభిమన్త్రించి మరలఁ గర్మారమ్భ మన్త్రమును జపింప వలయును

ఆహృత్యామ్బు పవిత్రేణ కృత్వా సవ్యకరే౽పరే।
కర్మారమ్భేణ మన్త్రేణ మృదమాలోడయేత్తతః॥ ౪౩॥

తా॥ అట్లు జపించినతరువాత-పవిత్రాద్యన్తమన్త్రమును జెప్పుచు జలమును దెచ్చి దానిని ఎడమయరచేతిలో నుంచుకొని పిమ్మటః గర్మారమ్భమన్త్రమును జెప్పుచు మృత్తును జలమును జేర్చి పుర్దింప వలయును.

బ్రహ్మణా తత్సమీకృత్య ధ్యాయేద్దేవం సనాతనమ్।
ప్రదేశిన్యా సమాదాయ కించిచ్ఛిరసి ధారయేత్॥ ౪౪॥

తా॥ జలమును గలిపినమృత్తును బర్బ్రహ్మముతో సమానముగాఁ నెంచి సనాతనుం డగుదేవుని ధ్యానింప వలయును, పిమ్మట నామృత్తును గొంచె మెత్తి చూపుడువ్రేలితో శిరస్సున ధరింప వలయును

లలాటబాహుహృదయే ష్వాద్యవేన ప్రదీపవత్।
కృత్వోర్ధ్వపుండ్రాన్నామ్నాంచచతుర్ణాం న్యాసమాచరేత్॥ ౪౫॥

తా॥ పిమ్మట నొసలు భుజములు హృదయము ఈనాలుగింటియందును ఆమృత్తుతో దీపాకారముగా నూర్ధ్వపుండ్రములను ధరించి కేశవాది నామములను నాలింటిని ఆయూర్ధ్వపుండ్రములయందు వరుసగా వ్రాసియుంపవలయును

పరేద్ద్వాదశకం నామ్నాం తత్తత్స్థానేషు యోద్విజః।
సవేత్సాన్నఫలం తస్య మృదా లిప్తే దినేదినే॥ ౪౬॥

తా॥ పిమ్మట నాయాస్థానములయందు ద్వాదశోర్ధ్వ పుండ్రములను ఆవృత్తితో ధరించి పరుసగాం గేశవాదిద్వాదశనామములను బఠింప వలయును, ఇట్లు ప్రతిదినమును జేసినవానికి గఙ్గాదిపుణ్య నదీస్నానఫలము గలుగును

తత ఆచమ్య విధివ దభిజ్ఞాదీంశ్చ తర్పయేత్ ।
నమోన్తై రి ప్రణవాద్యైశ్చ పిత్ర్యాణాం కేవలైస్స్వకైః॥ ౪౭॥

తా॥ పిమ్మట యథావిధిగా నాచమనమును జేసి నిత్యసూర్యాదులనామముల ముందట 'ఓమ్'అనుదానిని అంతమందు 'నమః' అనుదానినిజేర్చి చెప్పి నమస్కరించి వారికి దృప్తిచేయు వలయును. పితృదేవతలనామములనుమాత్రము చెప్పి వారికిం దర్పణమును జేయ వలయును

చతుర్వస్త్రేణ సంప్రోక్ష్య పీత్వా తే నాభిమన్త్రితమ్ ।
జల మాచమ్య మూలేన దద్యా దర్ఘ్యం పరాత్మనే॥ ౪౮॥

తా॥ ఇట్లు తర్పణము చేసినతరువాతం బరమాత్మ కర్ఘ్యమియ్య వలయును ఎట్లనంగా, అప్పుడు మరియుగా, 'అపవిత్రఃపవిత్రోవా ఇత్యాది చతుర్వస్త్రములచే నభిమన్త్రించినజలమును దనమీఁదంజల్లుకొని యాచమించి త్రాగి పిమ్మట, ఓం నమో నారాయణాయ, అనునట్టి మూలమన్త్రమునుజెప్పుచుఁ బరమాత్మ కర్ఘ్యమియ్య వలయును.

మర్త్యఖాతే పి వా స్నాయా దద్భ్య ఉద్ధృత్య తన్మృదమ్।
ధ్యాత్వా క్షీరార్ణవం తచ్చ నిత్యం శిష్టనిషేవితమ్ ॥ ౪౯॥

తా॥ స్నానమున కట్టు దేవఖాతాదికము సంభవింపనియెడల మనుష్యులచేతఁద్రవ్వఁబడినసరస్సునం దైనను స్నానముచేయవలయును. స్నానము చేయుటకుముందు ఆసరస్సునందలి మృత్తునుగొంచెము ఆనీళ్లలోనుండి యెత్తి పారవేయవలయును. నిత్యము శిష్టులువచ్చి స్నానము చేయునట్టిదిగా నాజల ముండ వలయును - అట్టి సరోజలమును క్షీరసముద్రజలమునుగా భావించి పిమ్మట స్నానము చేయ వలయును.

కూపతోయై రపిస్నాయా త్సర్వాలాభే సముద్ధృతైః ।
స్నానంతు నఘటైః కార్యం నాసాఛిద్ర వివర్జితైః ॥ ౫౦॥

తా॥ అట్లు దేవఖాతము మనుష్యఖాతము స్నానమునకు సంభవింపనియెడల నూతినీళ్లను తోడుకొనియైనను స్నానము చేయ వలయును-ముక్కు రంధ్రమువంటి రంధ్రములులేనిఘటములచేత (తిరుక్కావేరికానిపాత్రములచేత)స్నానము చేయ రాదు.

ఆరనాళం న సేవేత కదాచిద్భగవత్పరః ।
సురాకల్పం హి తజ్జ్ఞేయం తస్మాద్యత్నేన వర్జయేత్॥　౫౧॥

తా॥ సావతీర్థమును అనఁగాఁ బుల్లనీళ్లను భగవద్భక్తుఁ డెప్పుడును ద్రాగఁ గూడదు-ఏల యనఁగా నది కల్లుతో సమానము గనుక దాని నతిప్రయత్నముతో విడువ వలయును.

ద్వాదశీనవమీషష్ఠ్యాంత్రయోదశ్యష్టమీషు చ ।
ద్వితీయాయాం దశమ్యాంచ స్నాయాద్ధామలకోదకైః॥౫౨॥

తా॥ ద్వాదశి నవమి షష్ఠి త్రయోదశి అష్టమి విదియ దశమి ఈ తిథుల యందు నెల్లికాయరసముగలిపిన నీళ్లతో స్నానము చేయ వలయును.

గ్రాహాదిసేవితే రూక్షే నీచావాససమీపగే ।
శ్మశానపార్శ్వగే౽జ్ఞాతే నస్నాయాన్నో పరోద్ధృతే॥　౫౩॥

తా॥ మొసలి మొదలైన దుష్టజంతువులు గలజలమందును - ఇసుకరేవుగాక తాళ్లమీద లసువానిచేఁ గఠినమైన స్థలమందలిజలమందును నీచులనివాసస్థానమునకు దగ్గఱ నున్నజలమందును రుద్రభూమికిఁ జెంతనున్న జలమందును లోఁతు తెలియనిచోట నున్నజలమందును ఇరుకుచోలను స్నానము చేయఁగూడదు.

న భుక్త్వా నాతురో౽జీర్ణే నాన్యకామీ న కామతః ।
న నిశాయాం తథైకాకీ న చిరం తోయమధ్యగః॥　౫౪॥

తా॥ భోజనము చేసినతరువాత స్నానము చేయఁ గూడదు. రోగిగ నుండునపుడు స్నానము సేయరాదు భుజించినపదార్థము అఱగక యుండునపుడు స్నానము చేయఁ గూడదు. మఱియొకనికి స్నానఫలము గలుగుటకై తాను స్నానముచేయ రాదు-తానుస్నానఫలమునుకోరి స్నానముచేయరాదు రాత్రియందు జలకమాడఁ గూడదు. ఒంటరిగా స్నానము చేయ వలదు-నీళ్లనడుమఁ జిరకాలముండి స్నానము చేయఁ గూడదు.

అజ్ఞానాచరితే పాపే దృష్ట్వా చ శవసూతికే ।
వమనేచ వ్యవాయేచ దుస్స్వప్నే స్నానమాచరేత్॥　౫౫॥

తా॥ తెలియక యేదైన నొకపాపకార్యమును జేసినయెడల దానిని బోఁగొట్టు కొనుటకై స్నానము చెయ వలయును. అట్లే శవమును బాలింతను జూచినను - వాన్తి యైనను రతిసలిపినను దుస్స్వప్నమైనను స్నానము చేయ వలయును

ముక్త్వాఽశ్రు శోకాచ్ఛ్రిత్వా చ న్యస్తాఙ్గం పాఞ్చకాలికమ్ ।
స్పృష్ట్వా వికారధర్మస్థం స్నాయా ద్రోగిణమేవ చ ॥ ౫౬॥

(ముక్త్వాఽశ్రు శోకాన్నజ్ఞాత్వాస్పృష్ట్వా పాఞ్చకాలికాః)

తా॥ దుగిలము వలనఁ గంట నీరుకారినను అయిదుకాలములయందును జేయఁ దగినవేదోక్తకర్మములను జేయునతఁడు పరలోకగతుఁడైనట్లు విన్నను శాస్త్రవిరుద్ధ ధర్మములను జేయునట్టి పాపిని దాఁకినను రోగిని దాఁకినను స్నానముచేయ వలయును. (చముసుగల యెముకలు రక్తము శుక్లము వీటిని గర్భిణిస్త్రీలైనవారిని దాఁకినను స్నానము చేయ వలయును)

ఉక్త్వా మర్మగతం వాక్యం హుఙ్కారం భర్త్సనం గురౌ ।
వివాదం చ జపస్నాననమస్కారైః పునశ్శుచిః ॥ ౫౭॥

తా॥ శిష్యుఁ డొకవేళఁ దెలివి లేక గురువుయొక్క రహస్యపుమాటను బయలు పెట్టినను గురువును హుంకరించినను గురువును బెదిరించినను విరుద్ధముగా గురువుతో వాదించినను దానివలనఁ గలిగినపాపమును బోఁగొట్టుకొనుటకై స్నానముచేసి గురువును నమస్కరించి గురుపరంపరామన్త్రమును జపింప వలయును. అట్లుచేసినయెడలఁ బరిశుద్ధుఁడగును

శిరో విసర్జ్య న స్నాయా న్నిమజ్జే త్తామునా సహ ।
న స్నానశాటీం పాణిభ్యాం మర్దయే దపి వా శిరః ॥ ౫౮॥

తా॥ మఱియు శిరస్సును వదలి స్నానము చేయఁ గూడదు. శిరస్సుతోఁగూడనే స్నానము చేయవలయును అప్పుడు కట్టుకొన్నవస్త్రమును జేతులతో మర్దింపఁ గూడదు ఆవస్త్రముతోఁ దలను దుడుచుకొనఁ గూడదు

న కుర్యా దార్ద్రవస్త్రేణ కర్మ భాగవతం బుధః ।
న దక్షిణాముఖోఽశుద్ధగి పైశాచం తదుదాహృతమ్ ॥ ౫౯॥

తా॥ తెలిసినవాఁడు భగవత్సమ్ముఖోల్లాసకరమైన సన్ధ్యావన్దనాదికర్మమును తడి వస్త్రమును గట్టుకొనియు, దక్షిణపుదిక్కున కెదురుగాఁ గూర్చుండియు అపవి

శుద్ధిఁ బయ్యాప జేయఁగూడదు-అట్లుచేసినకర్మము పైశాచకర్మమనఁబడును. అనఁగాఁ పిశాచ ప్రీతికరమైయుండునుగాని భగవత్ప్రియముగాదనుట

ప్రమృజ్యాఽజానుచరణౌ మృజ్జలైః కూర్పరావధి ।
హస్తౌ విమృజ్య వదనం విద్వానాచమనం చరేత్ ॥ ౬౦॥

తా॥ ఆచారధర్మములను దెలిసికొన్నవాఁడై ఆచమనమును జేయునప్పుడెల్ల ముందుగాఁ గాలుసేతులు గడిగికొనవలయును - మృత్తుగలిపినజలముతోఁ గడిగికొనవలయును. కాలుసేతులు గడిగికొన్నప్పుడెల్ల మోఁకాళ్లవఱకును మోఁచేతులవఱకును గడిగికొనవలయును - పిమ్మట ముఖము గడిగికొని యాచమనమును జేయవలయును

సుప్త్వా క్షుత్వా చ నిష్ఠీవ్య స్పృష్ట్వా నాసాపుటాదికమ్ ।
పీత్వోదకంచ భక్ష్యాంశ్చ సంభక్ష్యాచమనం చరేత్ ॥ ౬౧॥

తా॥ నిద్రించినను తుమ్మినను ఉమ్మివేసినను ముక్కులోఁ మలమును కంటిలోఁ బుసిని దీసినను నీళ్లుద్రావినను భక్ష్యములను భుజించినను ఆచమింప వలయును.

స్నాత్వా సంప్రేక్ష్య పతితాంశ్చణ్డాలాద్యాంశ్చ గర్హితాన్ ।
పాషణ్డినశ్చ స్వాచాన్తః పవిత్రం ధ్యానవాన్ జపేత్ ॥ ౬౨॥

తా॥ బ్రహ్మహత్యాదిపాపములను జేసినవారిని చణ్డాలురు మొదలైనవారిని వేదబాహ్యులను నిన్దింపఁదగినవారిని జూచినయెడల స్నానము చేసి యాచమించి భగవన్తుని ధ్యానించి పవిత్రమైనభగవన్మన్త్రమును జపింప వలయును.

పూజాయాం స్నానకాలేచ భోజనే జపకర్మణి ।
అవైష్ణవానాం జన్తూనాం దర్శనాద్యం వివర్జయేత్ ॥ ౬౩॥

తా॥ పూజాకాలమందును స్నానకాలమందును భోజనకాలమందును జపించునపుడును విష్ణుభక్తి లేనిప్రాణులను జూడఁగూడదు- తాఁకఁగూడదు - వారితో భాషింపను గూడదు ఇంక నేవిధమైన సమ్పర్కమును వారితోఁ జేయఁగూడదు.

నిత్యం తీర్థోదకస్నాయీ తర్పయంస్తత్ర తజ్జలైః ।
శ్రద్ధయా భగవద్భక్తైః స్నిగ్ధస్స్యాదచిరా ద్ద్విజః ॥ ౬౪॥

తా॥ నిత్యము కావేరి గఙ్గమొదలైన పుణ్యనదుల జలమందు స్నానముచేసి యా పుణ్యజలములతో దేవర్షి పితృతర్పణముచ జేసి శ్రద్ధతో భగవన్మన్త్రములను జపించెడి ద్విజుఁడు శీఘ్రముగా మనోరథసిద్ధి గలవాఁడగును,

కర్మారమ్భేణ మన్త్రేణ సర్వం కర్మ సమారభేత్।
పవిత్రీకరణం చాపి పవిత్రేణైవ సర్వతః॥ ౬౫॥

తా॥ ఏకర్మము నారమ్భించినను 'అపవిత్రః పవిత్రోవా' అనునట్టి కర్మారమ్భ మన్త్రమును జెప్పి యారమ్భింప వలయును. ఆమన్త్రము పవిత్రమైనది గనుక దానిని మొదటఁ జెప్పిచేసినకర్మము లన్నియుఁ బరిశుద్ధములగుచున్నవి.

అభిగచ్ఛేచ్ఛదేవేశం సుస్నాత శ్శోర్ధ్వ పుండ్రకః।
సుప్రక్షాలితపాదశ్చ స్వాచాన్త స్సంయతేన్ద్రియః॥ ౬౬॥

తా॥ భగవద్దర్శనార్థము కోవెలకుఁ బోవునప్పుడు యథావిధిగా స్నానముచేసి ఊర్ధ్వపుండ్రములను ధరించి బాగుగాఁ బాదప్రక్షాలనమును జేసి శాస్త్రోక్త ప్రకారముగా నాచమించి జితేన్ద్రియుఁడై కోవెలకుఁ బోవలయును.

సన్ధ్యయో రుభయో ర్నిత్యం యావదర్కర్క్ష దర్శనమ్।
ధ్యాయ న్బ్రహ్మ జపేన్మౌనీ తతోఽభిగమనక్రియా॥ ౬౭॥

తా॥ భగవద్దర్శనమున కెప్పుడెట్లు పోవలయుననఁగాఁ బ్రాతఃకాలమందు సూర్యదర్శనమైన తరువాతను సాయంకాలమందు నక్షత్రదర్శన మైనతరువాతను అంతవఱకు పరబ్రహ్మమును ధ్యానించుచు భగవన్మన్త్రము నెవరితో మాటలాడకుండ జపింపవలయును పిమ్మట భగవద్దర్శనార్థ మాలయమునకుఁ బోవలయును.

నైకవస్త్రో న ఖిన్నశ్చ న క్రుద్ధో మలినోఽపివా।
నా క్షాలితాఙ్ఘ్రి ర్నాభ్యక్తో నాతురో న వద న్బహు॥ ౬౮॥

తా॥ పెరుమాళ్లను సేవించుటకుఁ బోవునపుడొకవస్త్రమును ధరించుకొని పోఁగూడదు - మనోదుఃఖము క్రోధమును గలవాఁడై పోఁగూడదు మనస్సునఁగపట ముంచుకొని పోఁగూడదు - పాదప్రక్షాలనమును జేసికొనక పోఁగూడదు. నూనెను దలకు మర్దించుకొని పోఁగూడదు. రోగపీడితుఁడైనప్పుడును బోఁగూడదు-అధికముగా వ్యర్థపుమాటలను జెప్పుచు బోఁ గూడదు.

న రక్తకృష్ణమలినం వాసోఽపి పరిధాయ చ ।
నచ శూన్యకరశ్చైవ న యాయా ద్భగవద్గృహమ్॥ ౧౯॥

తా॥ ఎఱ్ఱనివస్త్రమునుగాని నల్లనివస్త్రమునుగాని మురికివస్త్రమునుగాని ధరించి పోఁగూడదు - పుష్పఫలతాంబూలాదులను సమర్పించుటకుఁ జేతఁబెట్టుకొని పోవలయునుగాని ఉత్తచేతులతోఁ గోవిలకుఁ బోఁగూడదు-మఱియు నాయుధములు చేతఁ బెట్టుకొని పోఁగూడదు,

ప్రణమ్య దణ్డవ ద్భూమా వుత్థాయోత్థాయ తన్మనాః।
స్వాధ్యాయవదనః కుర్యా దష్టాఙ్గేన నమస్క్రియామ్॥ ౨౦॥

తా॥ కోవిలలోపలికి బోవుచుండునపుడు దండమువలెభూమిమీఁదఁబడి నమస్కరించి మరలలేచి మరల నట్లేపడి నమస్కరించుచు లేచుచు నాభగవంతునియందే మనస్సునుంచి వేదములను జెప్పుచుఁ బిమ్మట సాష్టాఙ్గనమస్కారము భగవంతునికిఁ జేయ వలయును.

నమస్కుర్వ న్ప్రతిదిశం వాగ్యతో ధ్యానతత్పరః ।
అసంసక్తకరః కైశ్చి న్నదం కుర్యా త్ప్రదక్షిణమ్॥ ౨౧॥

తా॥ కోవిలను జుట్టి వచ్చునప్పుడు నాలుగుదిక్కులయందును మూల దిక్కులయందును భగవంతునికి నమస్కరించుచు వేఱుమాటలను జెప్పక శ్రద్ధాభక్తులతో భగవంతునినే ధ్యానించుచు ఇతరులచేతులు తనచేయియుఁ గూడుకొనకుండ జేయక మెల్లగా నడుచుచుఁ గోవిలను జుట్టి రావలయునుగాని త్వరితముగా నడిచి చుట్టఁగూడదు,

ద్విచతుష్షడ్దశాష్టాద్యై రేవం కుర్యా త్ప్రదక్షిణమ్ ।
దేవస్య నికటే కార్యం సద్భి ర్గాఢప్రదక్షిణమ్॥ ౨౨॥

తా॥ కోవిలకుఁ బ్రదక్షిణము నెన్నిసార్లు చేయవలయుననఁగా రెండుసార్లుగాని నాలుగుసార్లుగాని ఆఱుసార్లుగాని ఎనిమిదిసార్లుగాని పదిసార్లుగాని ఇట్లెన్నిసార్లయినను సరిసంఖ్యగాఁ బ్రదక్షిణమును జేయ వలయును మఱియు స్వామిసమీపంబున మోఁకాళ్లతోఁ బ్రదక్షిణము చేయుట యుత్తమము అట్లే సజ్జనులు చేయవలయును.

చక్రవ ద్భ్రమయే న్నాఙ్గం పృష్ఠభాగం నదర్శయేత్ ।
సన్నిధౌ దేవదేవస్య నచోచ్చైః ప్రలపే త్తథా॥ ౨౩॥

తా॥ భగవన్తున కెదురుగా శరీరమును చక్రమువలెఁ ద్రిప్పఁగూడదు. అనఁగా నాత్మప్రదక్షిణమును జేయఁగూడదు తనపృష్ఠభాగము దేవదేవునకు నెదురుగాఁజూపఁ గూడదు - అట్లు వ్యర్థపుమాటలను గట్టిగాఁజెప్పఁగూడదు.

నిధాయ దణ్డవద్దేహం ప్రసార్య చరణౌ కరౌ ।
బద్ధ్వా ముకుల వత్పాణీ ప్రణామో దణ్డసంజ్ఞితః ॥ ౭౪

తా॥ దణ్డప్రణామ మెట్టిదనఁగా దేహమును దణ్డాకారముగా భూమియందు నుంచి కాలుసేతులను జాచి రెండుహస్తములను మొగ్గవలెముడిచి చేసినసమస్కారము దణ్డప్రణామమనఁబడును

పాదౌ శిరస్తథా హస్తౌ నికుఞ్చ్య ముకులాకృతీ ।
మనోబుద్ధ్యభిమానైశ్చ ప్రణామోఽష్టాఙ్గ సంజ్ఞితః ॥ ౭౫॥

తా॥ పాదములురెండు శిరస్సు మొగ్గవలె ముడిచిన హస్తములురెండును మనస్సు బుద్ధి అభిమానము (అనురాగము) అనునవి మూఁడును ఈయెనిమిదిటితో నగునట్టి నమస్కారము, అష్టాఙ్గ నమస్కార మనఁబడును.

మస్తిష్కం సంపుటం చైవ ప్రహ్వాఙ్గం చ త్రయం బుధైః ।
కృతయోః రసయోః కార్య మన్యథా వికలో భవేత్॥ ౭౬॥

తా॥ ఇట్లు దణ్డప్రణామము చేయునపుడును సాష్టాఙ్గ నమస్కారము చేయునపుడును నమస్కారము చేయుఁటకుఁదగినంత శరీరబలంబును చేమోడ్పును అణఁకువయును గలిగియుండవలయును అట్లుకానియెడల ఆనమస్కారములు వ్యర్థములగును.

సర్వత్ర దృష్ట్వా దేవేశం జితన్త ఇతిమన్త్రకమ్ ।
ద్వాదశార్ణం జపేన్మన్త్రంభీత వత్ప్రార్థమానతః ॥ ౭౭॥

తా॥ మఱియును సర్వదేవతలకును ప్రభువగు భగవన్తుని అంతటను నిండియున్న వానినిగాఁ దలఁచి భయభక్తులును అణఁకువయును గలవాఁడై జితన్త ఇత్యాద మన్త్రమును "ఓంనమో భగవతే వాసుదేవాయ" అనునట్టి ద్వాదశాక్షర మన్త్రమును జపింపవలయును (ఆర్షముగనుక) ద్వాదశార్ణ అనుచోనుండు వర్ణశబ్దమందు వ్ అనునది లోపించెను.

మత్కృతాని చ కర్మాణి మదీయ మహా మచ్యుత ।
తత్రైవ నమ మేలీష్టం నమో భగవతేతి చ ॥ ౭౮॥

ప్రదక్షిణనమస్కారజపధ్యానార్చనస్తుతీః ।
తత్కర్మ తద్గుణోద్ఘోషై ర్వినా నాత్రాన్య దాచరేత్ ॥ ౭౯ ॥

తా॥ ఓయచ్యుతుఁడా! నేను జేయు కర్మములను నీవే నాదియగు సమస్తమును నీదే. నేనును నీవాఁడనే. నాది యెద్దియు లేదు. ప్రదక్షిణనమస్కారమును జపమును ధ్యానమును పూజను స్తుతిని జేయవలయును. భగవత్ప్రీతికరమైనయాకర్మమును జేయు నపుడు భగవంతునికల్యాణగుణములను భక్తితోఁ జెప్పుట తప్ప యితరవిషయములను దలంపఁగూడదు చేయనుగూడదు

పాదప్రసారణం వ్యాఖ్యాం విస్తరం చావకుణ్ఠనమ్ ।
న కుర్యా ద్భగవద్గేహే హాసం కణ్ఠధ్వనిం తథా ॥ ౮౦ ॥

తా॥ భగవంతుని బూజించుగృహమందుఁ గాళ్లుచాఁచుకొనఁగూడదు విశేషముగా మాటలాడఁగూడదు తుచ్ఛమొదలైనవానిమీఁదఁ గూర్చుండఁగూడదు-పైవస్త్రమును నడుమునకుఁ గట్టుకొనవలయునుగాని ముసుకుగాఁ గప్పుకొనఁగూడదు నవ్వఁగూడదు - అఱవఁగూడదు.

భోజనం స్వాప ముద్ఘోషం తామ్బూలం కేశశోధనమ్।
ఛత్త్రాద్యైశ్చ తథాన్యాశ్చ నకుర్యా దుల్బణక్రియాః ॥ ౮౧ ॥

తా॥ మఱియు భగవన్మందిరమందు భుజింపఁగూడదు నిద్రింపఁగూడదు- అఱవఁగూడదు తాంబూలమును వేసికొనఁగూడదు. తలవెండ్రుకలను దువ్వుకొనఁగూడదు గొడుగు మొదలైన దానిని ధరించుకొనఁగూడదు. స్వాతిశయమును దెలుపునట్టి యితరచేష్టలను జేయఁగూడదు.

ప్రదక్షిణే ప్రణామేచ పూజాయాం హవనే తథా।
న కణ్ఠగతవస్త్ర స్స్యా ద్దర్శనే గురుదేవయోః ॥ ౮౨ ॥

తా॥ ప్రదక్షిణముచేయునప్పుడును నమస్కారముచేయునప్పుడును పూజాకాలమందును హోమము చేయునప్పుడును గురుదర్శనదేవదర్శనకాలములయందును పైవస్త్రమును నడుమునకుఁ గట్టుకొనవలయును గాని కణ్ఠమువఱకు వస్త్రమును మైనవేసికొనఁగూడదు.

భగవన్మన్దిరే వృద్ధా న్సూజ్యానపి విశేషతః ।
వినా భాగవతశ్రేష్ఠా న్ప్రణామాద్యై ర్నచార్చయేత్ ॥ ౮౩ ॥

తా॥ భగవన్మన్దిరమం దెవశైన వృద్ధులు పూజింపఁదగినవారుగానుండినను భాగవతశ్రేష్ఠులు కానియెడల వారిని నమస్కారము మొదలైనవానిచే విశేషముగాఁ బూజింపఁగూడదు.

గురోర్గృహే దేవగృహే పుష్పవాట్యాం గవాం కులే।
కృపణం చోల్బణం కర్మ వర్జయే దపి సంసది॥ ౨-౪॥

తా॥ గురుగృహమందును దేవగృహమందును-పూలతోఁటయందును గోసమూహమందును సభయందును నీచకర్మమునుగాని గర్వముతోఁగూడిన పనినిగాని చేయఁగూడదు.

జప్త్వా భిగమనం మన్త్ర మర్చయిత్వా యథావిధి।
ఆసనార్ఘ్యాదిభి ర్భోగై ర్భక్త్యా పరమపావనైః॥ ౨-౫॥

అభిగమ్య జగన్నాథం ధ్యాయన్నేవ సనాతనమ్॥
జపే ద్యథాబలం ప్రాత స్సహస్రశతసంఖ్యయా॥ ౨-౬॥

తా॥ అభిగమన మన్త్రమును జపించి పరిశుద్ధాన్తఃకరణము గలవాఁడై భక్తితో నాసనము అర్ఘ్యము మొదలైన యుపచారరూపభోగములచేత సనాతనుండైన జగన్నాథుని యథావిధిగా నర్చించి ధ్యానించుచునే యెదురొక్కని వేయిమార్లు ప్రాతఃకాలమందు జపింపవలయును - అన్నిసార్లు జపింప శక్తిలేనియెడల శక్త్యనుసారముగా జపింపవలయును.

కనిష్ఠాది సమారభ్య దశపర్వభి రత్వరః।
పద్మాక్షై స్స్ఫటికై ర్వాపి జపే న్ముక్తాభి రేవవా॥ ౨-౭॥

తా॥ చిటికెనవ్రేలుమొదలుకొని నాలుగువ్రేళ్లయందునుండు కణుపులను ఒదింటిని బొట్టనవ్రేలితోఁ దాఁకుచునైనను తామరపూసలమాలతోనైనను స్ఫటికములమాలతోనైనను ముత్తియములతోనైనను సావకాశముగా నాయభిగమనమన్త్రమును జపింపవలయును.

ఆచార్య మేకభక్తించ భగవన్మన్దిరం జలమ్।
అగ్నిమర్కంచ సోమంచ పృష్ఠీకృత్య జపేన్నచ। ౨-౮

తా॥ ఆచార్యుని మఖ్యభక్తుని అగ్నిని సూర్యచన్ద్రులను భగవన్మన్దిరమును జలంబును తనకు వీపుతట్టుగాఁజేసికొని జపింపఁగూడదు.

ఆపీఠా న్మౌలిపర్యంతం పశ్యతః పురుషోత్తమమ్ ।
జపతః పాతకాన్యాశు నశ్యన్తి సఫలాః క్రియాః ॥ ౯౯॥

తా॥ పీఠము మొదలుకొని శిరస్సువఱకును దివ్యమఙ్గళ విగ్రహముచేఁ బ్రకాశించునట్టి పురుషోత్తముని సేవించుచు భగవన్మన్త్రమునుజపించువానియొక్క పాపములన్నియు వేగముగా నశించును. అతండు చేయుపనులన్నియు సఫలములగును.

ఆభిముఖ్యం జపాదీనాం ప్రశస్తం సర్వకర్మసు ।
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా కుర్యాద్భాగవతః క్రియాః॥ ౯౦॥

తా॥ అన్నిపనులలో జపాదికర్మములను జేయుటకు మంచి దిక్కున కెదురుగానుండుట ప్రశస్తమైనది. ఏ దిక్కునకు నెదురుగానుండుట ప్రశస్తమై యుండుననఁగా నుత్తరదిక్కునకైనను తూర్పు దిక్కునకైనను ఎదురుగానుండుట ప్రశస్తమైయుండును గనుక భగవద్భక్తుఁడు ఉత్తరాభిముఖుఁడుగానైనను తూర్పున కెదురుముఖము గలవాఁడుగానైననైనను భగవన్ముఖోల్లాసకరములైన జపాదికర్మంబులను జేయవలయును. అట్లుచేసిన నవి సఫలములగును.

అగ్నించ జుహుయా త్ప్రాతః శ్రేష్ఠై రేవ సమిత్కుశైః ।
వైశేషికంచ జుహుయా న్నిత్యం వా పాపశాన్తయే॥ ౯౧॥

తా॥ ప్రాతఃకాలమందుఁ బవిత్రములైన సమిధలను (చిదుగులను) దర్భలను అగ్నియందు హోమమునుజేయవలయును అనఁగా హోమద్రవ్యములచే నగ్నిని బ్రాతఃకాలమున నారాధింపవలయును, మఱియు యజ్ఞాదికాలవిశేషమందలి యగ్నినిగూడ హోమద్రవ్యములచే నెడతెగకుండ వ్రేల్చి యారాధింపవలయును. అట్లారాధించినయెడల పాపములు నశించును.

ఆముహూర్తా త్తువై బ్రాహ్మా దన్యూనం ప్రహరా త్సుధీః।
స్నానార్చనజపధ్యాన స్తోత్రపాఠై ర్వినోదయేత్॥ ౯౨॥

తా॥ స్నానము - తిరువారాధనము - జపము - ధ్యానము - స్తోత్రపాఠములు వీనిచేత బుద్ధిమంతుఁడు బ్రాహ్మముహూర్తము మొదలు ఒక జామునకుఁ గొఱఁతలేకుండ గడపవలయును.

ఇతిశ్రీ శాణ్డిల్యస్మృతౌ విశిష్టధర్మశాస్త్రే

ద్వితీయోఽధ్యాయః.

శ్రీభాష్యయుక్తమైన శాణ్డిల్యస్మృతియను విశిష్ట ధర్మశాస్త్రమందు

రెండవయధ్యాయము ముగిసెను.

---

## అథ తృతీయోఽధ్యాయః.

---

మునయ ఊచుః—

తా॥ మునులడిగిరి.

ఉపాదానవిధిం సమ్యక్ శ్రోతు మిచ్ఛామహే వయమ్।

యోగ్యాయోగ్య విభాగేన భగవత్కర్మ సిద్ధయే॥ ౧.

తా॥ ఓశాణ్డిల్య మహర్షి! భగవంతున కుల్లాసమును జేయునట్టికర్మములు సఫలములగుటకై తగినవస్తువులేవో తగనివస్తువులేవో వానివిభాగమును జెప్పి భగవత్పూజార్థమేవస్తువుల నెత్తుకొనవలయునో యావిషయమును విశదముగాఁ జెప్పవలయును మేము వినఁగోరుచున్నామని మునులు శాణ్డిల్యమహర్షి నడిగిరి.

శాణ్డిల్య ఉవాచ - శాణ్డిల్యమహర్షి చెప్పెను.

ఉపాదాన విధిం వక్ష్యే యోగ్యాయోగ్య విభాగతః ।

ద్వితీయకాలకర్తవ్యం యత్కర్మమునిపుఙ్గవాః ॥ ౨॥

తా॥ ఓమునిశ్రేష్ఠులారా! భగవత్కర్మసిద్ధికి యోగ్యవస్తువులేవో అయోగ్యవస్తువులేవో వాని విభాగంబును యోగ్యవస్తుస్వీకారంబును చెప్పెదను. మఱియు మొదటికాలమునందుఁ జేయఁదగిన స్నానార్చన జపధ్యాన స్తోత్రపాఠ రూపకర్మములను జెప్పితిని రెండవకాలమునఁ జేయదగిన కర్మమేదో దానిని జెప్పెదనువినుఁడు.

తచ్ఛృణుధ్వం సమాసేన యజ్ఞానా చ్ఛుద్ధి మృచ్ఛతి।
కర్మణ్య మేవోపాదాయ వర్జయిత్వా తథేతరత్ ॥ 3॥

తా॥ భగవత్కర్మసిద్ధికేది యోగ్యమో దానినే గ్రహింపవలయును ఇతరవిషయమును విడువవలయును, దానిని సంగ్రహముగాఁజెప్పెద వినుఁడు ఆవిషయమును దెలిసికొనుటవలన మనశ్శుద్ధిగలుగును

క్రియమాణాని కర్మాణి ఫలన్తే నాత్ర సంశయః।
స్వకీయారామజాతాని వన్యా న్యన్యాని వా దరాత్ ॥ ౪॥

పుష్పపత్రోదకాదీని ప్రాతరేవ సమాహరేత్ ।
క్రయేణ వా హరే త్సర్వ మపక్వం యాగసాధనమ్ ॥ ౫॥

తా॥ అట్లు భగవత్కర్మమునకుఁ దగినివస్తువులను విడిచి తగినవస్తువులను ఎత్తికొని చేయఁబడు కర్మములు సఫలములగును ఈవిషయమున సందేహమేమియులేదు. మఱియుఁ బత్రము పుష్పము ఫలము జలము మొదలైనవానిని తనతోఁటనుండికాని ఇతరులతోఁటనుండికాని ప్రాతఃకాలమందు శ్రద్ధాభక్తులతోఁ దెచ్చుకొనవలయును - అట్లు సంభవింపనియెడలఁ గ్రయమునకైనను దేవపూజాద్రవ్యమును సంపాదించుకొనవలయును పక్వపదార్థములను మాత్రము దేవపూజార్థము కొనఁగూడదు

ఫలపుష్పామ్బుకాష్ఠాద్యం విక్రీణీయాన్న కించన।
విక్రీణ న్బ్రాహ్మణో ద్రవ్యం క్రీణన్వా వృద్ధికాఙ్క్షయా॥ ౬॥
భిన్నవృత్తి ర్ద్విః కర్మస్థ స్తత్పథా చ్చ్యవతే నరః।
వార్ధుష్య ముపజీవన్తి యేద్విజా లోభమోహితాః ॥ ౭॥
అభోజ్యాన్నా అపాఙ్క్తేయాఃక్రియాస్తే షాం చ నిష్ఫలాః।

తా॥ మఱియుఁ దాను ఫలము పుష్పము జలము-సమిత్తులు మొదలగు ద్రవ్యమును గొంచెమైనను ధనవృద్ధికై అమ్మఁగూడదు, కొనఁగూడదు, అట్లు తన బ్రాహ్మణవృత్తిని విడిచి క్రయ విక్రయరూపవిరుద్ధకర్మమును జేయువాఁడు సన్మార్గమునుండి తొలఁగును - మఱియు నేబ్రాహ్మణులు ధనలోభముచే వడ్డిచేత జీవించుచున్నారో వారింట భుజింపఁగూడదు-వారిని బఙ్క్తినిబెట్టుకొని భుజింపనుగూడదు. వారు చేయు పనులన్నియు వ్యర్థములగును

పుష్పమూలఫలాదీని శాకాని వివిధానిచ ॥ ౯॥
స్వేషుస్వేషు చ కాలేషు శ్రద్ధయాత్మార్జ యేద్గృహీ।

తా॥ గృహస్థుఁడు పుష్పములు ఫలములు మూలములను మొదలైనవానిని నానావిధములైన కూరగాయలను ఆయా ఋతుకాలములయందు దేవపూజార్థము శ్రద్ధాభక్తులతో సంపాదించుకొనవలయును.

మణ్డపాని సురమ్యాణి పద్మోత్పలవనానిచ ॥ ౯॥
క్రీడార్థం దేవకీసూనో రాఢ్యో భక్త్యా ప్రకల్పయేత్ ।

తా॥ విశేషముగా ధనముగలవాఁడు దేవకీపుత్రునకుఁ గ్రీడార్థమై, అందము ... మణ్డపములను బద్మవనములను కలువపూలతోఁటలను భక్తితో నిర్మింపవలయును.

తులసీవాటికా యత్ర యత్రవా కమలాలయః ॥ ౧౦॥
పఞ్చకాలపరా యత్ర తత్రస్థో భగవాన్ హరిః ।

తా॥ తులసీ వనమున్న చోటను పద్మములుండుచోటను యయిదుకాలములందును భగవత్సుఖోల్లాసకరములైనకర్మముల ననుష్ఠించు భాగవతులున్నచోటను భగవన్తుఁడు ...న్నిహితుఁడైయుండును.

సదూర్వై రక్షతై ర్నిత్య మభ్యర్చ్య కుసుమద్రుమాన్॥ ౧౧॥
తులసీం చాహరే త్పత్రపుష్పాద్యా న్వాగ్యతశ్శుచిః ।
స్వయం సంవర్ధ్య తులసీం ద్వా దశాక్షరవిద్యయా ॥ ౧౨॥
యేఽర్చయన్తి జగన్నాథం శ్వేతద్వీపం ప్రయాన్తి తే ।

తా॥ భగవదారాధనకై పుష్పములను దులసీదళములను పత్రములు మొదలైనవానిని గోసితెచ్చుటకుఁ బోవునపుడు పరిశుద్ధుఁడై మాటలాడక అపూలచెట్లను దులసీవృక్షములను దూర్వలతోను అక్షతలతోను బూజించి పిమ్మట నాపత్రపుష్పాదులను ... తెచ్చుకొనవలయును. తానే అతులసీవృక్షములను నీళ్లుపోసి పెంపవలయును-ఇట్లు తాను పెంచిన పూలచెట్లు మొదలైనవానినుండి పత్రపుష్పాదులనుదెచ్చి 'ఓం నమో ...గవతే వాసుదేవాయ' అనునట్టి ద్వాదశాక్షరమన్త్రముతో జగన్నాథు నర్చించిన ...వా శ్వేతద్వీపమును బొందుచున్నారు.

దణ్డప్రణామ మపివా కారయే త్పుష్పవాటికామ్ ॥ ౧౩॥

అపివా తులసీమాత్రం కృతకృత్య స్స చేతనః ।
ఆజ్ఞయే చ్ఛఙ్ఖచక్రాభ్యాం చూతాద్యాం శ్చమ్పకాదికా౯॥ ౧౪॥

తా॥ పూలతోఁటలలోనుండు మామిడి సంపెంగ మొదలైన వృక్షములయంది శఙ్ఖచక్రాఙ్కనము జేయవలయును భగవదారాధనమున కుపయుక్తమగుటచే వాపూల తోఁటకు దణ్డప్రణామమును జేయవలయును. మఱియుఁ దులసికి మాత్రము ప్రత్యేకముగాఁగూడ దండనమస్కారమును జేయవలయును. అట్లు చేయువాఁడు కృతార్థుఁడగును.

తులసీవాటికాం కుర్యా చ్ఛఙ్ఖచక్రామ్బుజాకృతిమ్ ।
వృక్షగుల్మలతాదీనా మచ్యుతారామజన్మనామ్ ॥ ౧౫॥

తా॥ మఱియును దులసీవనమునందును భగవన్నియుద్యానమందుఁ బుట్టిన వృక్షగుల్మలతాదులయందును శఙ్ఖచక్ర పద్మచిహ్నములను వ్రాయవలయును.

కుర్యా న్నామాని దేవస్య దేవ్యా లక్ష్మ్యా స్తథాహరేః।
ఈహమాన శ్చరే న్నిత్యం కదాచి న్నాలసో భవేత్॥ ౧౬॥

తా॥ మఱియు దేవుఁడైన హరియొక్కయు దేవియైన లక్ష్మియొక్కయు దివ్యనామములను ఆభగవదుద్యానవృక్షములకు బెట్టి వానిని దాను బ్రతిదినముస్మరించుచు నాతోఁటయందుఁ గొంతసేపు సంచరించు చుండవలయును. సోమరిగానుండఁగూడదు.

యథా నాన్యస్య సంవాద స్స్వధర్మగ్లా ని రేవచ।
అయాచితై శ్శిలోఞ్ఛైస్తు శిష్యదత్తైః క్రమాగతైః ॥ ౧౭॥

కుర్యా త్కర్మ విశుద్ధై ర్భూరి ప్రతి గృహ్య పివాధనమ్।
కులటాషణ్డపతితవైరిభ్యోఽకాకణీమపి ॥ ౧౮॥

తా॥ భగవత్ప్రీతికరములైన వేదోక్తకర్మముల నాచరించుటకు ధనధాన్యాదికము కావలయునుగదా దానినెట్లు సంపాదించుకొనవలయుననఁగా, తనవర్ణాశ్రమధర్మమునకు లోపంబులేకుండను ఇతరులు దూషింపకుండునటులను శిలోఞ్ఛాదివృత్తినవలమ్బించి యొకనిని యాచింపక ధనధాన్యాదికమును సంపాదించుకొనవలయును గాని యితరులకు బాధకలుగునట్లు యాచించి సంపాదించుకొనఁగూడదు. మఱియును కులక్రముగావచ్చిన స్థితులవలనగాని సచ్ఛిష్యులవలనఁగాని శిష్యులవలనఁగాని ధనధాన్యాదికమును సంపాదించు

కొనవలయును. సంపాదించుకొన్న ధనధాన్యాదికముచేత భగవదుల్లాసకరములైన కర్మంబులను జేయవలయును. వ్యభిచారముగల స్త్రీలు నపుంసకులు పాపాత్ములు వేదోక్తకర్మముల నుజేయక యిచ్ఛానుసారముగా వర్తించునట్టి కర్మభ్రష్టులు మొదలైన యయోగ్యులవలన నొకగవ్వనైనను దీసికొనఁగూడదు. (శిలవృత్తియనఁగా, కోతకోసినమళ్లయందు రాలిన వెన్నులేరుకొని నేతికొని బ్రతుకుట ఉఞ్ఛవృత్తియనఁగా అంగళ్లముందు చిందపడియుండు ధాన్యాదికముచే జీవించుట)

ఉద్యతామపి గృహ్ణీయాన్నాపద్యపి కదాచన।
మహాపాతకినశ్చోరాదభ్యస్తాదభిశస్తతః॥ ౧౯॥
మృగయోర్గిపిశునాచ్చైవ నాదద్యాదుద్యతామపి।
యాచనేనాపి వర్తేత దైన్యం హిత్వాగమాస్థితః॥ ౨౦॥

తా॥ తనకగౌరవము గలుగునని యెంచక శాస్త్రమార్గమును గూడ వదలి యింకనెవరినైన యాచించి జీవింపవచ్చునుగాని పఞ్చమహాపాతకులును దొంగయును మంగలవాఁడును అభిశస్తుఁడును వేటాడువాఁడును చాడీకొరును వీరు ధనికులుగానున్నను. వీరియందనాదరణబుద్ధియుంచవలయును గాని, ఆపత్కాలమందైనను వీరిని యాచించి వీరివలన ధనాదికమును గ్రహించి జీవింపఁగూడదు (బంగారుదొంగిలించువాఁడును కల్లుద్రాగువాఁడును బ్రహ్మహత్య చేసినవాఁడును గురుభార్యను బొందినవాఁడును వారి సాంగత్యముగలవాఁడును పఞ్చమహాపాతకులు. అభిశస్తుఁడనఁగా పరస్త్రీగమనాదులచే దూషింపఁబడినవాఁడు 'ఉద్యతామ్' అనుచో, అనాదరషష్ఠి).

స్తోకాదానేన వానిత్యం ప్రతిగేహ మతన్ద్రితః।
ఆపద్యపి నయాచేత జ్ఞాతిసమ్బన్ధ్యరీనసి॥ ౨౧॥

తా॥ సోమరితనమును విడిచి నిత్యము ప్రతిగృహంబునకును బోయి కొంచెము దొరికినను జాలునని దానిచేతనైనను జీవింపవచ్చును గాని దాయాదులను సమ్బన్ధులను శత్రువులను వీరినిమాత్ర మెంతకష్టకాలమందుఁగూడ యాచింపఁగూడదు.

భిక్షార్థం నవ్రజేత్తేషాం గేహం కుర్యాన్న చాఽప్రియమ్।
రాజ్ఞోన ప్రతిగృహ్ణీయాదుపపాతకినస్తథా॥ ౨౨॥

తా॥ బిచ్చమునిమిత్తము వారి యిండ్లకును బోఁగూడదు, వారికప్రియంబును జేయఁగూడదు. అట్లే రాజప్రతిగ్రహమును జేయఁగూడదు. ఉపపాతకివలనను నేనినిగాని దీసికొనఁగూడదు.

పురోధో గణికాధ్యక్షకదర్యేభ్యోఽపినాహరేత్ ।
శ్విత్రిభ్యో హైతుకేభ్యశ్చ వికర్మస్థేభ్య ఏవచ। ౨౩॥
స్కన్దరుద్రకుబేరాణా మధికారిభ్య ఏవచ।
స్త్రీజితాచ్చ తథా హేయా త్స్వస్తివాదిభ్య ఏవచ ౨౪॥
శాస్త్రావమానిన శ్చైవ పరద్రవ్యాపహారిణః।
సాంయాత్రికా ద్విషద్భ్య శ్చ గణకేభ్య స్తదైవచ॥ ౨౫॥
దధిక్షీరఘృతాదీనాం లవణస్య మధో స్తథా।
విక్రయిభ్యోపి నాదద్యా దశ్వవిక్రయిణ స్తథా ॥ ౨౬॥

తా॥ పురోహితుఁడు వేశ్యాపతి పిసినిగొట్టు కుష్ఠురోగముగలవాఁడు నిశ్వాతుకుఁడు శాస్త్రవిరుద్ధకర్మమును జేయువాఁడు స్కన్దరుద్రకుబేరాలయముల మణియగాంద్రు స్త్రీలకులొంగినవాఁడు కులభ్రష్టుఁడు బట్టురాజు శాస్త్రనిన్దకుఁడు పరద్రవ్యముల నపహరించినవాఁడు ఓడనెక్కి దేశాన్తరముబోవు వర్తకుఁడు శత్రువు కరణమువాఁడు పెరుగు పాలు నెయ్యి ఉప్పు తేనె మొదలైనవానినమ్మువాఁడు గుఱ్ఱముల నమ్మువాఁడు వీరియొద్దనుండిఏవస్తువును గ్రహింపఁగూడదు

నాచరన్తి యధోక్తంయే తేభ్యోఽపి భృతకార్చకాత్।
బీజప్రహారిణశ్చైవ బలీవర్దస్య సాక్షిణః॥ ౨౭॥
అయథార్థస్య నాదద్యా దశ్వానాం దమకాత్తథా।
అభక్తాచ్చ త్రయీనిన్దా దుదక్యాగమకాత్తథా॥ ౨౮॥
కుసీదకాత్తథాభోక్తు శ్శ్రాద్ధస్య సతతం తథా।
నగ్రామయాజకేభ్యశ్చ నాగమ్యాగామిన స్తథా॥ ౨౯॥
వణిగ్భ్య శ్చ తథాశూద్రా దుత్సృష్టాగ్నేశ్చ నాహరేత్।
అగారదాహకేభ్యశ్చ పరివిత్తిభ్య ఏవచ॥ ౩౦॥

తా॥ పెద్దలు చెప్పినట్లు నడుచుకొనని మూర్ఖులును జీతము తీసికొని భగవదారాధనఁ జేయువాఁడును ఎద్దు బీజముల నణఁగఁగొట్టువాఁడును కూటసాక్ష్యముచెప్పువాఁడును అశ్వశిక్షకుఁడును భగవద్భక్తిలేనివాఁడును వేదములను నిన్దించువాఁడును రజస్వలాస్త్రీనిపొందువాఁడును వడ్డిచేత జీవించువాఁడును నిత్యము శ్రాద్ధాన్నమును

భుజించువాఁడును గ్రామపురోహితుఁడును పాండఁదగనిస్త్రీనిబొందినవాఁడును వర్తకులును అసచ్ఛాస్త్రుఁడును ప్రతిదినము అగ్నిహోత్రము నారాధింపని వాఁడును గృహంబులను గాల్చువారును తమ్ముఁడు వివాహమును జేసికొని యుండఁగాఁ దాను వివాహము చేసికొననివాఁడును వీరివలన నేవస్తువును దీసికొనఁగూడదు

బిమ్బప్రస్థాపకాశ్చైవ తథా శిల్పోపజీవినః।
పరిత్యక్తాశ్చ నష్టాశ్చ శూద్రశిష్యాశ్చ త్తథైవచ॥ 31॥

నచ శ్వపాకవృత్తిభ్యశ్చ ప్రాడ్వివాకాత్తథైవచ।
భగవన్తం తథా విప్రాన్నిత్యకాలపరాయణాన్॥ 32॥

భగవన్మన్దిరం చైవ పుణ్యతీర్థాని సర్వదా।
ద్విషతశ్చైవ నాదద్యాన్నిక్షిప్తస్యాపహారిణః॥ 33॥

తా॥ ప్రతిబిమ్బమును నిలుపువాఁడును శిల్పపుఁబనులవలన జీవించువాఁడును ధర్మమార్గమునుండి తొలఁగినవాఁడును అజ్ఞాతకులగోత్రుఁడైన దేశాన్తరగతుఁడును శూద్రునకు శిష్యుఁడుగానుండువాఁడును కుక్కమాంసమువంటచే జీవించువాఁడునుతగవరియును భగవన్తుని కర్తరులైన బ్రాహ్మణులను భగవన్మన్దిరమును పుణ్యతీర్థములను ఎల్లప్పుడునుదూషించువారును ఇతరులు తనదగ్గఱదాఁచుకొన్నధనాదికము నపహరించినవాఁడును వీరిదగ్గఱనుండి దేనిని దీసికొనఁగూడదు (ఫొటోగ్రాఫ్ ఎత్తినవాఁడు బిమ్బప్రస్థాపకుఁడని చెప్పవచ్చును శిల్పమనఁగాఁ జిత్తరువు వ్రాయుటలోనగుపని )

ప్రాతిలోమ్యాచ్చ జాతేభ్యస్తథా చానృతజీవినః।
ఉపజీవ్యేతం త్వాపి నాదద్యాదన్యదేవావలమ్బినః॥ 34॥

తా॥ ప్రాతిలోమ్యమువలనఁబుట్టినవాఁడును అసత్యమును జెప్పి జీవించువాఁడును ఇతరదేవతల నాశ్రయించెడివాఁడును వీరు దేనినైనను తమంతట తామే ఇచ్చుట కుద్యుక్తులైనను వారిదగ్గఱనుండి అట్టిసిద్ధమైనపదార్థమునుగూడఁ దీసికొనఁగూడదు ప్రాతిలోమ్యజాతుఁడనఁగా బ్రాహ్మణాదివర్ణములలో దక్కువ జాతి పురుషుని వలన నెక్కువజాతి స్త్రీయందుఁ బుట్టినవాఁడు.

క్రమాగతైర్ధనైర్వాపి స్వక్షేత్రారామసంభవైః।
భగవద్భక్తిపూతేభ్యో విప్రేభ్యో యాచితైస్తువా॥ 35॥

ఆయాసోపార్జితై ర్వాపి కర్మ కుర్యా దతన్ద్రితః ।
పద్మైర్వా పత్రపుష్పాద్యై స్సర్వాభావే సమర్చయేత్ ॥ ౩౬ ॥

తా॥ మఱి యెట్లు భగవత్కైంకర్యము చేయవలయునన్నఁగా తనకుల క్రమాగత ములైన ధనములచేతనైనను తనపొలము తోఁట వీనియందు కలిగిన సస్యాదిద్రవ్యముల చేతనైనను భగవద్భక్తిచే శుద్ధాన్తఃకరణము గలవారిని యాచించుటవలన లభించినధన ధాన్యాదికముచేతనైనను తాను కష్టపడి న్యాయముగా సంపాదించినద్రవ్యములచేత నైనను భగవత్ప్రీతికరంబులైన వేదోక్తకర్మంబులను శ్రద్ధాభక్తులు కలవాఁడై చేయ వలయును ఈరీతిగా నేమియును దొరకనియెడల అడవియందుఁ బుట్టినపత్రపుష్పాదుల నైనను దెచ్చి వానితో భగవదారాధన చేయవలయును,

అలాభే సర్వభోగానాం జలం ప్రతినిధిస్స్మృతమ్ ।
అలబ్ధధాన్యో విప్రేషు క్షత్రియాన్వాపి యాచయేత్ ॥ ౩౭ ॥

తా॥ ఇప్పుడు చెప్పినరీతిగా నేదియు లభింపనియెడల భగవన్తునుద్దేశించిచేయఁ బడునట్టి సర్వభోగములకును బదులుగా జలమును సమర్పింపవలయును. బ్రాహ్మణుల వలన ధనధాన్యాదికము లభింపనియెడల క్షత్రియులనైన యాచింపవలయును.

వినా మూర్ధాభిషిక్తంతు వైశ్యంవాపి మహాపది ।
అలబ్ధ్వా యాచనాదేవ తేషాంవా వృత్తి మాచరేత్ ॥ ౩౮ ॥

తా॥ అక్షత్రియులలో భూమిని బాలించుటకు శిరస్సునఁ బట్టాభిషిక్తుఁడైన క్షత్రియుని యాచింపఁగూడదు గొప్పయాపదయందు వైశ్యునినైనను యాచింప వచ్చును అట్లు వైశ్యులను యాచించుటవలననేమియు లభింపనియెడల ఆవైశ్యుల వృత్తినైనను (వర్తకమునైనను) అవలమ్బింపవలయును.

తిలం మాషం తథాఽన్నం చ లవణం చ తథాగుడమ్ ।
రక్తకృష్ణాదికం వస్త్రం దధిక్షీరఘృతాదికమ్ ॥ ౩౯ ॥
సాధనంచైవ హింసాయా విషోల్బణకరాణిచ ।
సువర్ణం చైవ గాం చైవ విక్రేయా న్నా శ్వ మేవచ ॥ ౪౦ ॥

తా॥ అట్లు వైశ్యవృత్తి నవలమ్బించునపుడు నువ్వులను మినుములను అన్నమును ఉప్పును బెల్లమును ఎఱ్ఱని వస్త్రములను నల్లని వస్త్రము మొదలైన వానిని పెరుగు పాలు నెయ్యి మొదలయినవానిని హింసాసాధనవస్తువులను విషాధిక్యమును గలుగఁ జేయువస్తువులను బంగారును గోవులను గుఱ్ఱములను అమ్మఁగూడదు

శ్రోత్రియాధ్యాపకో భూత్వా వృత్తిం వాపి లభేద్ద్విజః ।
స్త్రీబాలవృద్ధసంయుక్తస్సర్వేభ్యో వా సమాహరేత్ ॥౪౧॥

తా॥ బ్రాహ్మణుడు తాను వేదమును జదివి దాని నితరులకు జెప్పియైనను జీవనమును జేయవలయును స్త్రీలు బాలురు వృద్ధులును గలవాఁడై తనకు జీవనము జరుగని యెడలఁ బూర్వోక్తనియమము నతిక్రమించి యందఱిని యాచించి దానిచే భగవత్కైంకర్యమును జేయుచు వర్తింపవలయును,

భగవద్భక్తియుక్తేభ్యో యథాశ్వస్తనికో భవేత్ ।
ఉపాదాయ యథాలాభం కర్మారమ్భం ప్రయోజయేత్ ॥ ౪౨॥

తా॥ మఱియు భగవద్భక్తియందు భక్తిగలవారిని యాచించుటచే లభించిన దానిని దీసికొని రేపటికి మిగులకుండ దొరికినదానికిఁ దగినట్లు భగవత్కైంకర్యమును జేయుచు వర్తింపవలయును.

ప్రతిగ్రహోద్భవో దోషో హ్యచిరాదేవ నశ్యతి ।
భిక్షిత్వా వాపి వర్తేత స్వాశ్రమానుగుణం తథా ॥ ౪౩॥

తా॥ మఱియును బిచ్చమెత్తియైనను దన యాశ్రమమునకుఁ దగినట్లు భగవత్ప్రీతికరమైన కర్మమును జేయుచుండవలయును. అట్లుచేసినయెడల నన్యులవలన ద్రవ్యమును ప్రతిగ్రహించుటవలనఁ గలిగిన దోష మప్పుడే పోవును

అపక్వం వాపి పక్వం వా సర్వశ్రేష్ఠా హి సా స్మృతా ।
భిక్షిత్వా వర్తమానానాం యోగినాం సిద్ధికాఙ్క్షిణామ్॥౪౪॥

తా॥ మోక్షసిద్ధిని గోరి దానికిఁ దగిన యోగము (ఉపాయము) గలవారు తమదేహము నిలుచుటకై యపక్వమైన ఫలాదికమును గాని పక్వమైన యన్నాదికమును గాని యితరులను యాచించి తీసికొనుచున్నారు గదా అట్టి బిచ్చమే సర్వోత్తమమైనదని యెఱుఁగవలయును.

మదమాత్సర్యమానాద్యా దోషా గచ్ఛన్తి సంక్షయమ్ ।
యథా యథా హి ఖిన్నస్స్యాత్సాంసారికసుఖోదయే ॥ ౪౫॥
తథా తథా ధ్రువం యోగీ నిర్వాణపదమృచ్ఛతి ।
అపవర్గరసజ్ఞో హి సన్నా దుఖవర్జితః ॥ ౪౬॥
మోక్షధర్మమనా నిత్యం సుఖం చరతి ముక్తవత్ ।
యోగినా మపమ సంచ శరిరక్తేన ఏవచ ॥ ౪౭॥

ఆర్థహానిశ్చ విజ్ఞానం వర్ధయ త్యగ్ని మాజ్యవత్ ।
యస్య సాంసారికం సౌఖ్యం యోగినో నేహ సంభవేత్ ॥౪౮॥

తా॥ కామక్రోధాది దూషితమై యనిత్యమైనది గనుక సంసారసుఖము విడువదగినది. నిర్దోషమై నిత్యమైనది గనుక మోక్షసుఖము విడువఁదగనిది. అట్టి మోక్షమహిమ నెఱిఁగి మోక్షమును గోరి హేయమైన యీసంసారసుఖము మన కెన్నఁడు తొలఁగునా యని విచారించిన మొదల వరుసగాఁ గామక్రోధలోభమోహమదమాత్సర్యాది దోషములు నశించును. అవి నశింపఁగానే మోక్షమార్గోపాయము గలవాఁడై నిశ్చయముగా మోక్షము నొందును. పిమ్మట నా మోక్షసుఖానందరసమందు మునిఁగినవాఁడై యింక నెన్నటికిని నశ్వరమైన సంసారసుఖము నొందఁడు మఱియు నెవ్వఁడు మోక్షధర్మములను దెలిసి కొనఁదలంచునో యంతమాత్రముచేతనే యతఁడు ముక్తునివలె సుఖముగా నుండును. అట్టి సాక్షాన్మోక్షసుఖము ఇట్టిదని చెప్పనలవియగునా, దాని ననుభవించినవాఁడె దానినె యెఱుంగును మఱియు మోక్షమార్గోపాయము నెఱింగినవానికి సత్త్వమజ్ఞానముండును గనుక నేతివేత నగ్ని వృద్ధినొందినట్లు దానిచే సంసారసుఖమం దాశ లేకుండుటయు మదమును గలిగించెడివస్తువులను భుజింపక శరీరమును కృశింపఁజేయుటయు ధనమార్జింపవలయు ననెడి యాశ లేకుండుటయు వర్ధిల్లును. దానిచే నెప్పటికిని సంసారసుఖమందుఁ బ్రవర్తించుట సంభవింపదు.

అనాయాసేన లభ్యం స్యా త్తస్య తత్పరమం పదమ్ ।
అవిజ్ఞాతమనా నిత్యం తాపైరభిహతోఽపి సన్ ॥ ౪౯॥

తా॥ అట్టి యోగికిఁ బరమపదము ప్రయాసము లేకుండ జేరును అతఁడు నిత్యము సంసారదుఃఖములచేఁ గొట్టఁబడినవాఁడయ్యును ఆదుఃఖము నెఱుంగనివాఁడై యుండును.

అక్లేశేన చరే త్తుష్టో విశుద్ధద్రవ్యతత్పరః ।
అమార్గేణ ధనం లోభా త్సంపాద్య సుఖ మావసన్ ॥ ౫౦॥
న సంసిద్ధో భవే త్తస్మా చ్ఛుద్ధద్రవ్యపరో భవేత్ ।
అకస్మాన్యాని సిద్ధాని యదిద్రవ్యా ణ్యకామతః । ౫౧॥
తేషాం వినిమయేనైవ శుద్ధిస్త్యాగేన వా భవేత్ ।
అలాభే సర్వభోగానా ముదకేనాపి పూజితః ॥ ౫౨॥
ప్రయచ్ఛ త్యమలం లోకం భక్తిపూతా న్తరాత్మనామ్ ।

తా॥ తాను శ్రమపడకుండఁ బరిశుద్ధద్రవ్యములను సంపాదింప వలయు ననెడి యాశగలవాఁడై దొరకినదానికిఁ దృప్తినొంది యుండ వలయును. లోభమువలన నన్యాయముగానపరిశుద్ధ ద్రవ్యమును సంపాదించిసుఖముగా నుండువాఁడు పరమపురుషార్థసిద్ధిని బొందఁడు మోక్షసుఖముకంటె నితరసుఖము సుఖమగునా? కాగు కావునఁ బరిశుద్ధద్రవ్యములను సంపాదించుటయందే ఆశగలవాఁడై యుండవలయును. ఒకవేళ భగవత్పూజాదికర్మల కుపయోగింపనియపరిశుద్ధద్రవ్యములు కలవనితలంపుగా సంభవించినయెడల నాద్రవ్యములను మార్చి పరిశుద్ధద్రవ్యములను సంపాదించుకొన వలయును లేదా అట్టియపరిశుద్ధవస్తువులను విడువనైన విడువవలయును. అట్లు చేసినయెడలఁ బరిశుద్ధిగలుగును ద్రవ్యములు లేకుండ భగవత్తునెట్లారాధింప వలయుననఁగా నేమియును దొరకనియెడల సర్వభోగములకు బదులుగా నుదకమును సమర్పించి ప్రార్థించినయెడల భగవత్తుఁ డట్టిపరిశుద్ధాన్తఃకరణము గలవారికిఁ బ్రసన్నుండై పరమపదము నిచ్చును.

జాతయా శుద్ధవంశేతు భార్యయా స్వానుకూలయా ॥ ౫౩॥
సద్భక్తిపూతయా నిత్యం కారయేద్ద్రవ్యసాధనమ్ ।
శాకామ్బుభిర్వా న్యాయాప్తైర్భక్త్యా సంపూజయేద్ధరిమ్॥౫౪॥

తా॥ శ్రీహరిపూజార్థము తనకు దొరకినద్రవ్యములను భగవద్భక్తిచేఁ బరిశుద్ధాన్తఃకరణముగలదగుటచేఁ దనకనుకూలురాలును బరిశుద్ధవంశమందుఁ బుట్టినదియునైన భార్యచే భగవదుపయుక్తములగునట్లు చక్కఁపఱుపవలయును న్యాయముగా దొరకిన శాకజలపత్రపుష్పఫలాదులచే శ్రీహరిని భక్తితోనారాధింపవలయును.

మన్త్రో మన్త్రేశ్వరశ్శాస్త్రం మన్త్రసిద్ధిస్తథైవచ।
సిద్ధాన్తమక్షసూత్రంచ గోప్యం ధాన్యం ధనాయుషీ ॥ ౫౫॥
అవమాన మసామర్థ్యం హృద్రోగం రోగమాన్తరమ్ ।
అనర్థమృణ మాయాస మకృత్యం న ప్రకాశయేత్॥ ౫౬॥

తా॥ మన్త్రము మన్త్రదేవత మన్త్రసిద్ధి సిద్ధాన్తము జపమాల ధనము ధాన్యము జీవితకాలము అవమానము తనకుశక్తిలేకుంకుట మానసికదుఃఖము గృహచ్ఛిద్రము అనర్థము అప్పు ఆయాసము చేయరానిపని వీనిని బైలుపఱుపఁగూడదు

ధాన్యఖస్థువినాశేన వైద్యస్యోపద్రవేణచ ।
పరైః కృతావమానేన ఖిన్నస్స్వ న్నకథాచన ॥ ౫౭॥

తా॥ ధాన్యము నశించినను బన్ధునాశముగలిగినప్పుడును దారిద్ర్యముగలిగిన ప్పుడును పసులవలనఁవనకపయూనము గలిగినప్పుడును ఇట్టి సంకటములెన్ని కలిగినప్ప టికిని ధైర్యము నవలమ్బించి భగవద్భక్తి పరుఁడైయుండవలయునుగాని యెప్పుడుగాని విచారపడఁగూడదు.

ప్రాత స్స్నాతో౽పి విధివ త్స్నానం మాధ్యందినం చరేత్।
శక్తశ్చే దన్యథా రోగా చ్ఛాట్యా సంమార్జనం చరేత్॥౫౮॥

తా॥ ప్రాతఃకాలమందు యథావిధిగా స్నానమును జేసినను శక్తిగలవాఁడయ్యె నేని మరల మాధ్యాహ్నికస్నానమును జేయవలయును. రోగమువలన నశక్తుఁడైనయెడల తడిగుడ్డతోనొడలు తుడుచుకొనవలయును.

శుద్ధిం కుర్యా త్సదా విద్వా న్నలానా మజ్జనన్నామ్।
కృత్తకేశనఖశ్మశ్రు స్త్రిపక్షేతు గృహీభవేత్॥　　౫౯॥

తా॥ తెలిసినవాఁడు శరీరమునందుఁగలిగినమురికిని బోఁగొట్టుకొని యెప్పుడును బాహ్యశుద్ధినిగూడ చేసికొనవలయును. మఱియును గృహస్థుఁడొకమాసము పదునేను దినములకొకసారి వపనమును జేయించుకొనవలయును అపుడు తలమీఁది వెండ్రుకలను మూతిమీఁది వెండ్రుకలను గొరిగింపవలయును. గోళ్లను దీయింపవలయును.

దినేదినే స్నానకాలే కుర్యా దభ్యఞ్జనం గృహీ।
అథవా శస్తదివసే శక్తః కుర్యా ద్ద్వివైవతత్॥　　౬౦॥

తా॥ ప్రతిదినము స్నానకాలమందు గృహస్థుఁడు నూనెతోఁ దల మర్దించుకొని స్నానము చేయవలయును అట్లుదినము అభ్యఞ్జనస్నానము చేయకున్నను శరీరమునకు జబ్బులేక శక్తి గలవాఁడయ్యెనేని తలంటుకుఁ దగిన మంచిదినమందు బగటియందే యభ్య ఞ్జనస్నానమును జేయవలయును,

విశుద్ధ దన్తవదనో నిర్మలీకృతవిగ్రహః।
శుద్ధోదరః ప్రసన్నాత్మా యథాలక్ష్మై స్సమర్చ యేత్॥　౬౧॥

తా॥ పాచిలేకుండ దన్తశుద్ధిని మురికిలేకుండముఖశుద్ధిని జేసికొని పొట్టయందు నిన్నటిదినమందు భరించిన చన్దనము మొదలైనదిలేకుండ బాగుగాఁ గడిగికొని స్నానము చేసి దేహశుద్ధియు మనశ్శుద్ధియుఁగలవాఁడై దొరకిన ద్రవ్యములతో భగవదారాధన మును జేయవలయును

సతీనాం యోషితాం దేహో యథోపకరణం భవేత్ ।
భర్తౄణాం భగవద్భక్తదేహాస్తద్వ జ్జగద్గురోః ॥ ౬౨॥

తా॥ పతివ్రతలైన స్త్రీలయొక్క దేహము భర్తలకెట్లుపయోగించునో అట్లు భగవద్భక్తులదేహము జగద్గురువైన భగవన్తున కుపయోగించును,

కర్మాన్తరే ష్వసంసక్తిః ఫలాకాఙ్క్షా విసర్జనమ్ ।
భక్తిర్ద్రఢీకృతం చిత్తం విరక్తిస్సర్వవస్తుషు ॥ ౬౩॥
అభ్యాస స్సతతం సర్వప్రకారై స్సత్క్రియావిధౌ ।
ఆలస్యవర్జనం శ్రద్ధా పరమా దమ్భవర్జనమ్ ॥ ౬౪॥
అకార్పణ్య మలోభశ్చ క్రోధమోహా జయో భయమ్ ।
దేహస్యేన్ద్రియస్యాపి విశుద్ధి ర్ద్రవ్యదేశయోః ॥ ౬౫॥

తా॥ భగవత్కర్మమును జేయునపుడు ఇతరకర్మములయందు మనస్సునుంచఁగూడదు. భగవత్ప్రాప్తి తప్ప యితరఫలమును గోరఁగూడదు. భగవన్తునియందు దృఢమైన భక్తియు నితరవస్తువులయందు విరక్తియునుండవలయును. అన్నివిధములచేత సత్కార్యములను జేయుటయందభ్యాసముండవలయును. సోమరితనముండకూడదు చేయుసత్కర్మములయందు మిక్కిలియక్కఱ గలిగియుండవలయును. దమ్భముండఁగూడదు. పిసినితనము లోభము క్రోధము మోహము ఇవియుండ గూడదు దేహశుద్ధి ఇన్ద్రియశుద్ధి ద్రవ్యశుద్ధి దేశశుద్ధియుఁ గలిగియుండవలయును. దమ్భమనఁగాఁ గపటము

అకాలే వర్జనం నిద్రామైథునాశనకర్మణామ్ ।
సర్వదా శాస్త్రశిక్షాచ శాస్త్రదృష్టేషు కర్మసు ॥ ౬౬॥
పారవశ్యం ప్రమాణేచ నిత్యం శాస్త్రే దృఢం పరే ।
నిషిద్ధవర్జనంయత్న స్సంశుద్ధాన్ననిషేవణమ్ ॥ ౬౭॥

తా॥ అకాలమందు నిద్ర సంభోగము భోజనము వీనిని జేయఁగూడదు, ఎల్లప్పుడును శాస్త్రాభ్యాసమును శాస్త్రోక్తకర్మములను జేయుచుండవలయును నిత్యము శాస్త్రప్రమాణమునకు దృఢముగా లోఁబడియుండవలయును, శాస్త్రనిషిద్ధవస్తువులను విడుచుటయందును మంచికార్యములనుజేయుటయందును యత్నించుచుండవలయును పరిశుద్ధాన్నమును భుజింపవలయును.

మార్దవం హ్రీ ర్దయా క్షాన్తి రద్రోహ స్సర్వజన్తుషు ।
ఏవమాదిగుణాః పుంసాం యదా స్యు స్సత్త్వసంభవాః ॥ ౬౮॥

జానీయా ద్యోగ్య మాత్మానం తథాభాగవతే విధౌ ।
ఉత్సృజ్య భగవత్కర్మ బాహ్యకర్మపరాయణః ॥ ౧౯॥
కుటుమ్బసక్తో మూఢాత్మా రాజసో నేహ సంమతః ।
రజసా తమసా వాపి యో యదాకలుషీకృతః ॥ ౨౦॥
అమేధ్య ద్రవ్యవన్నార్హ స్తదా కర్మణి వైష్ణవే ।

తా॥ మృదుస్వభావము చేయరాని పనులయందు సంకోచము ఇతరులకుఁ గలిగిన దుఃఖమును బోఁగొట్టఁదలంచుట సర్వప్రాణికోటియందును ద్రోహబుద్ధి లేకుండుట మొదలైన యిట్టిగుణములు సత్త్వగుణము వలనఁ గలుగుచున్నవి. అవియెవరికుండునో వారుభగవత్కర్మములనాచరించుటకుఁదగినవారు, భగవత్కర్మమును జేయక యితరకర్మములను జేయుచుఁ గుటుంబమును బోషించుకొనునట్టి మూఢుఁడు భగవత్కర్మమును జేయుటకు యోగ్యుఁడు కాఁడు రజోగుణతమోగుణములు గలవాఁడు. పరిశుద్ధమైన యంతఃకరణముగలవాఁడైయుండఁడు గావున నపరిశుద్ధద్రవ్యమువలె వైష్ణవకర్మమును జేయుటకు యోగ్యుండు కాఁడు.

ఏవం సద్గుణసంపన్నా మహాభాగవతప్రియాః ॥ ౨౧।
కుటుమ్బినోఽపి కర్తవ్యం కర్మ కుర్యు రతన్ద్రితాః ।
ఉత్థాయ పూర్వం గృహిణీ సుస్నాతా యతమానసా ॥ ౨౨॥
స్నుషాదుహితృపుత్రాద్యా న్యథార్హం శుచితాం నయేత్ ।
ఊర్ధ్వపుండ్రధరా శ్శుద్ధా వస్త్రాభరణభూషితాః ॥ ౨౩॥
స్వాచాన్తాః ప్రయతా దేవ మభిగచ్ఛేయు రాదృతాః ।
త్రిసన్ధ్యం కారయే ద్బాలాన్ప్రణామం దేవపాదయోః ॥ ౨౪॥
పుత్రః ప్రేష్య స్తథాశిష్య ఇత్యేవం చ నివేదయేత్ ।

తా॥ ఇట్టిసద్గుణములు గలవారు మహాభాగవతులకుఁ బ్రియులగుదురు కుటుమ్బవంతులును సోమరితనములేనివారై భగవత్కర్మమును జేయవలయును తనభార్య ముందుగా నిద్రలేచి యథావిధిగా స్నానముచేసి నియమముఁ నొందినమనస్సుగలదై కోడలు కూతురు కొడుకు మొదలైనవారిని వారివారికిఁదగిన శుద్ధిగలవారినిగాఁ జేయవలయును. మఱియు నందఱును ఊర్ధ్వపుండ్రములనుధరించి శుద్ధులై వస్త్రాభరణభూషితులై యాచమనమునుజేసి నియతచిత్తులై భక్తితో భగవద్దర్శనమును జేయవలయును.

మఱియు పెద్దలుగూడ కాలత్రయమందును భగవత్పాదారవిన్దములకు నమస్కరించు నట్లు చేయవలయును-ఇతఁడు సేవకుఁడు ఇతఁడు పుత్రుఁడు ఇతఁడు శిష్యుఁడని భగవన్తునికి విన్నవించుకొనవలయును.

గృహిణీప్రముఖాస్సర్వా గాయన్త్యః పురుషోత్తమమ్॥ ౨౫॥
బాలక్రీడాదిచరితైః కర్మకుర్యురతన్ద్రితాః।

తా॥ భార్య మొదలైన వారందఱును పురుషశ్రేష్ఠుఁడైన భగవన్తుని రామకృష్ణాద్యవతారములనెత్తినపుడు పసితనమందుఁ జేసిన క్రీడలు మొదలైన చరిత్రములను జెప్పి స్తుతించుచు భగవత్కర్మము బరాకులేకుండఁ జేయవలయును

పశుపుత్రాదికం సర్వం గృహోపకరణానిచ ॥ ౨౬॥
అఙ్కయే చ్ఛఙ్ఖచక్రాభ్యాం నామ కుర్యాచ్చ వైష్ణవమ్।
కారయిత్వా సువర్ణేన పఞ్చాయుధగణం హరేః॥ ౨౭॥
బధ్నీయాత్కణ్ఠదేశేతు బాలానాం సూతికాగృహే।
న ముద్రయే దాసనాని శయనాని మహీతలమ్॥ ౨౮॥
స్థాపయేత్ క్షేత్ర మధ్యేతు శిలాం చక్రాదిముద్రితామ్।

తా॥ మఱియును పశువులు పుత్రులు మొదలైనవారియందు ఇంకనింటనుండు గృహోపకరణములయందన్నింటియందును శఙ్ఖచక్రచిహ్నములు గలిగియుండునట్లుచేయవలయును. అన్నిటికిని విష్ణునామములను పెట్టవలయును శ్రీహరియొక్క పఞ్చాయుధములను బంగారుతోఁ జేయించి వానిని పురుటింటియందు బిడ్డలకణ్ఠమునందుఁ గట్టవలయును. పీటలు మెత్తలు నడుచునట్టి చోటు మొదలైన కొన్నిచోట్లమాత్రము శఙ్ఖచక్రాదులను ముద్రింపఁగూడదు, శఙ్ఖచక్రాదులు చెక్కిన యొకఱాతిని ఇంటినడుమను స్థాపింపవలయును

ముక్తామణిసువర్ణాద్యైః కృత్వాచక్రాదిభూషణమ్॥ ౨౯॥
యథార్హం బిభృయు స్సర్వే పుమాంసస్త్రీజనోపివా।

తా॥ శఙ్ఖచక్రాద్యాకారమైన బంగారునగను రత్నములతోఁ జెక్కినదానిని స్త్రీపురుషులందఱును వారివారి కనుగుణముగ ధరింపవలయును.

వృద్ధబాలాతురాదీనాం పూర్వాహ్ణే భోజనం భవేత్॥ ౩౦॥
యథాబలం సమభ్యర్చ్య సాగ్నిం దేవం తతోఽశనమ్।

తా॥ వృద్ధులు బాలురు రోగపీడితులును మొదలైనవారు పగలుమొదటిజామునందు భుజింపవచ్చును. వృద్ధాదులు తప్ప తక్కినవారందఱును ఆగ్నిని విష్ణుని దేవతలను శక్త్యనుసారముగా నారాధించి భుజింపవలయును.

తైలాజ్యభాణ్డం హిత్వాన్య జ్జలక్షీరాన్నసంశ్రయమ్ ॥ లా౧॥
కర్తవ్యం దివసే భాణ్డం మారుతాతపసేవితమ్ ।

తా॥ జలపాత్రమును పాలపాత్రమును అన్నపాత్రమును పగటియందు గాలి యెండ తగులునట్లు చేయవలయును నూనెపాత్రమును నేతిపాత్రమును అట్లు చేయనక్కఱలేదు.

కర్మణ్యా నుపయుక్తేషు పూర్వస్మిన్ దివసేఽనిశమ్ ॥ లా౨॥
పరస్మిన్ దివసే కుర్యా త్ప్రాతేష్షు పచనాదికమ్ ।
గృహోపకరణం సర్వం ముసలోలూఖలాదికమ్ ॥ లా౩॥
ప్రక్షాలయే జ్జగన్నాథయాగోపకరణాని చ ।
యాగార్థం దేవదేవస్య పాకార్థం చామ్బుపావనమ్॥ లా౪॥
స్థాపయే త్పాదహస్తాది శుద్ధ్యర్థంచ పృథక్పృథక్ ।
వస్త్రేణ బహుశ శ్శోధ్యం త్రివిధం చామ్బుపావనమ్ ॥ లా౫॥
ఇజ్యార్థ మేక మేలాద్యై స్సంస్కృతం కారయే త్సుధీః ।

తా॥ మునుపటిదినమందంతయు యేపనియందు నుపయుక్తములు గానిభాణ్డముల యందు మఱుదినము వంటమొదలైనదానిని జేయవలయును. రోకలి ఱోలుమొదలైన యింటిపనిముట్లను తిరువారాధనమునకు పయుక్తములైన వస్తువులను ప్రతిదినము తోమి కడిగి శుద్ధిచేయవలయును. తిరువారాధనకును తళికైచేయుటకును కాలుసేతులు మొదలైనవానిని శుద్ధచేసికొనుటకును బరిశుద్ధమైనజలమును వేఱువేఱుగాఁదెచ్చి పెట్టుకొని దానిని పలుమాఱువస్త్రముతో వడికట్టవలయును. ఈవిధముగా మూఁడుభాగములుగా నాజలముండవలయును భగవదారాధనమున నుపయోగపడునట్టి జలమును ఏలకులు మొదలైన పరిమళద్రవ్యములతోఁజేర్చి సంస్కరింపవలయును

కర్మణ్యం త్రివిధం వారి శుద్ధభాజనసంభృతమ్ ॥ లా౬॥
ఆచ్ఛాద్య స్థాపయే త్స్వైరే నిర్బాధే పరిమార్జయేత్ ।
అగ్న్యగారంచ సంశోధ్య యాగోపకరణాని చ ॥ లా౭॥

తా॥ ముందుఁజెప్పఁబడిన కర్మములకు నుపయుక్తమగునట్టి మూఁడువిధములు గల జలంబును బరిశుద్ధపాత్రములంగుఁబోసి పెట్టుకొనవలయును. అట్టిజలమును బాధలేని చోట నొకపీటయందుంచి మూసిపెట్టవలయును పిమ్మట అగ్నిహోత్రగృహంబును ఆగృహమందుండెడి స్రుక్స్రువాదిపాత్రములను హోమక్రియ కుపయోగపడునట్టి వానిని శుద్ధిచేయవలయును

ఉద్ధృత్య భస్మసంమృజ్య వహ్నింకాష్ఠై స్సమిన్ధయేత్ ।
కరీషకబలం క్షిప్త్వా కుసుమాద్యైస్స మర్చయేత్ ॥ ౭౭॥

తా॥ అగ్నిహోత్రస్థానమందుండు బూడిదనెత్తి శుద్ధిచేసి యచ్చట నగ్నినుంచి దానిమీఁదఁగట్టెలను బిడకతునుకలనుంచి మండునట్లు చేయవలయును. పిమ్మటఁబూలు మొదలైనవానిచేత నాయగ్నిని బూజింపవలయును.

శ్రద్ధయాఽఽచార్య గృహిణీ పుత్రవత్పరిపాలయేత్ ।
శోషయేచ్ఛుద్ధభూభాగే వ్రీహిముద్గతిలాదికాన్ ॥ ౭౮॥

తా॥ ఇల్లాలు శ్రద్ధతో నగ్నిని ఆఱిపోకుండ సమకమొదలైనవి వేసి పుత్రునివలె నగ్నిని గాపాడవలయును. మఱియును వడ్లు పెసలు నువ్వులు మొదలైన వానిని తడిలేకుండ నెండిన పరిశుద్ధప్రదేశమందు నెండఁబోయవలయును.

కాకపశ్వాదిభూతానామప్రాప్యే సంవృతామ్బరే ।
ఉపలిప్తే శుచౌ దేశే శుద్ధై శ్శూర్పాదిసాధనైః ॥ ౮౦॥

వ్రీహిముద్గాదికం సర్వమవహన్యుః కులాఙ్గనాః ।

తా॥ శుభ్రమైన చాటలోనగువానితోఁ బెంటలేకుండ నూడ్చి గోమయోదకముతో నలికి శుద్ధిచేసినచోట కాకులు పశువులు మొదలైనవి తినకుండునట్లు బయలుగానిచోట కులస్త్రీలు వడ్లు పెసలు మొదలగు పదార్థముల నన్నింటిని దంచవలయును.

అస్పృశన్త్యో నిజం దేహమజల్పన్త్య స్తథా స్త్రియః ॥ ౮౧॥
అవహన్యు శ్శ్లక్ష్ణమామ్బాని జీర్ణవస్త్రై ర్విమృజ్య చ ।
నిర్మలీకృతముక్తాభం విశుద్ధీకృత్య తణ్డులమ్ ॥ ౮౨॥
వికీర్య ఫలకాపృష్ఠే శర్కరాద్యా న్సమాహరేత్ ।
న పచేయు ర్వ్రీహియవా న్నావహన్యు రతాపితాన్ ॥ ౮౩॥
పచేయు శ్చాపి తానన్నం యేషాం నవ్యాదయంగమమ్ ।

తా॥ దంచునప్పుడు తమదేహమును దాఁకఁగూడదు. మాటలాడఁగూడదు. వడ్లు మొదలైన వానిని దంచునపుడు చెమట వడ్లలోఁబడకుండఁ బ్రాంతిగుడ్డతో దుడిచికొనవలయును. వడ్లు దంచినతరువాత బియ్యమును ముత్యమువలెఁ దెల్లగా దంచి యొకపల కవెనుకటిభాగమందుఁబోసి రాళ్లు మొదలైనవి లేకుండఁ జక్కఁజేయ వలయును వడ్లను యవలను నీళ్లలోఁబోసివండిదంపఁగూడదు అనఁగా నుప్పుడిబియ్యము చేయఁగూడదు.ఎండ బెట్టనివడ్లను దంపఁగూడదు. ఏధాన్యము వండక అన్నముజేసినయెడల భోజనార్హము కాదో ఆధాన్యమునుమాత్రము వండవచ్చును-

శస్త్రేణ ఫలమూలాని నికృత్యాలోక్య యత్నతః॥ ౯౪॥
క్రిమికణ్టకదోషాదీ న్నిహృత్య ద్వ్యాగ్యతా సతీ।
యత్నేన సర్వశాకానాం క్రిమికీటాది వీక్షయేత్॥ ౯౫॥

తా॥ కందమూలఫలాదులను గత్తితోఁగోసి చేవలయును. వానిని పురుగులు ముండ్లు మొదలైనవి లేకుండఁ జక్కఁబెట్టి అట్లే యత్నముతోఁ గూరమొదలైనవానిని పురుగులు మొదలైనవి లేకుండునట్లు మాటలాడకుండ నిల్లాలు సరిగాఁజూడవలయును.

ఆహృత్యాధాయ బహుశః పునఃపున రుదీక్షయేత్।
సతణ్డులాని ముద్గాని శాకాని చ ఫలానిచ॥ ౯౬॥
చతురి ప్రక్షాల్య శుద్ధాభి రద్భిః ప్రక్షాల యేత్తథా।

తా॥ బియ్యము పెసలు మొదలైనవానిని దంచినతరువాత రాళ్లు మొదలైనవి లేకుండ బాగుగాఁ బలుమాఱు చూడవలయును ఆకూరలు కందమూలఫలాదులను బలుమాఱు విదిలించి పురుగులు లోనగునవి లేకుండఁ జూడవలయును. అన్నిటిని శుద్ధ జలములతో నాల్గుసార్లుగడుగ వలయును

హవ్యం ముద్గంచ శాల్యన్నం పుష్పశాకే తులస్యపి॥ ౯౭॥
తణ్డులామ్భఃకణం తద్వ దన్ననిస్స్రావ మేవ చ।
సంవిభాగా త్పురా సర్వ ముపయోగం నచార్హతి॥ ౯౮॥

తా॥ హోమద్రవ్యము పెసరపప్పు వరియన్నము గూరలు పువ్వులు తులసి కడుగు నీరు గంజి ఇవియన్నియు వారివారికి పంచిపెట్టకమునుపు ఉపయోగింపఁగూడదు.

అపర్యుషితలిప్తేషు తాపితే ష్వాతపాగ్నిభిః।
మృన్మయేషు చ పాత్రేషు పచేయుః క్షాళితేషు చ॥ ౯౯॥

తా॥ ఇత్తడిలోనగుపాత్రములు వంటకు సంపాదించుకొన శక్తిలేనియెడల మంటిపాత్రములయందు వంటచేసికొనవచ్చును. అవియగ్నియందుఁగాల్పఁబడినవిగాను ఎండలో నెండినవిగాను ఉండునది అంట్లులేకయుండలను శుద్ధజలముతోఁ గడిగి వాని యందుఁబాకము చేయవలయును అవి చల్దిసంబన్ధము లేనివై కావలయును

మృన్మయేషు నవేష్వేవ శక్తశ్చే త్పాచయే ద్ధవిః।
పక్షా దూర్ధ్వం నకర్తవ్యా మృన్మయే పచనక్రియాః॥ ౧౦౦॥

తా॥ ప్రతిదినము క్రొత్తకుండలను గొనుటకు శక్తిగలవాఁడయ్యెనేని ప్రతిదినము క్రొత్తకుండలయందే వంట చేయవలయును అశక్తుఁడైన యెడల పదునేనుదినముల వఱకునాకుండలయందేవంటచేసికొనవచ్చును ఒకపక్షదినము లైన తరువాతమంటిపాత్ర మందు వంటచేయఁగూడదు.

భిన్నాని వికలాఙ్గాని వికటాని తథైవచ।
శర్కరాస్థిసమేతాని భాణ్డాని పరివర్జయేత్॥ ౧౦౧॥

తా॥ పగులులుఁగలవియు మెట్టియైనవియు చూచుటకు రమ్యముగానుండనివియు రాళ్లు ఎముకలు గలవియు నగుకుండలు వంటకుఁ బనికిరావు గనుక వానిని విడువ వలయును.

పక్షా దూర్ధ్వం న సంగ్రాహ్యం ముద్గసారం ఘృతం తిలమ్।
తామ్బూలం తణ్డులం చైవ మాసాదూర్ధ్వం న సంచయేత్॥౧౦౨॥

తా॥ మంచి పెసలు నెయ్యి తిలలు వీనిని పదునేను దినములకుఁ జాలునట్లు చేర్చి పెట్టుకొనవలయునుగాని దానికిఁ బైనఁజేర్చిపెట్టుకొనఁగూడదు. తాంబూలమునకుఁ దగినవస్తువులను బియ్యమును నెలకుఁ దగినంతచేర్చిపెట్టుకొనవలయునుగాని దానికిఁబైన జేర్చిపెట్టుకొనఁగూడదు.

అగ్నౌ ప్రజ్వలితే సమ్య క్పాచయే దోదనాదికమ్।
వస్త్రం కేశం శరీరం వా స్పృష్ట్వా ప్రక్షాలయే త్కరమ్॥౧౦౩॥

తా॥ మండినయగ్నియం దన్నము మొదలైనదానిని చక్కఁగఁ పాకము చేయవలయును. వంటచేయునప్పుడు కట్టువస్త్రమును తలవెంట్రుకలను దేహమును దాఁకఁ గూడదు, తాఁకినపక్షమున చేతిని గడిగికొనవలయును.

నాసోదకం నేత్రవారి స్వేదామ్బూని న సంస్పృశేత్।
స్పృష్ట్వా ప్రక్షాలయేత్పాణి మంశుకేన తు మార్జయేత్॥ ౧౦౪॥

తా॥ ముక్కునీటిని కన్నీటిని చెమటలను వంటునప్పుడు తాఁకఁగూడదు తాఁకిన యెడల నాచేతిని గడిగి విడవస్త్రముతోఁ దుడుచుకొనవలయును.

నోపశా మ్యోపశామ్యాగ్నిం నమన్థం నాపి సత్వరమ్।
నావతా ర్యావతా ర్యాథో నాన్యబుద్ధిః పచే ద్ధవిః॥ ౧౦౫॥

తా॥ కావలసినంతమంటమండునప్పుడార్పకయు ఎక్కువమంటనార్పియు హెచ్చుతగ్గులులేకుండఁ దగినమంట కలుగునట్లు నాయిత్రింపఁ గట్టెల నెగఁద్రోయుచుఁ దిగఁద్రోయుచు అగ్నిని ప్రజ్వలింపఁజేసి వంటతప్ప మతియొకదానియందు మనస్సును బోనీయక పాదము వండవలయును.

తాల మశ్వత్థకాష్ఠం చ పలాశం బిల్వ మేవచ।
మారీచకం మదనకం తైల మున్మత్తకం తథా॥ ౧౦౬॥
ఖాదరం చ కరఞ్జం చ శిరీషం వ్యాధిఘాతకమ్।
నిమ్బం తథా కపిత్థం చ పారిజాతక మేవచ॥ ౧౦౭॥
ఏరణ్డ మగరుం చైవ కోవిదారం విభీతకమ్।
హారీతకం శాల్మలిం చ శ్లేష్మాతక మథాపి వా॥ ౧౦౮॥
వర్జయే దిన్ధనార్థంచ యచ్చాన్య త్కీటసంయుతమ్।

తా॥ ఏకట్టెలను వంట కుపయోగింపఁ గూడదనఁగా. తాడి రావి మోదుగ మారేడు మిరియము మదనకము నువ్వు ఉన్మత్త రేఁగు పులిగోరు దిరిసెము వ్యాధిఘాతకము నిమ్మ వెలగ పారిజాతము ఆముదము అగరు కాంచనము తాండ్ర హారీతకము బూరుగు విరిగి అనుచెట్లయొక్క కట్టెలను పురుగులుగల కట్టెలను ఉపయోగింపఁగూడదు. తేనెపెట్టినచెట్లకట్టెలను వంకరకట్టెలను వీనినన్నింటిని వంటచెరుకుగా నుపయోగింపఁగూడదు.

వైషమాణిచ సర్వాణి మధుదిగ్ధాని యానిచ॥ ౧౦౯॥
ఉచ్ఛిష్టస్పృష్టకాష్ఠాని కణ్టకాని తథైవచ।
దుర్గన్ధధూమయోగీని చోలోచ్ఛిష్టవనానిచ॥ ౧౧౦॥
యేషాం క్షీరం న కర్తవ్యం తేషాం కాష్ఠాని వర్జయేత్।

తా॥ ఎంగిలివస్తువులసంబన్ధము గలకట్టెపిడుకలను కంపుగొట్టు పొగకలిగినకట్టెలను చెట్లురాపిడివల్ల గలిగిననిప్పుచే సగము కాలినయడవికట్టెలను వైదికమునకు నుపయోగింపఁగూడనిపాలుఁగలచెట్లకట్టెలను వంట కుపయోగింపఁగూడదు

వ్యఞ్జనానిచ శస్తాని శాకాదీ న్యపి పాచయేత్॥ ౧౧౧॥

తా॥ అన్నముభుజించుటకు సాధనములును శాస్త్రమందుఁ గ్రాహ్యముగా జెప్పఁబడినవియునగు శాకములు మొదలైనవానినిగూడ వండ వలయును,

కదలీజాతయస్సర్వాశ్చూతశ్చపనసద్వయమ్।
ఉర్వారుకంచ బృహతీ జ్కారవల్లీత్రయం తథా॥ ౧౧౨.

కర్కన్ధూం క్షుద్రబృహతీం కూశ్మాణ్డం తిన్త్రిణీం తథా।
నారికేళం చ సింహీంచ కార్కోటం వత్సరీం తథా॥ ౧౧౩.

అలర్కం క్షుద్రకన్దంచ మహాకన్దం తథైవచ।
కన్దం పిణ్డీయుతం చైవ సూరణం కీలమేవచ॥ ౧౧౪.

మరీచం జీరకం చైవ నిష్పావం రాజమాషకమ్॥ ౧౧౫.

మాషముద్గం మహాముద్గం సురసీం శాకినీం తథా।
శాకుటిం శిమ్బుకం చైవ జీవన్త్యగస్త్యపల్లవాః॥ ౧౧౬.

శృఙ్గిబేరం కులుత్థంచ వ్యాఘ్రిసింహీం తథైవచ।
శస్తా న్యన్యా న్యదుష్టాని సుశృతః కారయేద్బుధః॥ ౧౧౭.

తా॥ అన్నిజాతులయరటులును మామిడి రెండువిధములైనపనసలును దోసవాఁకుడు మూఁడువిధములైన కాకరయు రేఁగు పెద్ద వాఁకుడు గుమ్మడి చింత టెంకాయ అక్షసరము కార్కోటకము వత్సరి అలర్కము (తెల్లజిల్లెడి) దురదకంద మంచికంద పిండికంద కంఁగడ్డ కీలము మిరియము జీలకఱ్ఱ అనుములు అలసందె ఉద్దులు పెసలు పెద్దపెసలు సర్వాక్షి పెరుగుతోఁటకూర శాకుటెనల్లపెసలు పాలకూర అగిసెకూర అల్లము ఉలవలు చిన్నవాఁకుడు ఈచెట్లకూరలను వంటకుపయోగించుకొనవలయును, ఇంక శాస్త్రమందుఁ జెప్పఁబడినవియు దోషయుక్తములుగానివియునగు నితరశాకములనుగూడ వంటకుపయోగింపవలయును.

కోశాతకీ మలాబూంచ దూరతః పరివర్జయేత్।
జీరకాజ్యవిమిశ్రాణి నారికేళయుతానిచ॥ ౧౧౮.

సమరీచాని కార్యాణి వ్యఞ్జనాని రసైః స్సహః
పయోమిశ్రాణి శాకాని హిమమిశ్రాణి కారయేత్॥ ౧౧౯.

తా॥ బీరకాయ సొరకాయ వీనిని దూరముగా విడిచిపెట్టవలయును. కరివేపమాకు మొదలైన వ్యఞ్జనములయందు జీలకఱ్ఱ కొంకాయ మిరియాలపొడి వీనిని జేర్పవలయును. మఱియు నాయావ్యఞ్జనములకుఁ దగునట్లు ఉప్పు కారము పులుసు మొదలైన రసంబులను జేర్పవలయును. నేతితోను ఇంగువతోను తిరువవిమార్జనము చేయవలయును.

ఆసురం స్యా ద్విదగ్ధం య దపక్వం రౌద్ర మేవచ।
దైవం సుశృత మే వాతః కర్తవ్యం సుశృతం హవిః॥ ౧౨౦.

తా॥ మాడినపదార్థము ఉడకని పదార్థంబును తీక్ష్ణపదార్థంబులును రాక్షసులకుఁ బ్రీతికరములై యుండును. మాడకుండఁ బచ్చిలేకుండఁ జక్కఁగాఁ బక్వమైన పదార్థము దేవతా ప్రీతికరమైయుండును గావున నేపదార్థమునుగాని చక్కఁగాఁ బక్వము చేయవలయును.

కేశకీటాదిభి ర్దుష్టం నిదగ్ధం చాశృతంతువా।
శాకౌదనాదికం సర్వం సర్వథా పరివర్జయేత్॥ ౧౨౧.

తా॥ కూర అన్నము మొదలైనవానియందుఁ దలవెండ్రుకలు పురుగులు మొదలైనవి యున్నయెడల నవి దుష్టములు. అట్లే మాడినవియు బాగుగాఁబక్వములుగానివియు దుష్టములు. గావున వాని నన్నింటి నన్నివిధముల విడువవలయునుగాని భుజింపఁ గూడదు.

ముద్గాన్నం చ గుడాన్నం చ పాయసాన్నం విశేషతః।
శక్తశ్చే దానయే న్నిత్య మపూపా న్భక్ష్యమేవచ॥ ౧౨౨.

తా॥ శక్తుఁడైనయెడలఁ బులగమును (పొంగలిని) శర్కరపొంగిలి పాయసాన్నమును వడలు మొదలైన పిండివంటలను భుజింపఁదగిన శక్యమైన పదార్థములను అధికముగాఁ బ్రతిదినమును జేయవచ్చును.

పర్వణి శ్రపయే దన్నం పాయసం ద్వాదశీషు చ।
సర్వేషాం పాయసం శుద్ధం గవ్యం చేతి నిగద్యతే॥ ౧౨౩.

9

తా॥ అమావాస్య పున్నమ మొదలైన పర్వకాలములయందును ప్రతి ద్వాదశి యందును పాయసాన్నమును జేయవలయును. అన్నిటికిని ఆవుపాలు ఆవునేతిని జేర్చిన యెడల నదిపరిశుద్ధమైనది.

అశుద్ధంతు దశాహాని ప్రసూతాయాస్తు గోః పయః।
పలాణ్డులశునామేధ్యం భక్షయన్త్యాః పయస్తథా॥ ౧౨౪.

తా॥ ఈనినపదిదినములవఱకును ఆవుపాలు అపరిశుద్ధమైనది ఎఱ్ఱయుల్లిగడ్డలు తెల్లుల్లిగడ్డలను అమేధ్యమును దినకట్టి యావుయొక్కపాలును అపరిశుద్ధమైనది.

అరజ్జ్వా దోహితాయాశ్చ నిక్షిప్తాయాశ్చ గోః పయః।
తథైవాధికృతాయాశ్చ లాభప్రాప్తం పయస్తథా॥ ౧౨౫.
దేశకాలాతివృత్త్యాచ యస్యా ఊధసి సంస్థితమ్।
క్షీరం తస్యాస్త్వకర్మణ్యం వినా వత్సంచ దుహ్యతే॥ ౧౨౬.

తా॥ త్రాటితో గాళ్లకట్టకుండ బిండినయావుపాలును బందెదొడ్డిలోనున్న యావుపాలును యజ్ఞాదికర్మమందు నియమింపబడిన యావుపాలును లాభముచే దొరకిన పాలును సత్కర్మమునకుపయుక్తముగాను నివసింపదగని చణ్డాలాదిప్రదేశమందున్న యావుపాలును అకాలమందు బిండిన యావుపాలును అవుపాదుగు నందుండెడి పాలను దూడ ప్రాగకుండ బిండిన యెడల నట్టిపాలును సత్కర్మమునకుపయోగింపవు.

విధ్యన్త్యా అప్యకర్మణ్యం ప్రసవన్త్యా తివృత్తితః।
వృషస్యన్త్యా స్తథా క్షీరం వాహార్థే యాచకల్పితా॥ ౧౨౭.

తా॥ హింసించుచుండెడి గోవు అధికప్రయాసముగా బ్రసవించెడిగోవు మైథునేచ్ఛగలగోవు భారము మోయుటకు నేర్పఱుపబడినగోవు వీనియొక్కపాలు సత్కర్మములకు నుపయోగింపదు. ( ప్రసవన్త్యాతివృత్తితః అనుచోసన్ధి ఆర్షము. )

మృతం కర్మణ్య మస్యాశ్చ యస్యా వత్సో భివర్ధతే।
యస్యా వత్సో నవర్ధన్తే తస్యాః క్షీరం వివర్జయేత్॥ ౧౨౮.

తా॥ ఏ యావుయొక్క దూడ వర్ధిల్లునో యాయావుపాలు కాచబడినదై సత్కర్మమునకుపయోగించును. ఏయావు దూడలు వర్ధిల్లవో దానిపాలుపనికిరాదు.

రుద్రాదివ్యాపదేశిన్యో యాశ్చ గావస్తదఙ్కితాః।
పయస్తాసామకర్మణ్యం లీఢం యత్సవిషైరపి॥ ౧౨౯.

తా॥ దున్నడము మొదలైన తామసదేవతల నామములచేఁ బిలువఁబడునట్టియుం శూలను మొదలయిన చిహ్నములుగలవియు నగు గోవులయొక్క క్షీరమును విమతులగు జంతువులు త్రాగఁగా మిగిలినపాలును ఏకక్షము నకును ఉపయోగింపఁగూడదు

కృష్ణాం పయ ఆహృత్య పాయసం కారయే ద్ధవిః।
అపూపంచ గుడాన్నంచ నన్ద్యాయాం సగుణం హవిః॥ ౧౩౦

తా॥ ఇట్లు సత్కార్యమున కుపయోగపడఁదగిన పాలను దెచ్చి దానితోఁ బాయసమును జేయవలయును నన్దతిదియందుఁ బిండివంటలు మాధుర్యాదిగుణయుక్తమైనహవిస్సును జేయవలయును.నన్దతిథియనఁగా, పాడ్యమి - షష్ఠి - ఏకాదశి - ఈతిథులు

వైశేషికేషు కుర్వీత దివసేషు విశేషవిత్।
పాకం వాయసపూర్వాణా మన్యేషాంచ యథాబలమ్॥ ౧౩౧

తా॥ విశేషదినములయం దెప్పుడెప్పుడేదేది చేయవలయునో ఆవిషయమును జక్కఁగాఁ దెలిసికొన్నవాఁడై తనశక్త్యనుసారముగాఁ బాయసము మొదలగువానిని జేయవలయును

సఙ్క్రాన్తి ర్జన్మనక్షత్రం శ్రవణం ద్వాదశీద్వయమ్।
పర్వద్వయం సముద్దిష్టం సవిశేషక్రియావిధౌ॥ ౧౩౨.

తా॥ విశేషక్రియలను జేయుటకుఁదగిన విశేషదినములేవియనఁగా—సఙ్క్రాన్తి జన్మనక్షత్రము శ్రవణనక్షత్రము శుక్లపక్షద్వాదశి కృష్ణపక్షద్వాదశి అమావాస్య పున్నమ ఇవివిశేషపాకక్రియలకుఁ దగినవి.

చన్ద్రసూర్యోపరాగేచ ప్రాదుర్భావదినేషుచ।
మాసర్క్షేషు సమర్క్షేషు విశేషారాధనం హరేః॥ ౧౩౩.

తా॥ చన్ద్రగ్రహణకాలమందును సూర్యగ్రహణకాలమందును భగవదవతారదినములయందును ప్రతిమాసము ప్రతిసంవత్సరమువచ్చెడి యవతారతిథినక్షత్రములయందును భగవదారాధనము విశేషముగాఁ జేయవలయును.

దుర్నిమిత్తేచ దుస్స్వప్నే సంజాతేఽపి మహాభయే।
ఆగతేషుచ భక్తేషు కుర్యా ద్వైశేషికక్రియాః॥ ౧౩౪.

తా॥ దుశ్శకునము దుస్స్వప్నము గొప్పభయము ఇవికలిగినప్పుడును భగవద్భక్తులు వచ్చినప్పుడును భగవదారాధనము విశేషముగాఁజేయవలయును.

ద్రవ్యహీనం యది భవేత్కర్మ వైశేషికం వృథా।
నిర్ధనోపి యథాశక్తి కుర్యాచ్ఛక్తస్తు విస్తృతమ్॥ ౧౩౫.

తా॥ ధనహీనుఁడును శక్త్యనుసారముగాఁ గర్మమునుజేయవలయును శక్తుఁడు దానిని విశేషముగాఁ జేయువలయును, ద్రవ్యవస్తుఁడయ్యును ద్రవ్యమునుపయోగింపక కర్మములనుమాత్రము విశేషముగాఁ జేసినయెడ నవి వ్యర్థములగును

కేవలేనోఁగకేనాపి శాకేన సుశృతేనచ।
నైత్యం కర్మ విధేయం వై భక్తానాం శుద్ధచేతసామ్॥ ౧౩౬.

తా॥ భగవద్భక్తులు శుద్ధాన్తఃకరణముగలవారై ఉత్తజలముతోనైనను బాగుగాఁ బక్వమైన కూరచేతనైనను బ్రతిదినముచేయవలసిన కర్మముల నవశ్యముచేయవలయును

సుపక్వేషు చ సర్వేషు పరిమృజ్యామ్బునా ఖిలమ్।
ఊర్ధ్వపుండ్రైరలంకృత్య నయేద్యాగాలయం హవిః॥ ౧౩౭.

తా॥ బాగుగాఁ బక్వముఁలైన ప్రసాదము మొదలైన సకల పదార్థములను మీఁద నూర్ధ్వపుండ్రాకృతిగా వ్రేళ్లతోనొత్తి శుద్ధోదకముతోఁ బ్రోక్షించి భగవత్పూజా గృహంబునకు కొనిపోవలయును.

పాకస్థానం గృహం సర్వం విమృజ్యాభ్యుక్ష్య వారిణా॥
అచ్ఛాద్య వస్త్ర మన్యచ్చ సమాచామేత్కుటుమ్బినీ॥ ౧౩౮.

తా॥ వంటచోటును గృహము నంతయుఁ జక్కఁగా నూడ్చి నీళ్లు చల్లి హవిస్సును శాకాదులను వస్త్రముతోఁగప్పిపెట్టి యిల్లాలు ఆచమనమును జేయవలయును.

ప్రవిశ్య భగవద్గేహం దీపం ప్రజ్వాల్య గేహినీ।
కాఙ్క్షన్తీ భర్తు రాయానం తిష్ఠేత్సపరిచారికా॥ ౧౩౯.

తా॥ భగవత్పూజాగృహమును బ్రవేశించి తిరువిళక్కును వెలిగించి యిల్లాలు తనపరిచారికతోఁగూడ భర్తయొక్కరాక నెదురు చూచుచుండవలయును.

జఘన్యశాయినీ నిత్యం పూర్వోత్థానపరా తథా।
అన్తర్బహిశ్చ సంశుద్ధా గృహకర్మసు సోద్యమా॥ ౧౪౦.
మఙ్గలాచారశీలాచ భృత్యబన్ధుజనప్రియా।
పియంవదా శమాభూషా ప్రహృష్టవదనా సదా॥ ౧౪౧.

ప్రమృష్టగేహాఙ్గణమలా బాలపుత్రాఙ్గతిథిప్రియా
మృష్టసంక్షిప్తభాణ్డౌఘా గుప్తధాన్యా పతిప్రియా। ౧౪౨.
హృద్యవేషా సదా భర్తురానుకూల్యప్రయోజనా।
యథాలబ్ధేన సుప్రీతా కుశలా పాకకర్మణి। ౧౪౩.
రస్యవస్తుషు నిస్పృహా కాలే మేధ్యాన్నభోజినీ।
భగవద్భక్తియుక్తా చ తథా భాగవతప్రియా॥ ౧౪౪.
మితసంభాషిణీ హాసరోదనోద్ఘోషవర్జితా।
గృహాన్తర ద్వారదేశస్థానాన్తరవివర్జితా॥ ౧౪౫.
నిద్రాలస్యవివాదాసద్భాషణానత్యవర్జితా।
నిస్పృహా పరకీయేషు స్థిరబుద్ధిర్దృఢవ్రతా॥ ౧౪౬.
అలుబ్ధా సుల్బణా స్నిగ్ధా సలజ్జా మధురస్వనా।
కుశలా లోకయాత్రాసు దృష్టాదృష్టక్రియాపరా॥ ౧౪౭.
వ్యయే చ ముక్తహస్తా చ దోషశ్రవణభీషితా।
నాస్తివాక్యేతిసంత్రస్తా సంచారే చ్ఛన్నవిగ్రహా॥ ౧౪౮.
నతవక్త్రా చలాక్షీచ వేశ్యాలావణ్యనిస్పృహా।
గుప్తవేషా రహస్యార్థకర్త్రీ భోజ్యాన్నభోజనా॥ ౧౪౯
ఏవమాదిగుణోపేతా నారీసా ముత్తమా సతీ।

తా॥ ఇల్లాలు ఎట్టిగుణములుగలది కావలయుననఁగా, భర్తనిద్రపోయిన తరువాతఁ దాను నిద్రపోవలయును. భర్తనిద్ర లేవక మునుపే నిద్ర లేవవలయును. మనశ్శుద్ధియు దేహశుద్ధియుఁ గలదై యుండవలయును, ఇంటిపనులయందు జాగరూకురాలై యుండవలయును. మంచియాచారము మంచిస్వభావముగలదై సేవకులకును బంధుజనులకు ననుకూలురాలై యుండవలయును. ఎప్పుడును ప్రియవచనములాడుచు నితరులగుణము ముననరింపవలయుననెడి కోరికకలదై యుండవలయును మఱియు సత్స్వభావముగలదియుం గృహమందంతటను పెంట మొదలయినవి లేకుండ నూడ్చి శుద్ధిచేయునదియును తాను సుదేహమాలిన్యము లేనిదియు బిడ్డలుపాపలు అతిథులు వీరియందుఁ బ్రీతిగలదియుం వంట మొదలయిన పనులకుఁ గావలసిన కొన్ని పాత్రములను శుభ్రపఱచునది తన

భర్తసంపాదించిన ధాన్యము మొదలయిన వస్తువులు ఎలుకలు మొదలగునవి తినకుండఁ గాపాడునదియు భర్తయందుఁ బ్రీతిగలదియు ఎల్లప్పుడు భర్తకిష్టమైన వేషముగలదియు భర్తకిష్టమైన పనిని జేయునదియు దొరికినంతకు సంతోషించునదియు వంటయిండు నేర్పరియు రుచిగలవస్తువులయందు జిహ్వాచాపల్యము లేనిదియు కాలమందుఁ బరిశుద్ధమైనయన్నము భుజించునదియు భగవద్భక్తిగలదియు అట్లే భగవద్భక్తులయందు భక్తిగలదియు మితముగా సంభాషించునదియు అంజలితోను మాటలాడునపుడు విశేషముగా నవ్వక కన్నీరు కార్పక గట్టిగా అరవక వర్తించునదియు పొరుగింటిలోఁ గాని వాకిటియందుఁగాని మఱియొకచోఁ గాని నిలువనిదియు తలఁచినప్పుడెల్ల నిద్రపోవుటయు సోమరితనము జగడము చెడ్డ వాక్యములను భాషించుటయు అసత్యవచనములను జెప్పుటయును లేనిదియు ఇతరులసొత్తులందు ఆశలేనిదియు స్థిరబుద్ధిగలదియు దృఢమైన అనుష్ఠానముగలదియు ఆత్మశ్లాఘలేనిదియు గర్వముగా మాటలాడనిదియు సన్నని శరీరము గలదియు సిగ్గుగలదియు మధురముగా భాషించునదియు లోకానుభవమెఱిగినదియు ఇహపరసాధక క్రియలయందు నాశగలదియు దాతృత్వగుణముగలదియు పాపకార్యములను వినుటకు భయపడునదియు అడిగినవారికి లేదనుటకు మిక్కిలి భయపడునదియు నడుచునప్పుడు తనశరీరావయవములు కనఁబడకుండ వస్త్రమును గప్పుకొనిపోవునదియు తలవంచుకొనునట్టి స్వభావముగలదియు మెల్లగానడుచునదియు బోగముతళుకులేనిదియు తాఁ గొన్నదైనను మంచి చీరె మొదలయినవి ధరించినప్పుడా వేషమును జూచి యితరులు మెచ్చుకొనవలయునని తలంపులేనిదియు రహస్యవిషయమునుగాని రహస్యకార్యమునుగాని బైలుపఱుపనిదియు భుజింపఁగూడనియన్నమును భుజించనదియుఁగా నుండవలయును. ఇట్టిగుణములుగల యిల్లాలు ఎల్లస్త్రీలలో నుత్తమురాలని చెప్పఁబడును.

భర్తా యస్త్వనురూపోఽస్యాః కృతకృత్యస్స చేతనః॥ ౧౫౦.

తా॥ ఇట్టి యిల్లాలికిఁదగిన భర్తయెవఁడగునో వాఁడు కృతార్థుఁడగును. కృతార్థుఁడనగా జన్మమెత్తిన తరువాతఁ జేయఁదగిన మంచి పనులేవో వానినిజేసిన వాఁడు.

భర్తుస్స్వస్యానురూపాణి నకుర్వన్తీ మచేతనామ్।
శ్లాఘయన్తీం స్వసామర్థ్యం భర్తృనిన్దాపరాయణామ్॥ ౧౫౧.
అసమక్షం సమక్షం వా దుష్టాం తాం విసృజేద్బుధః॥

తా॥ తనభర్తకనుకూలకార్యమును జేయక తనసామర్థ్యమును భర్తదగ్గఱనున్నప్పుడుగాని లేనప్పుడుగాని ప్రకటించుకొనుచు నే స్త్రీ భర్తను నిందించుచున్నదో యట్టి దానిని దుష్టురాలిని దెలిసినవాఁడు విడువవలయును.

భర్తుర్ధనంచ లోభాత్స్త్రీ క్షీణ్యమానేఽపిభర్తరి। ౧౫౨.

గోపయ త్యర్థశీలాం తాం కుత్స్యా త్యాక్త్యాహి మత్కృతామ్।
నిజోదరం పూరయన్తీం భృత్యవర్గం తథాతిథిమ్॥ ౧౫౩.

న్యాస్యాన్తుమాశయతీం స్త్రీయా తయా పాకం వివర్జయేత్।
పాపం వృథా కారయన్తీకా స్తేనస్వేనవాసుతైః॥ ౧౫౪.

తా॥ భర్తకు గష్టకాలమువచ్చినప్పుడును లోభమువలన భర్తసంపాదించిన ధనమును ఇంకనితరవస్తువులను భర్తకుదెలియకుండదాచుకొనుచు ధనమును జేర్చుకొనుచు నేస్త్రీ యుండునో యట్టి స్త్రీని వివములను జేయకుండునట్లు చేయవలయు, మఱియునే స్త్రీ భర్త సేవయందాదరము లేక తనపొట్టను నింపుచుకొనుచు భృత్యులకును గ్రొత్తగానింటికివచ్చినవారికిని దక్కువగా నన్నముపెట్టునో యా స్త్రీ చేతఁజేయఁబడినపాకమును విడువవలయును తనభర్తతోఁగాని కొడుకులతోఁగాని వ్యర్థముగా జగడమాడు స్త్రీనిగూడ విడువ వలయును

శ్వశ్రూశ్వా వివదమానాయాః స్వేన వా బన్ధుభి స్సుతైః।
వారయే త్తాం ప్రయత్నేన న తయా కర్మకారయేత్॥ ౧౫౫॥

తా॥ అత్తగారితోఁగాని తనతోఁగాని చుట్టములతోఁగాని కొడుకులతోఁగాని జగడమాడునట్టి భార్యను విడువ వలయును. ఆభార్యచేత నేపనిని జేయింపగూడదు.

ధర్మహాని ర్యథానస్యా ద్యథాసజ్జనగర్హణా।
సర్వం తథా సమీక్ష్య ప్రాగాచరే ద్బుద్ధిమా న్నరః॥ ౧౫౬॥

తా॥ బుద్ధిమంతుఁడగు మనుష్యుఁడు ధర్మహానిరాకుండునట్లును సజ్జనులు తన్నునిన్దింపకుండునటులను జక్కగా విచారించి యన్నిపనులను జేయవలయును.

స్వాధీనాం కారయే న్న్యాసం సర్వకర్మసు చేత్సవాన్।
సర్వకర్మసు సందధ్యా త్స్వగ్ధిః కిల తయాపసర్ ॥ ౧౫౭॥

తా॥ తనభార్యలేనిమొదల నేకర్మములనుజేయుటకును దనకధికారము లేదుగనుకను అన్నికర్మములయందును ఆభార్యతో వసించుచునే అనుకూల్యము గలిగి భగవన్తునను

స్థింపవలయునుగనుకను బుద్ధిమన్తుఁడగువాఁడు తననేర్పుచేతఁ బ్రియుఁడై సర్వకర్మము లయందును దనభార్యను స్వాధీనురాలినిగాఁ జేసికొనవలయును.

స్త్రీకృత్యేషు నవిశ్వాసః కర్తవ్య స్సత్క్రియాపరైః ।
మాయాచారేచ నిపుణా మోహాయ న్త్యవిచక్షణాన్॥౧౫౦॥

తా॥ స్త్రీలు తఱుచుగాఁ గపటపు నడతగలవారుగావునఁ దెలివిలేనిపురుషులను మోహపెట్టుదురు కాఁబట్టి సత్కర్మములనుజేయుట యందాసక్తిగలవారు స్త్రీలు చేయుపనులయందు నమ్మకముంపఁగూడదు.

అపరాధో యదిభవే త్ప్రమాదా న్నిజయోషితామ్ ।
ముఖభఙ్గ స్మృ్ృత స్తాసాం దణ్డ స్సంతప్తచేతసామ్ ॥౧౫౯॥

తా॥ తమభార్య లొకవేళ పరాకుచేఁదప్పుచేసి తప్పుచేసితిమిగదాయని పశ్చాత్తాపమునొందినయెడల ఆట్టిస్త్రీల నింకనెన్నటికి నిట్టిపరాకులేకుండునట్లు వాండ్రయెదుటఁదగినమాటలుచెప్పి తలవంపులగునట్లు దండింపవలయును

నతాడయే న్నాతిమాత్రం దూష్యే న్నకృశతాం నయేత్ ।
స్త్రియం భర్తా నచాన్యేషాం దోషం తస్యాః ప్రకాశయేత్॥

తా॥ తనస్త్రీ ఒకవేళఁదెలియక పరాకుచేతఁ దప్పుచేసినయెడల దానికిఁదగినట్లుమృదువుగా దండింపవలయునుగాని కొట్టఁగూడదు. విశేషముగాఁ దిట్టఁగూడదు. కృశించునట్లుచేయఁగూడదు ఆమెయొక్క తప్పు నితరులకుఁ దెలుపఁగూడదు.

భోజనాచ్ఛాదనైః పుష్పభూషణాద్యై ర్నిజస్త్రియమ్ ।
ఆలాపై స్సరసై ర్నిత్యం తోషయేన్నతుదూషయేత్॥ ౧౬౧॥

తా॥ అన్న వస్త్రములు పుష్ప భూషణాదులు వీనినిచ్చి సరసముగా నిత్యము మాటలాడుచుఁ దనభార్యను సంతసింపఁజేయవలయునుగాని దూషింపఁగూడదు,

విలోభయ న్సదా దృష్టాదృష్టార్థ వచనై స్స్త్రియమ్ ।
భగవత్కర్మసిద్ధ్యర్థం నయే దాత్మానుకూలతామ్॥ ౧౬౨॥

తా॥ భగవత్కర్మసిద్ధికై ఎల్లప్పుడును ఐహికాముష్మికసుఖసాధనములైనమాటలనుజెప్పుచు సుఖాశను గలుగఁజేయుచుఁ దనభార్యను స్వాధీనురాలినిగాఁ జేసికొనవలయును.

పుత్రాన్ భృత్యాన్ కళత్రంచ భక్తమాశ్రితమేవ చ ।
నిత్యం కుర్యాదుపాయేన భగవద్భక్తిభావితాన్ ॥ ౧౬౩ ॥

తా॥ తనపుత్రులను సేవకులను భార్యను తనయందు భక్తిగలవానిని తన్నాశ్రయించినవానిని ప్రతిదినము తగినయుపాయముచేత భగవద్భక్తిగలవారినిగాఁ జేయవలయును.

అపుత్రా వా సపుత్రా వా భక్తా దక్షా చ కర్మసు ।
యా స్త్రీ తాం వర్జయేద్భర్తా న కదాచిదపి ప్రియామ్ ॥ ౧౬౪ ॥

తా॥ తనయందు భక్తిగలదియు ఇంటిపనులను జేయించుటయందును చేయుటయందును సమర్థురాలైన స్త్రీ పుత్రులు లేనిదైనను పుత్రవతురాలైనను అట్టి ప్రియురాలి నొకానొకప్పుడును భర్త విడువఁగూడదు.

పుత్రార్థీ నోద్వహేదన్యాం కర్మపుత్రా హి యోగినః ।
అపుత్రోఽపి పరం యాతి కర్మనాన్యోఽపి సత్సుతః ॥ ౧౬౫ ॥

తా॥ తన భార్య పుత్రులు లేనిదైనను భగవత్కర్మమున కుపయుక్తురాలైనయెడలఁ బుత్రునిఁగోరి ఇంకొక స్త్రీని వివాహము చేసికొనఁగూడదు. కర్మయోగముగలవారికిఁ బుత్రవంతునకుఁగలిగెడి సద్గతికలుగును గావునఁ దా నపుత్రవంతుఁడైనను గర్మఠుఁడైనయెడల సత్పుత్రవంతునివలె సద్గతినిబొందుచున్నాఁడు.

న స్త్రీజితో భవేద్భర్తా న చాశక్యేషు యోజయేత్ ।
గుణాన్నకథయేత్ స్త్రీణామసక్తస్సక్తవద్భవేత్ ॥ ౧౬౬ ॥

తా॥ భర్త భార్యకు లోఁబడఁగూడదు. అశక్యకార్యములను జేయుమని స్త్రీకి నాజ్ఞాపింపరాదు. స్త్రీలకు సుగుణములున్నను వానినిఁ బ్రకటింపరాదు. స్త్రీయందను రాగము లేకున్నను అనురాగమున్నవానివలెఁ బైకిఁ బ్రవర్తింపవలయు.

నిర్భయాస్సుహృదో లోకే యథాస్యుస్సర్వజన్తవః ।
స్నిగ్ధం జితం యథా వస్యాత్స్వకుటుమ్బం తథాచరేత్ ॥ ౧౬౭ ॥

తా॥ సర్వప్రాణులును దనదగ్గఱ భయములేనివారును మిత్రులునగునట్లు చేసికొనవలయును. మఱియును తనకుటుమ్బము తనయందుఁ బ్రీతిగలదియు తనకులోఁబడి యుండునదియునగునట్లు చేసికొనవలయును.

యథాశాస్త్ర ముపాదాన మాచరేద్భోగనిస్పృహః ।
భగవద్ధర్మలాభేన తృప్తోయ స్స సుఖీ భవేత్ ॥ ౧౬౯॥

తా॥ తనకు సుఖముగావలయుననికోరక శాస్త్రోక్తప్రకారముగా నెత్తుకొనఁదగినవస్తువుల నెత్తుకొనవలయును, ఎవఁడు భగవత్కైంకర్యమనెడి లాభముచేఁ దృప్తినొందునో యతఁడు సుఖియగును.

ఇతి శ్రీశాణ్డిల్యస్మృతౌ విశిష్టధర్మశాస్త్రే
తృతీయో౽ధ్యాయః.



అథ చతుర్థో౽ధ్యాయః.



ఉపాదానప్రకారో౽యం సమ్యగుక్త స్సమాసతః ।
ఇజ్యాచారం ప్రవక్ష్యామి యథావ దనుపూర్వశః ॥ ౧॥

తా॥ ఓమునులారా! భగవత్కైంకర్యార్థము తగినవస్తువులను స్వీకరించుట యెట్లో ఆవిధము సంగ్రహముగా బాగుగాఁజెప్పఁబడెను, ఇఁకను, భగవన్తుని నారాధింపఁదగిన విధమును వరుసగా శాస్త్రోక్తప్రకారముగాఁజెప్పెద వినుఁడని శాణ్డిల్యమహర్షి చెప్పెను.

భోగానుపాహృత్య యాగార్థం విధివత్స్నాన మాచరేత్ ।
ప్రక్షాళ్య పాణీ పాదౌ చ న్వాచాన్త స్సోర్ధ్వపుండ్రకః ॥ ౨॥
సపవిత్రకరశ్చైవ ప్రసన్నో యాగ మారభేత్ ।

తా॥ దేవపూజార్థము షోడశోపచారాదిభోగములకుఁ దగినవస్తువులను సంపాదించుకొని శాస్త్రోక్తప్రకారముగా స్నానముచేయవలయును, పిమ్మట కాలుసేతులను గడిగికొని యాచమించి యూర్ధ్వపుండ్రములను ధరించి దర్భపవిత్రమునుగాని బంగారుపవిత్రమునుగాని చేతఁబెట్టుకొని నిర్మలాన్తఃకరణముగలవాఁడై దేవపూజను జేయ నారంభింపవలయును,

వ్యక్తే వేద్యా మాయతనే వా౽ప్స్వగ్నౌ స్వహృదయామ్బుజే ॥
ఏకస్మిన్నేవ దేవేశం యథాయోగం సమర్చయేత్ ।

తా॥ స్వయంవ్యక్తము ముఖ్యమైనది ఆర్చావతారము ఆకాశము హృదయపుణ్డరీకము అనునట్టి భగవత్సన్నిధిస్థానములలో నేదియో యొకస్థానమందే జీవుఁడెవ్వఁడైన భగవత్సన్నిధియథాసంభవముగా లెస్సగాఁ బూజింపవలయును

వ్యక్తిమాయతనం వాపి ప్రథమం యత్సమాశ్రితమ్ ॥ ౪॥
ఆదేహపాతాత్తత్సేవ్యం నాన్యద్బిమ్బం సమాశ్రయేత్ ।

తా॥ వ్యక్తమో ఆయతనమో బిమ్బములో నేబిమ్బము మొదట నాశ్రయింపఁబడినా గునో యాబిమ్బమును సేవించినవాఁడు మరణపర్యన్త మాశ్రయింపవలయును. ఇతరబిమ్బ మునాశ్రయింపఁగూడదు.

ఉపచారేషు భక్తస్య న్యూనత్వమతి నిశ్చితే ॥ ౫॥
వ్యక్తాయతనయోః పూజాం కుర్యాద్భక్తివివృద్ధయే ।

తా॥ ఉపచారములను జేయునప్పుడు భక్తిగలవాఁడై ఈబిమ్బరూపుఁడా దేవేశుఁడని నిశ్చయించి వ్యక్తాయతనములను బూజింపవలయును. అట్లు చేసిన భక్తివర్ధిల్లును

వేదిభూమ్యాదిభూతేషు హృద్యర్కే యోఽర్చయేద్ధరిమ్ ॥ ౬॥
వ్యక్తాయతనసంస్థానే నార్హస్స త్వర్చనావిధౌ ।

తా॥ వేదియందును పఞ్చభూతములయందును హృదయమందును సూర్యుని యందును శ్రీహరి నెవఁడు పూజించునో వాఁడు వ్యక్తమందును ఆయతనమందును శ్రీహరిని బూజింపఁదగఁడు.

కర్మిణస్సర్వథా నిత్యమస్వాధీనప్రవృత్తయః ॥ ౭॥
ఇత్యనుగ్రహయోగేన వేదిర్వైకప్రచోదితా

తా॥ కర్మములను జేసెడివారు అన్నిప్రకారములచేతను ప్రతిదినము భగవద్భక్తి లేక కర్మపరవశులై యుందురేని శ్రీహరియందు భక్తిగలుగుటకై వేదియందు భగవన్తు నారాధింపవలయునని యనుగ్రహయోగముచే వేది వేదమునందుఁ జెప్పఁబడెను. వేది యనఁగా దక్షిణాగ్నిగార్హపత్యాహవనీయములు ఉండెడి యగ్నిత్రయమున్నచోటు.

లబ్ధం గురోః ప్రసాదేన క్రమాగతమథాపి వా ॥ ౮॥
ఉద్ధృతం యాచితం వా స్యాద్బిమ్బం గేహే మహాత్మనః
భక్తానాం సర్వవిషయవ్యావృత్తమనసామపి ॥ ౯॥

తా॥ సకలవిషయములనుండి మనస్సును మరలించి యామనస్సును దృఢముగా భగవంతునియందు నిలిపి భక్తితో భగవంతుని బూజింపయత్నించువారికి సాలగ్రామాది బింబము వారియొక్కగదా యదియెట్లు సంపాదించుకొనవలయుననఁగా గురువనుగ్రహించి యిచ్చిన బిమ్బమైనను కులక్రమముగా వచ్చినబిమ్బమైనను బూజించుట యుత్తమమైనది శిష్టులవద్ద యాచించి సంపాదించిన బిమ్బమైనను యింక వేరువిధముగా సంపాదించినది యైనను గౌణమైనది.

సర్వేషామాదిమూర్తిస్తు మఙ్గలం వేదవాదినామ్।
కుటుమ్బి వర్జయే ద్బిమ్బం దార్వం శైలంచ మృన్మయమ్॥౧౦॥

తా॥ వేదాధికారముగల త్రైవర్ణికుల కందఱికిని స్వయముగాఁగలిగిన సాలగ్రామమూర్తిని బూజింపఁదగినది దానిచే మేలుఁగలుగును. కుటుమ్బవన్తుఁడు మానుతోఁగాని శిలతోఁగాని మృత్తుతోఁగాఁజేసిన బిమ్బమును బూజింపఁగూడదు. అది దేవాలయములయందుఁ దగినది.

గృహేషు భిత్తిసంస్థంచ యోగనిద్రారసోత్సుకమ్।
కుటుమ్బాశ్రమనిష్ఠస్య నిత్యం స్వాధీనకర్మణః॥ ౧౧.
అచ్ఛిద్రకారిణ శ్శస్తం వ్యక్తబిమ్బస్య పూజనమ్॥

తా॥ స్వాధీనప్రవృత్తిగల గృహస్థు గృహముల గోడయందు వ్రాసినచిత్రబిమ్బములను వర్జించినమూర్తిని అకృత్రిమములైనసాలగ్రామములను బూజింపవలయును.

ధర్మే శ్రద్ధావతాం నిత్యం యాత్రార్థం వ్యాపృతాత్మనామ్॥౧౨॥
కుటుమ్బినాం తథాన్యేషాం వేద్యామారాధనం పరమ్।

తా॥ ధర్మకార్యములను జేయుటయందు శ్రద్ధగలవారును దివ్యదేశములకుఁబోవుటకుఁ బ్రతిదినము యత్నించువారునైన కుటుమ్బులకును ఇతరులకును వేదియందుభగవన్తు నారాధించుట యుత్తమమగును

అశాస్త్రజ్ఞస్య భక్తస్య సమృద్ధస్య కుటుమ్బినః॥ ౧౩॥
యుక్తం వైషయికస్యాపి ప్రాదుర్భావేషు పూజనమ్।

తా॥ శాస్త్రజ్ఞానములేని భగవద్భక్తులును ధనాదిసమృద్ధిగలవాఁడై విషయసుఖములననుభవించునట్టి కుటుమ్బికిని భగవదవతారబిమ్బములను బూజించుట యుక్తమగును.

చరతశ్చ కిర్మిణో యత్ర వేదిః కష్టం నశోభతే॥          ౧౪॥
అమ్బుప్రాయా స్తథా భోగా స్తత్రేష్టం వారిమ్న పూజనమ్ ।

తా॥ దివ్యదేశము మొదలైనవానియందు సంచరించునప్పుడు కేవలము మొదలైనవి సంభవింపకపోవుటచే అప్పుడు సర్వభోగములకు బదులుగా జలమును సమర్పించి హృదయమునందు భగవత్తు నారాధింప వలయును

వివేకసిద్ధా యే సన్తస్సర్వయోగా గుణాతిగాః॥          ౧౫॥
కేవలం జ్ఞానసంతృప్తా స్తే యజేయుః పరం హృది ।

తా॥ జ్ఞానముచే ప్రసిద్ధులై మాయకులోబడక హేయగుణములను కడచి శ్రేష్ఠమైన మోక్షమార్గోపాయము గలసత్పురుషులెవరో వారు జ్ఞానముచే తృప్తులగుచు హృదయమందు భగవత్తు నారాధింప వలయును. అదివారికియుక్తము.

అన్యేఽపి సర్వభోగానా మభావో యత్రజాయతే॥          ౧౬॥
యజేయు ర్మానసాం స్త్వత్ర భోగై ర్మానసకల్పితైః ।

తా॥ భగవంతునకు సమర్పింపదగిన సర్వభోగములు సంభవింపనియెడల నితరులును మనస్సునందు సర్వభోగములను గల్పించి వానిచేత హృత్పుణ్డరీకమందు భగవత్తు నారాధింప వలయును.

సిద్ధా యేతు మహాత్మానో వివేకజ్ఞానయోగినః॥          ౧౭॥
వర్జయిత్వా తు తా నన్యే యజేయు ర్ద్రవ్యసంపదా।

తా॥ దేహాత్మాదివిభాగజ్ఞానమును - జ్ఞానరూపమైన మోక్షమార్గోపాయమును గలవారును తపస్సిద్ధిగలవారునైన మహాత్ములెవరో వారితప్ప తక్కినవారు ద్రవ్యసంపదచేత భగవత్తునారాధింప వలయును.

సర్వభూతేషు దేవేషు నరప్రతికృతౌ తథా॥          ౧౮॥
మనుష్యాకృతిదేవేషు న కార్యం పూజనం బుధైః ।

తా॥ సకలభూతములను దేవతాన్తరములను మనుష్యబింబములను మనుష్యాకృతి గల దేవవిగ్రహములను తెలిసినవారు పూజింపగూడదు.

ధన్వన్తరిముఖాః కేచి దమరప్రఖ్యకీర్తయః॥          ౧౯॥
మనుష్యాకృతయో దేవా నోపాస్యా స్తేకదాచన ।

తా॥ ధన్వంతరి మొదలైన కొందఱు దేవతలవలెఁ బ్రసిద్ధమైన సామర్థ్యము గలవారు అయినను వారు మనుష్యాకారముగలవారు గావున నట్టిదేవతల నెప్పుడు నుపాసింపఁగూడదు.

ప్రాదుర్భావాదిభిర్దేవం మత్స్యకూర్మాదిభిర్వినా ॥ ౨౧ ॥
అశుద్ధేష్వర్చయ న్మూఢో నాప్నోతి పరమం పదమ్ ।

తా॥ మత్స్యకూర్మాద్యవతారములు తప్ప తక్కిన యపరిశుద్ధస్థలములయందుండు దేవతి నారాధించునట్టిమూఢుఁడు పరమపదమును బొందఁడు.

తిర్యక్త్వం మానుషత్వం వా మత్స్యాద్యం స్వేచ్ఛయా హరిః ॥
య ఆస్థిత స్స ఏవాసౌ దీపాద్దీప ఇవోదితః ।
వ్యక్తాయతనయోర్నిత్య మర్చయే త్పురుషోత్తమమ్ ॥ ౨౨

తా॥ శ్రీహరి లోకానుగ్రహార్థము మత్స్యకూర్మాద్యవతారములను దిర్యగ్రూపముగాను మనుష్యరూపముగాను దనయిచ్ఛచేఁ దాల్చెను. ఆయవతారము దీపమువలనఁగలిగిన దీపమువంటిది కావున నా శ్రీహరియే యీమత్స్యాద్యవతారముల నెత్తినవాఁడు గనుక నట్టిపురుషోత్తముని వ్యక్తాయతనములయందు నిత్యము పూజింప వలయును.

సావధా నోభవే ద్భక్త్యా భృత్యో నృప ఇవాన్తికే ।
అన్యత్రాప్యర్చయ న్మన్త్రీ పూజాకాలే జనార్దనమ్ ॥ ౨౩ ॥

తా॥ సేవాకాలమందు భృత్యుఁడు రాజుదగ్గఱను ఇతరస్థలమందును భయభక్తులతో నెచ్చరికగలవాఁడై యెట్లు సేవించునో అట్లు భగవద్భక్తుఁడు భగవత్పూజాకాలమందు నితరకాలమందును మనస్సునందు భగవన్మంత్రమును జపించుచు భయభక్తులతో నెచ్చరికగలవాఁడై యుండవలయును.

తత్రస్థం భావయే ద్దేవం సర్వైశ్వర్యసమన్వితమ్ ।
పరీక్ష్య భోగా నాదాయ నీత్వాప్యమృతరూపతామ్ ॥ ౨౪ ॥

తా॥ భగవదుపచారరూప భోగములకు సంపాదించిన ద్రవ్యములు పరిశుద్ధములా? అపరిశుద్ధములా? ఉచితములా? అనుచితములా? యని చక్కఁగా వానిని బరిశీలించి వాని నమృతతుల్యములుగా భావించి భగవంతునకు సమర్పించి సకలైశ్వర్యములతోఁ గూడిన భగవంతుని దాను బూజించుచోట సన్నిధానిగా భావింప వలయును.

ప్రహ్వాఞ్జలిస్తతో దోర్భ్యాం స్తదీయై స్తస్య యోఽర్చయేత్ ।
తత్రాఽభిగమనే పూర్వం దివ్యమన్త్రార్థదర్శనాత్ ॥ ౨౫॥

తా॥ ముందుగా నాయభిగమనమన్త్రముందు దివ్యమైన యర్థమును తెలిసికొని దానివలన నమ్రుఁడై భయముగలవాఁడై ఆభగవంతునియందే చెల్లిన మనస్సుగలవాఁడై సకలోపచారములచేతను ఆభగవంతుని బూజింపవలయును.

సాక్షాదభిముఖం దేవం భావయిత్వాఽర్చయే ద్వశీ ।
భగవద్వదనామ్భోజ స్యన్దమానామృతోదధిమ్ ॥ ౨౬॥
పిబన్నివ మహాహ్లాదమధ్యస్థః పూజయే త్ప్రభుమ్ ।

తా॥ భగవంతుని బూజించునపుడు జితేన్ద్రియుఁడై తనకు భగవంతుఁడు ప్రత్యక్షమైనట్లు భావించి పూజింపవలయును. మఱియును ఆభగవంతుని యొక్క ముఖారవిన్దమునుండి ప్రవహించుచున్న యమృతసముద్రమును దాను త్రాగుచున్నట్లును భావించి పరమానన్దభరితుఁడై భగవంతుని బూజింపవలయును.

భక్తసందర్శనప్రీత్యా నానాభూతై రివాయతైః ॥ ౨౭॥
నేత్రపాతై ర్భగవత స్స్వాత్మానం శుచితాం నయేత్ ।

తా॥ భగవంతుఁడు భక్తులను జూడవలయునని సంతోషముతో నానావిధముగా నిడుపాటి కృపాకటాక్షములను దనయందుంచినట్లు భావించి తనమనస్సును బరిశుద్ధమైనదానినిగాఁ జేసికొనవలయును.

నాతిద్రుతం నాతిమన్దం నోచ్చై ర్మన్త్రా నుదీరయేత్ ॥ ౨౮॥

తా॥ తాను జపించునప్పుడు చెప్పునట్టి మన్త్రముల నతిశీఘ్రముగాను జెప్పఁగూడదు. స్పష్టోచ్చారణములేకుండ మిక్కిలి మెల్లగాను జెప్పఁగూడదు. మిక్కిలి గట్టిగా నరవఁగూడదు.

అత్యన్త స్స్వమనాః క్రోధం కామం హిత్వా యజేతచ ।
న శబ్దయే త్పాత్రసఙ్ఘ మమ్బునా నార్ద్రయే న్మహీమ్ ॥ ౨౯॥

తా॥ భగవంతుని బూజించువాఁడు నిర్మలాన్తఃకరణముగలవాఁడై శాన్తుఁడై తాను దేనినిఁగోరక భగవత్ప్రీతికై భగవంతుని సావకాశముగాఁ బూజింపవలయును. అప్పుడప్పుడు పాత్రములను శబ్దింపఁజేయఁగూడదు. భూమిని నీళ్లతోఁ దడుపఁగూడదు, అనఁగా నైవేద్యపాత్రమందు జలము నుంచవలయును గాని నేలమీఁదఁ బడనీయఁగూడదు.

న హుంకుర్వ న్నజల్పంశ్చ శుద్ధమానో భవే ద్వశీ।
సంసూచ్యాఽక్షై రుపాఙ్గై శ్చ బద్ధ్వోష్ఠం నాసికాక్షరైః॥ 30॥
అవ్యక్తై రప్యశుద్ధం య న్మానం తద్వర్జనం శుభమ్।

తా॥ తాను భగవన్తుని బూజించునపు డేదైన నెవరితోనైనఁ జెప్పవలసియున్న పక్షమున హస్తాద్యవయవములతోను వానికవయవములైన వ్రేళ్లతోను ఆయర్థమును సూచించి తెలుపవలయును గాని కొంచెమైనను మాటలాడఁగూడదు అట్లుండిన శుద్ధమానముగలవాఁడగును ఎవరినైనఁ హుంకరించి కోపపడఁగూడదు. ఇన్ద్రియములను లోఁబర్చుకొనవలయును పెదవిని మూసికొని మెల్లగా మాటలాడునప్పుడు చెప్పనట్టి యక్షరములు అనునాసికములుగాను అవ్యక్తములుగానుండును గావున నట్టివాక్యము మానముతో సమానమే యినను బూజాకాలమందునది యశుద్ధముగావునను అట్టి యశుద్ధమానమ నవలమ్బించుట శుభకరముగాదుగనుకను దానిని గూడ విడుచుట యుత్తమము

యథా యువానం రాజానం యథా చ మదహస్తినమ్॥ 31॥
యథా ప్రియాతిథిం యోగ్యం భగవన్తం తథా ర్చయేత్।

తా॥ సేవించునపుడు సమర్థుఁడైనరాజును భృత్యుఁడును, మదించినగజమును మావటివాఁడును యోగ్యుఁడును ఇష్టుడును అయినఅతిథిని గృహస్థుఁడును ఎట్లు భయభక్తులతో సేవించునో అట్లు భగవన్తుని షోడశోపచార పూజచేత సేవింపవలయును

సమ్యక్సాధి తమేవాపి యత్స్యాన్న హృదయఙ్గమమ్॥ 32
వర్జయే ద్దృష్టిదుష్టంచ హస్తా త్స్ఖలిత మేవచ।

తా॥ చక్కగా సాధింపఁబడినను మనస్సునకు రమ్యముగాఁ జూచుటకింపుగా నుండనిదానిని హస్తమునుండి తొలఁగిపోయినదానిని భగవత్కైఙ్కర్యమున కుపయోగపఱుపక విడువవలయును

పురాఽభిగమనం మన్త్రైర్ ప్రణవాద్యై ర్యథావిధి॥ 33॥
అభిగమ్యైవ దేవేశ మాసనాద్యై స్సమర్చయేత్।

తా॥ ముందుగా *నభిగమనమన్త్రమును ఓంకారమాదియందుగల మన్త్రములతో యథావిధిగా జపించి దేవదేవుఁడగు భగవన్తుని అభిముఖునిగాఁ జేసికొనియే ఆసనము మొదలైన యుపచారములచేఁ బూజింపవలయును. *అభిగమనము ప్రసిద్ధమనగా

విష్ణోః క్రమో స్యభిమాతిహా గాయత్రేణ ఛన్దసా పృథివీ మనుక్రమే నిర్భక్తస్స యం ద్విష్మో
విష్ణోః క్రమో స్యభిశస్తిహా త్రైష్టుభేన ఛన్దసా న్తరిక్షమను విక్రమే నిర్భక్తస్స యం ద్విష్మో
విష్ణోః క్రమో స్యరాతీయతో హన్తా జాగతేన ఛన్దసా దివమను విక్రమే నిర్భక్తస్స యం ద్విష్మో
విష్ణోః క్రమో సి శత్రూయతో హన్తానుష్టుభేన ఛన్దసా దిశో నువిక్రమే నిర్భక్తస్స యం ద్విష్మః.

అష్టధా నిహితై ర్మన్త్రై శ్చాతురాత్మ్యప్రదస్థితైః ॥ 3౪॥
భగవత్ప్రాప్తికైశ్శిష్టై రిజ్యామన్త్రై స్సమర్చయేత్ ।

తా॥ ఎనిమిదివిధములుగా నేర్పఱుపఁబడినవియు సారూప్యాదిచిహ్నములచే భగవత్ప్రాప్తిని గలిగించునవియు భగవంతుని పూజయందుపయోగపడునవియుఁగనుక నిర్దిష్టములైన మంత్రములచేత భగవంతుని బూజింపవలయును

స్నానభోగై స్సమభ్యర్చ్య దివ్యాలఙ్కారమణ్డితమ్ ॥ 3౫॥
ఆలఙ్కారాసనం దత్త్వా దివ్యై స్స్రక్చన్దనాదిభిః ।
భోగై స్సుసంస్కృతై ర్దేవ మర్చితం భావయేత్పరమ్ ॥ 3౬॥

తా॥ మొదట స్నానము చేయించి దివ్యాభరణములతో నలంకరించి అలంకారయుక్తమైన యాసనమును సమర్పించి దివ్యములైన పూలదండలు దివ్యచన్దనము మొదలైనవానిని సమర్పించి యింకననేకములైన దివ్యభోగములతో నర్చించి భగవంతుని సర్వోత్కృష్టునిగా భావింపవలయును

సతీవ ప్రియభర్తారం జననీవ స్తనన్ధయమ్ ।
ఆచార్యం శిష్యవ న్మిత్రం మిత్రవ ల్లాలయేద్ధరిమ్ ॥ 3౭॥

తా॥ పతివ్రత ప్రియభర్తనువలెను తల్లి పాలుగుడుచు చిట్టిబిడ్డనువలెను శిష్యుఁడాచార్యునివలెను మిత్రుఁడు తనమిత్రునివలెను శ్రీహరిని లాలింపవలయును

స్వామిత్వేన గురుత్వేన సుహృత్త్వేనచ సర్వదా ।
పితృత్వేన తథా భావ్యో మాతృత్వేనచ మాధవః ॥ 3౮॥

తా॥ శ్రియఃపతి నెల్లప్పుడును ప్రభువునుగాను గురువునుగాను మిత్రునిగాను తండ్రినిగాను తల్లినిగాను భావింపవలయును

సుస్నాతం స్వనులిప్తంచ స్రగ్విణంచ స్వలఙ్కృతమ్ ।
సన్నుతం వివిధై స్స్తోత్రై ర్భోజ్యాసనగతం విభుమ్ ॥ 3౯॥

అవశ్యం మధుపర్కేణ మధ్వాజ్యదధియోగినా ।
అర్చయేదుదకేనాపి క్వథితేన ఫలాదిభిః ॥ ౪౦॥

తా॥ భగవన్తుని బాగుగా స్నానము చేయించి దివ్యపీఠముపై వేంచేపుచేసి దివ్య చన్దనములందిద్ది పూలదండలతో నలఙ్కరించి యనేకవిధదివ్యస్తోత్రపాఠములచే స్తుతించి తేనె నెయ్యి పెరుగు మొదలైన వానితోఁజేర్చి మధుపర్కమును సమర్పించి అర్ఘ్యపాద్యాదులను పక్వపదార్థములను పండ్లు మొదలైనవానిని సమర్పించి యారగింపఁజేసి శ్రద్ధాభక్తులతో శ్రీహరిని బూజింపవలయును

మధ్వాజ్యం దధి సంయోజ్య యజతే యో జనార్దనమ్ ।
అయం సంసృజ్యతే తేన శ్రీమతా మధుపర్కవత్॥ ౪౧॥

తా॥ తేనె నెయ్యి పెరుగు వీనిని జేర్చిసమర్పించి జనార్దనునెవఁడు పూజించుచున్నాఁడో వాఁడా మధుపర్కము చేరినట్లు శ్రీమన్తుఁడైన యాభగవన్తునితోఁజేరుచున్నాఁడు.

మధురాణాం తు సంపర్కో మధుపర్కః ప్రకీర్తితః ।
సంపర్కస్సరసస్తేన మధుపర్కేణ జాయతే॥ ౪౨॥

తా॥ మధుపర్కమను పేరేలవచ్చెననఁగా మధురపదార్థములచేరికవలన మధుపర్కమనఁబడెను ఆమధుపర్కము మంచిరసముగల మిశ్రమమగుచున్నది.

సంపూజ్య మధుపర్కేణ గాం నివేద్య చ దక్షిణామ్ ।
గవార్థం ద్రవ్యమేవాపి తతోఽన్నేన సమర్చయేత్ ॥ ౪౩॥

తా॥ మధుపర్కమును పిమ్మట గోవును తరువాత దక్షిణను ఆవులేనియెడలదానికి బదులుఁగా ద్రవ్యమును అటుపిమ్మట ప్రసాదమును సమర్పించి శ్రీహరిని బూజింపవలయును.

శాకకన్దఫలోపేతైర్గుడదధ్యాజ్యసంయుతైః ।
అన్నైర్నిగ్రప్రభూతైర్దేవేశం వివిధైరపి పృథగర్చయేత్ ॥ ౪౪॥

తా॥ నానావిధములైన కూరలు కందమూలఫలాదులు వీనిని బెల్లము పెరుగు నెయ్యి వీనితోఁజేర్చి వేఱువేఱుగా నవసరనైవేద్యములు సమర్పించి దేవదేవుని బూజింపవలయును. అట్లేపులిహోరదధ్యోదనము పాయసము మొదలైన నానావిధములైనయన్నములను వేఱువేఱుగా నివేదనచేసియు భగవన్తుని బూజింపవలయును.

మధుపర్క స్తథాన్నాద్యం యద్యుక్తం పరమేష్ఠినా।
ప్రాణవ ప్రక్షిణేయం తద్విని యోగావసానకమ్॥　　౪౧॥

తా॥ మధుపర్కము అన్నము మొదలైన యేపదార్థములు భగవంతునకు సమర్పింపబడినవో వానిని వినియోగమగునంతవఱకుఁ బ్రాణముతో సమానముగాఁ గాపాడవలయును.

ప్రాప్తా న్భాగవతాం స్తత్ర గురుపూర్వా న్యథావిధి।
అర్చయే త్పరయా భక్త్యా ద్రవ్యై రర్ఘ్యాదిభి స్తథా॥ ౪౭॥

తా॥ పూజాకాలమందు నచ్చటికివచ్చిన భగవద్భక్తులను గురువు మొదలైనవారిని అర్ఘ్యము మొదలైన ద్రవ్యములను వారికి సమర్పించి యధికభక్తితోఁ బూజింపవలయును

వాసోభి ర్భూషణై ర్భక్ష్యై ర్ధనధాన్యాదిభి స్తథా।
శ్రద్ధయా దేవ మభ్యర్చ్య దద్యా త్తా న్దేవస న్నిధౌ॥　　౪౭॥

తా॥ వస్త్రములు భూషణములు భక్ష్యములు ధనధాన్యములు మొదలైనవానిచేఁ శ్రద్ధగా మొదటభగవంతుని బూజించి భాగవతులకు దానిని భగవత్సన్నిధియందుఁ వినియోగముఁ జేయవలయును

ఇజ్యామధ్యే తథా యాగే హోమే వ జపకర్మణి।
ఆగతం పఞ్చకాలజ్ఞం సంపూజ్యైవాచ రేత్పరమ్॥　　౪౯॥

తా॥ మఱియును యజ్ఞమధ్యకాలమందుఁగాని భగవంతునిధ్యానించు నపుడుగాని అగ్నిని వేల్చునపుడుగాని మన్త్రములను జపించునప్పుడుగాని వేదోక్తకర్మములను గాలమతిక్రమించక యథావిధిగా నను ష్ఠించునట్టి భాగవతుఁడు వచ్చిన యెడల ముందుగా వారిని బూజించిమే మఱియొకపని నాచరింపవలయును.

సువర్ణం గాం గుణవతీం భూమిం వృత్తికరీ మపి।
దద్యా ద్భాగవతాగ్ర్యేభ్యో భోగమోక్షాప్తయే సుధీః॥౫౦॥

తా॥ తెలిసినవాఁడు తనకు మోక్షసుఖము వలసినపక్షమున బంగారమును ప్రశస్తమైన యావును జీవించుటకుఁ దగినంతధాన్యము పండెడిభూమిని బరమభాగవతులకియ్యవలయును

తా॥ రత్నసమూహమునైనను జలమైనను అధికమునైనను అల్పమునైనను భగవదనుగ్రహమును సంపాదించుకొనుటకై శ్రద్ధాస్తిక్యకరణముగల కర్మయోగికి నియ్యవలయును.

యే తోషయన్తి నిరతం పఞ్చకాలపరాయణాః ।
సకామాస్తత్ఫలం యాన్తి నిష్కామాః పరమం పదమ్ ॥ ౫౬ ॥

తా॥ అయిదు కాలములయందును కర్మములచే ఒక్కొక్కటిఁ జేసినవారెవరు ప్రతిదినము సంతోషపెట్టుచున్నారో వారిలో నీలోకమందు ఫలసక్తులైనను కోరినవాఁడు ఆఫలమునొందుచున్నాఁడు. అట్లు తానేఫలమునుగోరక భగవన్ముఖోల్లాసమునే కోరినవాఁడు పరమపదమునొందుచున్నాఁడు.

స్వగేహాగతకే ప్రాప్తే తదిష్టమాహరేచ్చ వై ।
జ్ఞాత్వా తత్ప్రియం కార్యం యథార్హం శ్రమనుత్తరే ॥ ౫౭ ॥

తా॥ భగవద్భక్తుఁడు తనయింటికివచ్చినయెడల నెదుర్కొని గౌరవించి ఆయన యిష్టము దెలిసికొని ఆయనశ్రమనివారించుటకై తనశక్త్యనుసారముగా నతనియొక్క ప్రియమును శీఘ్రముగాఁ జేయవలయును.

ఆసనైరర్ఘ్యపాద్యాద్యైర్వ్యజనైరుచితోక్తిభిః ।
పాదసంవాహనాభ్యఙ్గైరతిథిం పూజయేత్ప్రియమ్ ॥ ౫౮ ॥

తా॥ అతిథి తనయింటికివచ్చినయెడల ఆసనము అర్ఘ్యము పాద్యము మొదలైనవాని నొసఁగి విసనకఱ్ఱలతోఁ జెమటపోవునట్లు విసరి మనస్సు సంతోషించునట్లు తగిన మాటలాడి కాళ్లు పిసికి అభ్యఙ్గనస్నానము చేయించి భుజింపఁజేసి అనుష్టుఁడైనయతిథిని బూజింపవలయును.

ప్రహృష్టవదనో భూత్వా పాద్యం ప్రియమథాసనమ్ ।
ప్రదేయమాజ్ఞయా నిత్యం సంప్రాప్తే భగవత్పరే ॥ ౫౯ ॥

తా॥ భగవద్భక్తుఁడు తనయింటికి వచ్చినప్పుడు మిక్కిలి సంతోషించి శీఘ్రముగాఁ గాళ్లు కడిగికొనుటకు నీళ్లను కూర్చుండుటకుఁ పీటను ఇచ్చి గౌరవింపవలయును.

పూజ్యా నిత్యం భగవతి సన్నిధానే విశేషతః ।
అనన్యాః పఞ్చకాలజ్ఞా నకవాదిత్రఘోతరే ॥ ౬౦ ॥

తా॥ అన్యవస్తువులయందు మనస్సును బోనీయక భగవత్సన్నిధియందే మనస్సును నిలిపి యైదు కాలములయందును వేదోక్తకర్మములను భగవత్ప్రీతిగా నయష్ఠించు వారిని భగవత్సన్నిధియందు నిత్యము విశేషముగాఁ బూజింపవలయునుగాని యితరుల నట్లెన్నడును బూజింపఁ గూడదు.

అన్నమమ్బూని వస్త్రాణి పాత్రాణి స్రక్ఫలాదికమ్ ।
ఇష్టమిష్టావశిష్టంవా ప్రదద్యాత్స్వాశ్చకాలినే ॥ ౬౧॥

తా॥ మఱియు నన్నోదకములను వస్త్రములను చెంబులు మొదలైన పాత్రములను బూలదండలను పండ్లు మొదలైనవానిని సమర్పించి యాకిదియిష్టమా? యింకనేదైన నిష్టమైనది మిగిలినదా? యని వినయముతో నడిగి యోగ్యులకియ్యవలయును.

సర్వపాప ప్రశమనం సర్వదుఃఖనివారణమ్ ।
భగవద్భుక్తమన్నాద్య మయోగ్యేభ్యో నయోజయేత్ ॥ ౬౨॥

తా॥ పెరుమాళ్లు కారగింపఁజేసినయన్నము మొదలైనపదార్థములు ఎల్లపాపములను అన్నిదుఃఖములను బోఁగొట్టునట్టివి. అట్టిపదార్థములను అయోగ్యుల కుపయోగింపఁగూడదు.

అయోగ్యే యోజనాదేవ యోగ్యేచాప్య నియోజనాత్ ।
భగవద్భుక్తియుక్తోఽపి ప్రాయశ్చిత్తీ భవేన్నరః ॥ ౬౩॥

తా॥ అట్టి భగవన్నివేదితపదార్థముల నయోగ్యులకు వినియోగించుటచేతను యోగ్యులకు వినియోగము చేయకుండుటచేతను తాను భగవద్భక్తుఁడైనను ప్రాయశ్చిత్తమునకుఁ దగినవాఁడగును.

భగవద్భుక్తమన్నాద్య మజ్ఞానాద్యోఽవమన్యతే ।
ఇహ నిష్కృతికతాం ప్రాప్య జాయతే స పురీషభుక్ ॥ ౬౪॥

తా॥ భగవన్నివేదితపదార్థములను దెలియక నెవఁడు నిన్దించునో వాఁడీజన్మమునందు దరిద్రుఁడై మఱియొక జన్మమందు మలమును భుజించు జంతువై పుట్టును.

పవిత్రం భగవద్భుక్తం యే సదాప్యుపయుఞ్జతే ।
భవన్త్యరోగా స్సుఖినః పాపదుఃఖవివర్జితాః ॥ ౬౫॥

తా॥ మిక్కిలి పరిశుద్ధమైనభగవన్తుఁడారగించినపదార్థమును ప్రతిదినము భుజించువారు రోగము పాపము దుఃఖము ఇవిలేనివారై సుఖము ననుభవింతురు.

ఆరాధ్యైవ జగన్నాథం తచ్ఛేషాన పరానపి।
త్యక్తభక్తార్చనం వ్యర్థ మసారం చోషరామ్బువత్ ॥ ౬౬॥

తా॥ జగన్నాథుని తచ్ఛేషభూతులైన యితరులను బూజించినను భగవద్భక్తులనుబూజింపనియెడల నట్టియారాధనము చవిటినేలలోని జలమువలె వ్యర్థమై సారములేనిదగును

అభావే కాయత స్తేషాం మనసాచార్య మర్చయేత్।
తత్తన్మన్త్రై స్తథా ద్రవ్యై స్తృణం కృత్వా మహీతలే॥ ౬౭॥

తా॥ ఆభాగవతులు ప్రత్యక్షముగా లేనియెడల భూమియందొక తృణమునుంచి దాని నాచార్యునిగా భావించి వారిని మనస్సుచేతను ఆయామంత్రములచేతను ద్రవ్యములచేతను బూజింపవలయును.

ఆచార్యస్య పితుశ్చైవ స్వామినో ద్రవ్య మర్హతి।
శిష్యః పుత్ర స్తథా దాస ఇతి తద్భోక్తుమర్హతి ॥ ౬౮॥

తా॥ ఆచార్యుఁడు తండ్రి స్వామి వీరిసొత్తును దీసికొనుటకును అనుభవించుటకును శిష్యుఁడు పుత్రుఁడు దాసుఁడు వీరు తగుదురు.

బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం స్త్రియమథేతరమ్।
పూజయేత్తా న్యథాయోగ్యం భగవద్యోగభావితాన్॥ ౬౯॥

తా॥ భగవంతుని భక్తియోగముతో భావించునట్టివాఁడు బ్రాహ్మణాది వర్ణములలోనెవ్వఁడైననుసరి వారివారియోగ్యతకుఁ దగినట్లు పూజింపవలయును. తుదకు సంకరజాతిగలవానినైనను స్త్రీనైనను భగవద్భక్తియోగము గలిగియున్నపక్షమునఁ బూజింపవలయును

దివ్యశాస్త్రానభిజ్ఞోఽపి భక్తిమాన్ పురుషోత్తమే।
అభ్యసూయావిరహిత శ్శాస్త్రే పూజ్య స్ససాత్త్వికైః॥ ౭౦॥

తా॥ మంచి శాస్త్రజ్ఞానములేనివాఁడైనను బురుషోత్తమునియందు భక్తిగలవాఁడై శాస్త్రమును బ్రమాణముగానమ్మినవానిని సత్త్వగుణముగలవారు పూజింపవలయును

అకృత్రిమా భగవతి ప్రీతి ర్యస్యతు విద్యతే।
భక్తేషు చార్చ్య సవాయం బాహ్యలిఙ్గధరోఽపివా ॥ ౭౧॥

తా॥ భగవత్తనియందు సహజమైన ప్రీతిగలవాఁడైనను అట్టిభక్తికి సూచకము లైన ద్వాదశోర్ధ్వపుండ్రాదిచిహ్నములను ధరించినవాఁడైనను భక్తశ్రేష్ఠుఁడుగ బూజింపఁదగినవాఁడే యగు

వైష్ణవోహం ప్రదేహీతి యాచితో యేన కేనచిత్ ।
నావమన్యేత తం విద్వాం స్తర్పయే దన్యథా పశుః ॥ ౭౨॥

తా॥ నేను వైష్ణవుఁడను నాకిచ్చునది యిమ్మని యెవ్వఁడైనను దన్ను యాచించినయెడల దానినిచ్చి తెలిసినవాఁడు సత్కరింపవలయును గాని అవమానింపఁగూడదు అట్లవమానించినవాఁడు పశువుతో సమానుఁడు,

అవిజ్ఞాతా అనర్హాశ్చ సంన్యాసినే గృహమేధినః ।
నైవానివేదితైః ప్రీత్యై స్తర్పయే త్తగసన్నిధౌ ॥ ౭౩॥

తా॥ తానెఱుఁగని గృహస్థులకును పూజకు యోగ్యులైన గృహస్థులకును భగవన్నివేదితములుకాని పదార్థములను భగవత్సన్నిధిగానిచోట నిచ్చి తృప్తిని జేయవలయును.

హుతం భగవతా యచ్చ గురుశేష మథాపివా ।
హుతశేషం తథోచ్ఛిష్టం భక్తిహీనే నయోజయేత్ ॥ ౭౪॥

తా॥ భగవత్తుఁడారగింపఁగా మిగిలినదానిని గురువుభుజింపఁగా మిగిలినదానిని అగ్నిహోత్రమందు వ్రేల్చఁగా మిగిలినదానిని భగవద్భక్తిలేనివారి కియ్యఁగూడదు.

అవశ్యం భోజనీయానా మభాగవతవేదినామ్ ।
లౌకికాగ్నౌతు పక్వేన కార్య మన్నేన తర్పణమ్॥ ౭౫॥

తా॥ అవశ్యము భుజింపఁజేయఁదగినవారు భాగవతులెట్టివారో వారిస్వరూపమే యెఱుఁగనివారైనయెడల వారికి లౌకికాగ్నియందుఁ బక్వమైనయన్నము నొసఁగి తృప్తిచేయవలయునుగాని వైదికాగ్నిపక్వాన్నముచేఁ దృప్తిచేయఁగూడదు.

ప్రాపణం సాధితం నిత్య మశక్త స్సంస్కృతాగ్నినా ।
యోగ్యగేహగతే నాపి సాధయే జ్జుహుయా దిహ ॥ ౭౬॥

తా॥ తానుసంస్కరింపఁబడినయగ్నియందు వండినదానిని వ్రేల్చి వైశ్వదేవాది నిత్యకర్మను జేయుటకు శక్తుఁడైనయెడల యోగ్యునింటికిఁబోయియైన నట్టికర్మనును జేయఁదగును.

ప్రాపణం భగవద్భుక్తం లబ్ధ్వా భాగవతేన తత్ ।
పునరిష్టైవ భోక్తవ్యం దానం తస్య నచేష్యతే ॥ ౭౭॥

తా॥ భగవన్నివేదితమైన హవిస్సును దాత భాగవతునిచేఁ బొందిమఱలఁ దిరువారాధనముఁ జేసియే భుజింపవలయును. భాగవతునిచేలబ్ధమైనహావిర్దానమట్లు కానియెడల నతని కిష్టపడదు. అనఁగా నాహావిస్సును భగవన్నివేదనచేయక తాను భుజింపఁగూడదు.

అనర్పితంభగవతే స్వారాధ్యాయ స్వమన్త్రితః ।
యద్భుక్త్వా కురుతే కర్మ తద్ద్రవ్యం యస్య తస్య తత్ ॥ ౭౮॥

తా॥ తన కారాధింపఁదగినభగవన్తునకుఁ దనకైనమన్త్రముచె జెప్పిసమర్పింప వలయును. అట్లు సమర్పింపక యేద్రవ్యము ననుభవించి కర్మమును జేయుచున్నాఁడో యాద్రవ్యమెవనిదో యాకర్మఫలమా ద్రవ్యమిచ్చినవానిదియగును. అనఁగా భగవదారాధనపూర్వకముగా భగవన్నివేదితములైన పదార్థములను భుజించినయెడల భగవదారాధనఫలము తనదగును. లేనియెడల ద్రవ్యమిచ్చిన వానిదగును.

కర్మణా మనసా వాగ్భిర్యథాకాలం యథాబలమ్ ।
స్వారాధ్యాయ నివేద్యైవ సర్వం భుఞ్జీత బుద్ధిమాన్ ॥ ౭౯॥

తా॥ బుద్ధిమన్తుఁడు తానేవస్తువును భుజింపఁదలఁచినను మనోవాక్కాయములచేఁ దన కారాధింపఁ దగినభగవన్తునకు యథాశక్తిగాను గాలానుసారముగాను బూజ చేసి యావస్తువు నారగింపఁ జేసియే భుజింపఁ వలయును.

శుద్ధం న్యాయేన సంప్రాప్తం సాధితం సాధు యత్నతః ।
అభోజ్యమేవ జానీయాన్నిజమన్త్రానివేదితమ్ ॥ ౮౦॥

తా॥ మంచియత్నముచే న్యాయముగా సంపాదించుటచేత దొరకినశుద్ధవస్తువును దనదైనమన్త్రమునననుసంధించి పెరుమాళ్లకు సమర్పింప వలయును. అట్లు సమర్పింపఁబడనియావస్తువును భుజింపఁదగనిదానినిగానే యెఱుంగ వలయును.

మూర్త్యన్తరేణ సంభుక్తమయత్నేన సమాగతమ్ ।
స్వమన్త్రమూర్త్యై సంచిన్త్య మనసా తత్సమర్పయేత్ ॥

తా॥ మఱియొకమన్త్రమూర్తిచే నారగింపఁబడిన వస్తువు తన కప్రయత్నము
గా లభించినపుడు మనస్సుతో స్వమన్త్రమును గలఁచి యావస్తువును మఱల భగవన్తు
నకు సమర్పింపవలయును.

స్వాత ఆత్మని దేవేశశేషభూతే వ్యహంగతే !
తవాస్మీతి పద ఇచ్ఛుద్ధస్తథా స్వేన సమర్పితమ్ ॥ రా ౨॥

తా॥ స్వయముగాఁ దాను భగవన్తునకు శేషభూతుఁడైనప్పటికిని అహంభా
వమునొందినయెడల నపరిశుద్ధుఁడగును నీవాఁడనని చెప్పినపక్షమున మఱలఁ బరిశుద్ధుఁ
డగును. ఆశ్లేయితరమన్త్రముచే సమర్పింపఁబడినవస్తువు స్వమన్త్రముతో సమర్పింపఁ
బడినపక్షమునఁ బరిశుద్ధమైనదగును

ముముక్షుభిర్యథా బాలా భగవత్పాదయోః పరైః ।
నమస్యన్తే తథా శక్తైర్భోజ్యమన్నైర్నివేదితమ్ ॥ రా ౩॥

తా॥ ముముక్షువులగువారిచేఁ బ్రేరితులై బాలురు భగవత్పాదములకు నమస్కా
రము సమర్పించినవిధమున భగవత్పూజాసమర్థులగువారిచేఁ బ్రేరితులయిన యితరులు
భోజ్యవస్తువునువివిధాన్నములతోఁగూడ భగవన్తునకారగింపఁజేయుచునుండవలయును.

తథా స్వారాధనేనైవ నప్రీతో భగవాన్ హరిః ।
యథా భాగవతశ్రేష్ఠపాదామ్బురుహసేవనాత్ ॥ రా ౪॥

తా॥ భగవన్తుఁడగుశ్రీహరి, పరమభాగవతులపాదపద్మములను సేవించుటవలన
నెట్లు ప్రీతి గలవాఁడగునో యట్లుతన్ను మాత్రము సేవించుటచేఁ బ్రీతిగలవాఁడు గాఁ
డు కావునఁ బరమభాగవతులను విశేషముగా సేవింప వలయును

యథా కుటుమ్బీ స్వైః శ్రీమాన్ కుమారై రనుమోదతే ।
మోదతే భగవా న్భక్తై స్తథా నియతమానసైః ॥ రా ౫॥

తా॥ శ్రీమన్తుఁడగుకుటుమ్బి తనపుత్రులచే నెట్లు సంతోషించునో యట్లు భగ
వన్తుఁడు తనయందు లగ్నమైనమనస్సుగలభక్తులచే సంతోషించుచున్నాఁడు. అనఁ
గా భక్తులయం దంతయధిక మైనప్రీతి గలవాఁడనుట.

అనాదృతసుతం గేహీ పురుషం నాభినన్దతి ।
తథానర్పితసద్భక్తం భగవా న్నాభినన్దతి ॥ రా ౬॥

తా॥ ఒకగృహస్థు తనకుమారు ననాదరించినవానిమీఁద నెట్లు ప్రీతిగలవాఁడు కాఁడో యట్లు భగవన్తుండును దనభక్తునిబూజింపని వానిమీఁదఁ బ్రీతిగలవాఁడు కాఁడు.

యస్య యస్యాధికం దృష్ట్వా భక్తిర్జ్ఞానం క్రియా మతిః ।
తంతం సమర్చయేత్పూర్వం యథార్హం క్రమయోగతః ॥

తా॥ భక్తియు జ్ఞానమును కర్మమును వివేకము నెవరెవరి కధికముగా నున్నట్లు కనఁబడునో యెవరుసయందు ముందుండు వారివారిని వారివారియోగ్యతానుసారముగా ముందుగాఁ బూజింప వలయును.

నిర్ధనాం శ్చరతో లోకే వృత్త్యర్థ మిహ సాత్త్వికాన్ ।
నావమన్యేత తైర్లోకం పవిత్రీకురుతే హరిః ॥ ౭౭॥

తా॥ సత్త్వగుణప్రధానులై దరిద్రులై జీవనార్థ మీలోకమందు సంచరించువారిని దరిద్రులని యెప్పటికి నవమానింపఁ గూడదు సత్త్వగుణప్రధాను లగుటచే వారి మూలముగా శ్రీహరి లోకమును బరిశుద్ధముగాఁ జేయుచున్నాఁడు.

యే పావయన్తి ధరణీం చరణైః పాఞ్చకాలికాః ।
దర్శనాత్స్పర్శనాత్తేషాం కృతార్థా స్సర్వదేహినః ॥ ౭౮॥

తా॥ పాఞ్చకాలికు లెవరో వారు భూమిని దమచరణస్పర్శముచేఁ బరిశుద్ధ గలదానినిగాఁ జేయుదురు. అట్టివారిని జూచుటవలనను దాఁకుటవలనను ఎల్లప్రాణులును కృతార్థు లగుదురు

అభ్యర్చ్య శ్రద్ధయా ప్రాప్తా న్సర్వా నభ్యాగతాతిథీన్ ।
పాషణ్డవర్జ మన్నాద్యై రగ్నికార్యం సమాచరేత్ ॥ ౭౯॥

తా॥ తనయింటికి వచ్చిన వేషధారుల్వాఁడు తప్ప తక్కిన యతిథుల నందఱిని యాస్తికుఁడు శ్రద్ధగాఁ బూజించి యన్నదానము మొదలుగాఁగలవానిచేత నగ్నికార్యమును జేయవలయును. అనఁగా వైశ్వదేవాది కర్మములయందన్నాదుల నగ్నియందు హోమముచేయవలయును.

లవణం చోదకం హిత్వా కర్మార్థం యదుపార్జితమ్ ।
తత్సర్వం జుహుయా దగ్నౌ తిలపుష్పౌదనాదికమ్ ॥ ౮౦॥

తా॥ తాను సంపాదించిన తిలపుష్పాన్నాదికము నంతయును వైదికాగ్నియందు వ్రేల్ప వలయును. లవణమును ఉపకమును మాత్రము వ్రేల్పఁగూడదు.

యదన్నం సాధితం సాధు ప్రాపణార్థం ప్రయత్నతః ।
భగవద్భుక్తశేషేణ తేనైవ హవనక్రియా ॥ ౯-౨॥

తా॥ భగవన్నివేదనార్థమే యన్నము బాగుగా సిద్ధము చేయఁబడెనో భగవన్తుఁ నప్పారగింపఁ జేసిన యాయన్నమునే వైదికాగ్నియందు వ్రేల్ప వలయు.

యథా వ్యోమ్ని యథా వేద్యాం యోగే ధ్యానం యథోదితమ్ ।
కుటుమ్బాశ్రమనిష్ఠానాం తద్వదగ్నిషు పూజనమ్ ॥ ౯-3॥

తా॥ గృహస్థాశ్రమమందుండువారికి వ్యోమవేదియోగములందు భగవద్ధ్యానమెట్లు వేదోక్తమైయున్నదో యట్లు దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయములనెడి యగ్నులయందును బూజించుట వేదోక్తమైయున్నది.

పాపక్షయః క్రియాపూర్తి స్సర్వోపద్రవనిగ్రహః ।
బుద్ధిచిత్తప్రసాదశ్చ తస్మాద్ధోమం నలోపయేత్ ॥ ౯-౪.

తా॥ అగ్నియందు వ్రేల్చుటవలనఁ బాపనివృత్తియు, తన కార్యము సఫలమగుటయు, అన్నియాపదలు తొలఁగుటయు, మనశ్శుద్ధియు నగును కావున హోమమును దప్పక చేయవలయును.

విశుద్ధద్రవ్యయోగేన సద్భిః కాలనిషేవిణామ్ ।
శ్రద్ధయా జుహ్వతాం నిత్యం నాసాధ్య మిహ కించన ॥ ౯-౫॥

తా॥ శ్రద్ధతోఁ బరిశుద్ధద్రవ్యముల నగ్నియందు నిత్యము హోమమును జేయుకర్తలకు నసాధ్యమైనదొక్కటైనను లేదు

ఆవాహ్యాగ్నౌ జగన్నాథం మనసా భక్తిశక్తితః ।
జుహుయాత్ కాష్ఠపుష్పాన్నఘృతక్షీరతిలాదికమ్ ॥ ౯-౬॥

తా॥ అగ్నియందు జగన్నాథుని మనస్సుతో నావాహనము చేసి సమిధలను బుష్పములను అన్నమును నేతిని పాలను నువ్వులను నింకనితరములైన హోమద్రవ్యములను శక్తిననుసారముగా వ్రేల్ప వలయును.

శ్రద్ధయా పరయా హుత్వా యథావిధి విధానవిత్।
సంవిభాగం చ భృత్యానాం కుర్యాద్భగవదగ్రతః॥ ౯౮॥

తా॥ హోమము చేయవలసినవిధమును దెలిసినవాని మిక్కిలి యక్కఱతో హోమము చేసి మిగిలినహవిస్సును భగవత్సన్నిధియందు భృత్యులకుఁ బంచిపెట్టవలయును.

భృత్యాశ్చ ద్వివిధా జ్ఞేయాః ప్రేతా జీవాస్తథైవ చ।
ప్రేతాస్మృతాః స్వవంశేషు జీవా జీవన్తి యే గృహే॥ ౯౯॥

తా॥ భృత్యులు, ప్రేతులు జీవులునని రెండువిధములు గలవారు తనవంశమునఁ బుట్టి మృతులైనవారు ప్రేతులనియు, తనయింట జీవించుచున్నవారు జీవులనియుఁ జెప్పఁబడుదురు.

పితృపుత్రకళత్రాద్యా దాసీదాసాస్సమాశ్రితాః।
రక్షణీయా గృహే యేస్య భృత్యా జీవా ఇమే స్మృతాః॥

తా॥ తండ్రి పుత్రుఁడు భార్య మొదలగువారును దాసీదాసజనంబులును తనగృహమందింక నెవ్వరు తన్నాశ్రయించి జీవించుచున్నారో వారును, తనచే రక్షింపఁదగినవారును భృత్యులును జీవులనఁబడుదురు.

యథార్హం చ యథాశక్తి సంవిభజ్యాన్న మప్యథ।
దద్యాత్పితౄనుద్దిశ్య భగవజ్ఞానయోగినే॥ ౧౦౦॥

తా॥ మఱియును దనశక్తికిఁ దగినట్లు తనపితృదేవతల నుద్దేశించి యన్నోదకములను హరివారినామధేయములచేత విభాగించి భగవత్స్వరూపము నెఱింగినవారికిఁ దగునట్లొసంగవలయును.

చత్వారో బహవో ద్వౌ వా సమ్యగ్జ్ఞా న్యేకఏవ వా।
పూజ్యో నిత్యం ప్రయత్నేన పిత్రర్థం భోజ్యసంపదా॥ ౧౦౧॥

తా॥ మఱియును దనపితరుల నుద్దేశించి భోజ్యపదార్థములను నలుగురికైనను అనేకులకైనను ఇద్దరికైనను మంచిజ్ఞానముగలవాని నొక్కనికైన నొసంగి ప్రయత్నముతో వారిని నిత్యము పూజింప వలయును.

స్వల్పైరప్యన్నపానాద్యైః పాదోదకవిమిశ్రితైః।
భుక్తైర్భగవతా సన్తం తోషయేత్పితౄంస్తథా॥ ౧౦౨॥

తా॥ మఱియును శాకోదకమును అన్నపానాదులను స్వల్పములైనను ఒకసజ్జ నునకుఁ బిచ్చిచ్చి ప్రీతి భగవన్నివేదిత ప్రసాదములచే సంతోషపెట్టవలయును

భిక్షాంవా భిక్షవే దద్యా త్పాత్రర్థం శక్తివర్జితః ।
ప్రత్యాచక్షీత నాల్పాన్నం పానీయం లవణం సతీమ్ ॥ ౧౦౩॥

తా॥ యథాశక్తిగా బ్రాహ్మణభోజనమును బిక్షలకుఁ గావించుటకు శక్తిలేనివాఁడు పిక్ష్పవ్పప్రీతి యొకయతికిఁ జాలినంతలవణాదిరసోపేత మైనయన్నమును బానీయమును భిక్షనియ్యవలయు నని తనభార్య కాజ్ఞాపింప వలయును.

పితరం మాతరం పుత్రా త్కళత్రం మిత్ర మేవచ ।
బిభ ర్తిహ యథా గేహీ ప్రేతభూతాం స్తథైవ సః ॥ ౧౦౪॥

తా॥ గృహస్థు, తల్లిదండ్రులను బుత్రులను భార్యను మిత్రుని ఈలోకమందు భరించినట్లు ప్రేతభూతు లైనపితృలను బిండాదిదానముచేత భరింపవలయును

కృశా న్భాగవతా న్ప్రాప్తా న్దరిద్రా నధ్వకర్శితాన్ ।
తైలాన్నవస్త్రపానాద్యైరి పున స్తాన్పూజయే త్సుధీః॥౧౦౫॥

తా॥ ప్రశస్తమైనబుద్ధి గలవాఁడు మార్గాయాసముచేతను దారిద్ర్యముచేతను మిక్కిలి కృశించిన భాగవతులు తనయింటికివచ్చినపుడు వారికి నూనెయన్నము వస్త్రము ఉదకము మొదలైనవాని నిచ్చి భోజనానన్తరము మఱలఁ జన్దనపుష్ప తాంబూలముల నిచ్చి వారిని బూజింపవలయును.

నిన్ద న్తి యే భాగవతా నజ్ఞానా త్పాపచేతసః ।
నదద్యా త్సర్వథా తేభ్యో వాచం వార్యపి వా ముఖమ్॥౧౦౬॥

తా॥ పాపబుద్ధి గలవారు తెలివిలేమిచేత భగవద్భక్తులను దూషించినయెడల, అన్నివిధములచేతను వారికెదురుగాఁ దనముఖము నుంచఁగూడదు. వారితో సంభాషింపఁగూడదు తుదకు జలము నైన నియ్యఁగూడదు.

గృహే భాగవతం ప్రాప్త మజ్ఞానా ద్యోఽవమన్యతే ।
నష్టశ్రీకో భవే త్సద్యః క్షీణాయుఃపుణ్యసంచయః ॥ ౧౦౭॥

తా॥ ఎవఁడు తెలివిలేమిచేతఁ దనయింటికివచ్చిన భగవద్భక్తు నవమానించుచున్నాఁడో వాఁడప్పుడే ధనాదిసంపదను బోఁగొట్టుకొని పుణ్యహీనుఁడై యల్పాయుష్కుండగును.

భోజయేద్భోజనీయాం స్తాన్గురుపూర్వాన్కుటుమ్బికః ।
పితృమాతృక్రమేణైవ దాసాన్తం ప్రీతమానసః ॥ ౧౦౮॥

తా॥ కుటుమ్బవంతుఁడు సంతుష్టుండై భుజింపఁజేయఁదగినవారిని గురువు తల్లిదండ్రులు మొదలుకొని దాసునివఱకు క్రమముగా భుజింపఁజేయవలయును.

కాంస్యం కుమ్భిదళం పాద్మం పాలాశం వటపల్లవమ్ ।
అశ్వత్థపల్లవం చైవ పాత్రం కుర్యాన్న భోజనే ॥ ౧౦౯॥

తా॥ కంచుపాత్రమును గుమ్మడియాకులను తామరాకులను మోదుగాకులను మఱ్ఱియాకులను రావియాకులను భుజించుటకుఁ బాత్రముగాఁ జేసికొనఁగూడదు.

నాతిదోషావహం కాంస్యం భోజనేఽశ్వత్థ ఏవచ ।
కుటుమ్బినా మకామానా మితీచ్ఛన్తీహ కేచన ॥ ౧౧౦॥

తా॥ వైరాగ్యము గలకుటుమ్బవంతులకుఁ గంచుపాత్రము రావియాకులవిస్తరి భోజనపాత్రముగాఁజేసికొన్నపక్షమున మిక్కిలిదోషమును గలుగఁజేయునవికావనికొందఱు తలంచుచున్నారు.

పాత్రం దార్వంచ శైలంచ మృన్మయం పాణిమేవచ ।
ఆయసం వర్జయేద్భోగే భూపృష్ఠం వస్త్రమేవచ ॥ ౧౧౧॥
హైమం రౌప్యంచ తామ్రంచ కదళీనాళికేరకమ్ ।
కారయేద్భోజనే పాత్రమన్యత్కార్మణ్యవృక్షకమ్ ॥ ౧౧౨॥

తా॥ కొయ్యపాత్రమందును ఱాతిపాత్రమందును మంటిపాత్రమందును ఇనుపపాత్రమందును నేలమీఁదను వస్త్రమందును బోజనము చేయఁగూడదు. చేత ముద్దలు చేయించుకొనియు భుజింపఁగూడదు బంగారుపాత్రమందును వెండిపాత్రమందును రాగిపాత్రమందును అరటియాకునందును టెంకాయాకులవిస్తరియందును కర్మణ్యములైన వృక్షముల యాకులవిస్తరియందును భుజింపవచ్చును. కర్మణ్యములనఁగా వైదికకర్మముల కుపయోగించునవి.

కర్మణ్యేష్వపిభిన్నేషు నాశ్నీయాన్నైజనేషుచ ।
నిక్షిపేన్న చ తామ్రేషు దధిక్షీరఘృతాదికమ్ ॥ ౧౧౩॥

తా॥ కర్మణ్యవృక్షముల చినిగిన యాకులపాత్రములయందైనను విఱిగినలోహపాత్రములయందైనను భుజింపఁగూడదు. రాగిపాత్రములయందుఁ బెరుగు పాలు నెయ్యి మొదలైన వస్తువుల నుంచఁగూడదు.

చతురశ్రేషు శుద్ధేషు సద్యఃప్రక్షాళితేషుచ ।
భూమి సంస్పృష్ట పార్శ్వేషు విష్టరేషు సమావిశేత్ ॥౧౧౪॥

తా॥ ఆసనములు చతురశ్రములుగాను అందముగాను అప్పుడు జలముచేఁ గడుఁగఁబడినవిగాను వానియిరుప్రక్కలు భూమినంటునట్టివిగాను ఉండవలయును అట్టియాసనములయందుఁ గూర్చుండవలయును.

పలాశవటతాలానా మశ్వత్థస్యచ కాష్ఠజమ్ ।
చక్రాదిలాఞ్ఛితం భిన్నం వర్జయే దుచ్చ మాసనమ్ ॥ ౧౧౫॥

తా॥ ఆయాసనము మోదుగ మఱ్ఱి తాలము (తాటిచెట్టు) ఈచెట్లకొయ్యలచే నిర్మితమై విరగనిదై నిండయెత్తులేనిదై చక్రాదిచిహ్నములులేనిదై యుండవలయును.

వేత్రచర్మ కృతం చైవ తాలపత్రకృతం కుశమ్ ।
ఆయసం వర్జయే ద్భుక్తా వ్యాగయోగోపయోగిచ॥ ౧౧౬॥

తా॥ వెదురుకొయ్యలతో నిర్మింపఁబడినదానిని కృష్ణాజినమును తాటియాకుల చాపను దర్భాసనమును ఇనుపయాసనమును దేవపూజకును జపాదులకు నుపయోగించు నట్టియాసనమును భోజనకాలమం దుపయోగించుకొనఁగూడదు.

స్పృష్ట్వా భువం పదాగ్రేణ పాత్రం సవ్యేన పాణినా ।
అశ్నీయా న్మౌన మాచ్ఛాద్య పాదౌ వస్త్రాన్తరేణచ॥ ౧౧౭॥

తా॥ భూమిని పాదాగ్రముతోఁ దాఁకి భోజనపాత్రము నెడమచేతితోఁ దాకి పాదములను గనుపడకుండ మఱియొకవస్త్రముతోఁ గప్పుకొని మౌనముగా భుజింప వలయును.

ఆజ్కే నారోపయే త్పాదం పాణినా నాక్రమే ద్భువమ్ ।
అఙ్గం వా నస్పృశే త్పద్భ్యాం పాదం పాదాన్తరేణ వా॥ ౧౧౮॥

తా॥ భోజనకాలమందుఁ బాదమును దొడయందుఁ బెట్టుకొనఁగూడదు; పాదమును భూమియందుఁ బెట్టఁగూడదు; పాదములు శరీరము నకుఁ దగులునట్లును ఒకపాద మొకొక పాదమునకుఁ దగులునట్లును గూర్చుండఁగూడదు.

అపలిప్య శుచౌ దేశే నిశ్ఛిద్రం చతురశ్రకమ్ ।
సవితానే సదీపేచ భోక్తవ్యం భగవన్మయైః ॥ ౧౧౯॥

తా॥ పరిశుద్ధమైనచోట నలుచదరముగా గోమయముతోఁ జక్కగాస్థలశుద్ధిఁజేసి పైనఁ గప్పు గలిగిన చోటియందును పెద్ద ముంగఁగా నోపిద్దికి రతనములలో భుజింపఁవలయునుగాని దీప మారి పోయినపక్షమున భుజింపఁ గూడదు.

వేత్రాసనస్థే పాత్రేచ నాశ్నీయా న్నాసనస్థితే ।
నాఙ్కస్థే పాదసంస్థేచ నాకాశే సాన్ధకారితే ॥ ౧౨౦॥

తా॥ ఏయాసనమందుఁగాని తనతొడయందుఁగాని పేఁజామీఁదఁగాని భోజనపాత్ర ముంచుకొని దానియందు భుజింపఁగూడదు, మఱియు నావరణము లేనిచోటను చీఁకటింటియందును భుజింపఁగూడదు. పేముల కోసల్లకుర్చి మొదలగు నాసనమందుఁ బ్రమాదముచేతనైనను భుజింపఁగూడదు.

నాశ్నీయా చ్ఛయనారూఢో న దీపే నిహతే పునః ।
న దృష్ట్వా కేశకీటాద్యాం నచావైష్ణవదర్శనే ॥ ౧౨౧॥

తా॥ మంచము మొదలైనశయనమం దుండి భుజింపఁగూడదు. దీప మారి పోయినప్పుడును భుజింపఁగూడదు. అన్నమందు వెండ్రుకలు పురుగులులోనగునవి కనఁబడినప్పటికియన్నమును భుజింపఁగూడదు. అవైష్ణవుఁడుతన్ను చూచినను తాను వానిని చూచినను భుజింపఁగూడదు

పానీయం నపిబే ద్యోగీ శఙ్ఖచక్రాదిముద్రితైః ।
శఙ్ఖేన వాఽయసేనాపి పద్మపత్రాదిభి స్తథా ॥ ౧౨౨॥
కుర్వన్తు భోజనం కర్మ సర్వేషు గృహమే ధ్యపి ।
ప్రసాద్య తా ననుజ్ఞాప్య సమశ్నీయా త్ప్రసన్నధీః ॥ ౧౨౩॥

తా॥ ప్రపన్నుఁడు శఙ్ఖచక్రాదిచిహ్నములుగలపాత్రములతోఁగాని శఙ్ఖముతోఁగాని తామరాకులు మొ. వలయువానితోఁగాని ఇనుపపాత్రముతోఁగాని జలము త్రాగఁగూడదు. ఆ భక్తులు తనయింటికివచ్చినప్పుడు గృహస్థుండును నిర్మలాన్తఃకరణము గలవాఁడై వారిని బూజించి వారందఱు భుజించునపుడు తగినయుపచారములచేత వారియనుగ్రహము కలుగఁజేసికొని వారియనుజ్ఞనొంది తాను భుజింపవలయును.

బాలవృద్ధాతురా న్దాసా నాశ్రితా న్మాతరం గురుమ్ ।
పిరతం చాశితా న్జ్ఞాత్వా గృహీ భోజన మాచరేత్ ॥ ౧౨౪॥

తా॥ మఱియును బాలురు వృద్ధులు రోగపీడితులు దాసులు ఆశ్రితులు తల్లి గురువు తండ్రియు భుజించినది తెలిసికొనినతరువాత గృహస్థు భుజింపవలయును.

ప్రక్షాళ్య పాదా వాచమ్య ద్విరార్ద్రముఖపత్కరః ।
ఇజ్యాప్రదేశాభిముఖః సమశ్నీయా త్ప్రసన్నధీః ॥ ౧౨౫॥

తా॥ కాళ్లుఁ గడిగికొని రెండుసార్లుయాచమించి ముఖమును బాదములను జేతులను జలముతోఁ దడిపి దేవపూజాస్థానమున కెదురుగాఁ గూర్చుండి గోవిన్దనామసంకీర్తనముచే నిర్మల మైనయ ప్తఃకరణము గలవాఁడై భుజింపవలయును.

జపభోజనహోమాంస్తు దేవ స్యాభిముఖం చరేత్ ।
భగవత్పాదయో ర్న్యస్య శిర శ్శయన మాచరేత్ ॥౧౨౬॥

తా॥ జపమును భోజనమును హోమమును దేవున కెదురుగా నుండి చేయవలెను భగవన్తునిపాదముల కెదురుగా శిరస్సు నుంచి శయనింపవలయును.

విశుద్ధకోష్ఠో వృద్ధాగ్నిః పాదామ్బుకుసుమాదిభృత్ ।
పవిత్రవేష శ్శుద్ధాత్మా భుఞ్జీ తాన్నం పవిత్రితమ్ ॥ ౧౨౭॥

తా॥ చక్కఁగా జీర్ణమై మంచియాకలియెత్తుచున్న జఠరముగలవాఁడై భగవత్పాదోదకమును బుచ్చుకొని భగవన్తున కర్పించినపూలు తులసి మొదలైనవానిని శిరమున ధరించి పరిశుద్ధ మైనవేషము పరిశుద్ధమైన మనస్సును గలవాఁడై పరిశుద్ధమైనయన్నమును భుజింపవలయును.

కర్మారమ్భం పవిత్రంచ ప్రణవం ద్వాదశాక్షరమ్ ।
జప్త్వా ధ్యానపరోఽశ్నీయా త్తన్మయోఽన్నమనాకులః॥ ౧౨౮॥

తా॥ "అపవిత్రః పవిత్రో" వాయనుపరిశుద్ధ మైనకర్మారమ్భమన్త్రమును 'ఓంనమో భగవతేవాసుదేవాయ' అను ద్వాదశాక్షరమన్త్రమును ఓంకారమునుజపించి స్థిరబుద్ధితో భగవన్తుని ధ్యానించుచుఁ దన్మయుఁడై భుజింపవలయును.

సంవిభాగావశిష్టేన హరిదత్తావశేషితైః ।
హంతకేషేణ సంయుక్తం య దన్న మమృతం తు తత్ ॥౧౨౯॥

తా॥ భాగవతులకుఁ బంచిపెట్టఁగా మిగిలినపదార్థముతోను భగవన్తుఁ డారగింపఁగా మిగిలినపదార్థములతోను అగ్నియందు వ్రేల్పఁగా మిగిలినపదార్థముతోను ఏ యన్నము చేరి యుండునో యాయన్నము అమృత మనుపేరు గలది యగును.

నావశ్యం భోజనే మౌనం కుటుమ్బాశ్రమవాసినామ్ ।
వాచోపచారరీ కర్తవ్యో భుఞ్జతాం సహ భోజనే॥ ౧౩౦॥

తా॥ కుటుమ్బవన్తులైనగృహస్థులు భోజనకాలమందుఁ దమతోఁ గూడ భుజించునట్టివారికిఁ గావలసినపదార్థము లేవో వారినడిగి తెలిసికొని వారి కావలసినపదార్థముల నొసఁగునట్లు చేసి తగినమాటలు చెప్పి తిప్పక యుపచరింప వలయును.

భగవత్పాదతోయేన ప్రోక్షయిత్వాఽమృతౌదనమ్ ।
ధ్యాయ న్నన్నగతం దేవం జపే న్మన్త్రం చతుర్గుణమ్॥ ౧౩౧॥

తా॥ అమృత మనుపేరు గలయాయన్నమును భగవత్పాదోదకముచేతఁ బ్రోక్షించియాయన్న మంద న్తర్యామిగా నున్న భగవన్తుని ధ్యానించుచుఁ దనమన్త్రమును నాలుగుమార్లు జపింపవలయును.

అర్ఘ్యేణ పరిషిచ్యాన్నం కర్మారమ్భేణ మన్త్రవిత్ ।
ఇద మన్నం జపే న్మన్త్రం స్పృష్ట్వా భోజ్య మనాకులః॥౧౩౨॥

తా॥ మన్త్రము నెఱింగినవాఁడు కర్మారమ్భమన్త్రమును జెప్పుచు నన్నమునకుఁ జుట్టు నుదకముతోఁ ద్రిప్పి నేలను తడిపి అనఁగా అన్నమునకుఁ బరిషేచనము చేసి భుజింపఁదగిన యీయన్నమును దాఁకి నిర్మలాన్తఃకరణముగలవాఁడై మన్త్రమును జపింపవలయును.

ధాతారం హృదయాన్తస్థం ధ్యాత్వా పాదామ్బుపూర్వకమ్ ।
తదాస్యే జుహుయా దన్నం తత్తన్మన్త్రై స్సమాహితః॥౧౩౩॥

తా॥ హృదయములోపల నన్తర్యామిగా నున్న భగవన్తుని ధ్యానించి మనోనిగ్రహము గలవాఁడై యామూలమన్త్రముల నుచ్చరించుచు శ్రీపాదతీర్థమును స్వీకరించి పిమ్మట యాయమృతాన్నము నతనినోటియందు వ్రేల్పవలయును.

ధ్యాయ న్నేవ పరం బ్రహ్మ భోక్తారం హృదయే స్థితమ్ ॥
అశ్నీయా దత్వరో మన్త్రీ భోజ్యం సర్వ మకుత్సయ న్॥౧౩౪॥

తా॥ మంత్రజ్ఞుఁడు హృదయమందుండి సర్వభోజ్యవస్తువులను భుజించునట్టిపరమాత్మను ధ్యానించుచునే పదార్థములయందుఁ దప్పలు పెట్టక వానినంతయు సావకాశముగా భుజింపవలయును

విశిష్టం భోజ్య మాయాత మనివేదిత మన్తరా ।
అర్చాపయే దనేనా న్నం సుతశిష్యాదిభిః పరమ్॥ ౧౩౫॥

తా॥ భగవంతుఁ డారగింపనిది తప్ప తక్కినది యనఁగా భగవన్నివేదితాన్నము సంభవించినయెడల, పుత్రుఁడు శిష్యుఁడు, మొదలైనవారిచేత నవశ్యము పూజచేయింపవలయును

క్షుద్రం వస్తు సమాయాతం మనసా తన్నివేద్యచ ।
అశ్నీయా న్మిశ్రితం కృత్వా సాక్షా త్పూర్వం నివేదితైః॥౧౩౬॥

తా॥ ఏదైన నొకయల్పమగు ద్రాక్ష మొదలైనది సంభవించినయెడల దానిని నూఁరక భుజింపఁగూడదు మఱి యెట్లనఁగా దానిం బెరుమాళ్లకు మనస్సుచేత నారగింపఁజేసి మొదట సాక్షాత్తుగా భగవంతుని కారగింపఁజేయఁబడిన పదార్థములతోఁ గూడఁ జేర్చి భుజింపవలయును.

నిష్కల్మషో భవే ద్భక్త ఏవం శుద్ధాన్నభోజనాత్ ।
ప్రసీద న్తీన్ద్రియా ణ్యాశు సత్త్వం చ పరివర్ధతే ॥ ౧౩౭॥

తా॥ ఇట్లు భగవంతునియందు భక్తిగలవాఁడై పరిశుద్ధమైనయన్నమును భుజించుటవలనఁ బాపము లేనివాఁ డగును. జ్ఞానేంద్రియంబులును గర్మేంద్రియంబులును బరిశుద్ధములై యుండును, సత్త్వగుణంబును వర్ధిల్లును.

అన్నశుద్ధ్యైవ సత్త్వస్య వివృద్ధి స్సర్వదేహినామ్ ।
సత్త్వవృద్ధ్యైవ సత్కర్మనిరతో వర్జయ త్యసత్ ॥ ౧౩౮॥

తా॥ పరిశుద్ధాన్నభోజనముచేతనే సర్వప్రాణులకును సత్త్వగుణము వృద్ధినొందును. సత్త్వగుణవృద్ధిచేతనే సత్కర్మంబులను జేయఁ దలంపు గలవాఁ డగును. అట్టి తలంపు గలవాఁ డగుటచేత నసత్కర్మంబులను విడుచును.

ఆరోగ్యం రూపవత్తాచ కీర్తి శ్శ్రీ ర్జ్ఞాన మేవచ ।
శాన్తి స్సత్కర్మణి శ్రద్ధా శుద్ధాన్నేన భవన్తిహి ॥ ౧౩౯

తా॥ రోగములేకుండుటయును రూపవన్తుఁడగుటయును గీర్తియును వైరియును ప్రశస్తజ్ఞానంబును మనోజయంబును సత్కార్యంబులను జేయుటయందు శ్రద్ధయును శుద్ధాన్నభోజనముచేఁ గలుగుచున్నవి. ఇదిలోకప్రసిద్ధము.

కామః క్రోధ స్తథా లోభః పరహింసా రుచి స్తథా ।
నిద్రాలస్యాదయో దోషా అమేధ్యాన్ననిషేవణాత్ ॥ ౧౪౦॥

తా॥ కామక్రోధలోభంబులును బరులను హింసింపఁదలఁచుటయు నిద్రయుఁ సోమరితనము మొదలైనదోషములు నపవిత్రాన్నభోజనమువలనఁ గలుగుచున్నవి కామమనఁగా సుఖానుభవమందలికోరిక. క్రోధమనఁగానట్టికోరికకు విఘ్నముచేయువానివిషయమై కలిగెడి చిత్తవృత్తివిశేషము లోభమనఁగానధికాశ-మోహమనఁగా యుక్తాయుక్తములు తెలియకుండుట.

అశుద్ధాన్నాశనాత్పుంసాం రోగా బాహ్యా న్తరా స్తథా ।
శత్రుపీడా గ్రహద్రోహః స్తామసీ గతి రేవచ ॥ ౧౪౧॥

పరదారపరద్రవ్యసంసర్గా దుష్టభోజనాత్ ।
కార్యబుద్ధ్యైవ కాలేన క్రియ న్తే తే కునీతిభిః ॥ ౧౪౨॥

తా॥ మఱియును బాహ్యరోగములు మనోవ్యాధులు శత్రువులవలనిబాధఁ పిశాచాదిగ్రహములవలనిబాధ నరకప్రాప్తి పరదారాపహారణము పరద్రవ్యముల నపహరించుట మొదలగుతామసగుణములును, అపరిశుద్ధాన్నభోజనమువలనఁ గలుగును. దుష్టాన్నభోజనమువలననేకుబుద్ధిగలవారై జనులు కాలవశముచేత నాచెప్పిదికార్యములను మంచికార్యము లనుబుద్ధిచేతనే చేయుదురు

శనై శ్శనైః క్రియాః సాధ్వీ ర్విగల త్యవశా దిహ ।
అత్యన్తామేధ్యభోజ్యాని వక్తుం మృగయతే నరః ॥ ౧౪౩॥

తా॥ మఱియును అపరిశుద్ధాన్నభోజనమును జేయుమనుష్యుఁడెప్పటికి మిక్కిలియపరిశుద్ధములైనభోజ్యవస్తువులనే భుజింప వెదకును[redacted]క్రమక్రమముగా మంచికార్యములను జేయ వలయు[redacted]పోవును

సత్కర్మణాం ప్రవిలోపాయ హ్యా[redacted]నిషేవణమ్
విషయే ష్వభియుక్తానా మాయుగి ప్రక్షీయతేఽన్తరా॥ ౧౪౪

తా॥ అపరిశుద్ధవస్తువులను సేవించుటవలన సత్కర్మానుష్ఠానము లోపించును. సత్కర్మలోపమువలన దుర్విషయములయందాసక్తి కలుగును. అట్టిదుర్విషయాసక్తులకు నాయుస్సు శీఘ్రముగా నశించును.

పథ్యం మితంచ శుద్ధంచ రస్యం హృదయనన్దనమ్ ।
స్నిగ్ధం దృష్టిప్రియం కోష్ణ మన్నం భోజ్యం మనీషిభిః॥ ౧౪౫॥

తా॥ వైద్యశాస్త్రమార్గమునుండి తొలఁగనిదియు మితికి లేనిదియుఁ బరిశుద్ధంబును రసవన్తంబును మనస్సున కింపుగానుండునట్టిదియుఁ నెయ్యిమొదలగు స్నేహపదార్థములతోఁగూడుకొన్నదియు దనకిష్టమైనదియుఁ గొంచెము వేఁడిగానుండునట్టిదియు నగునన్నమును బుద్ధిమన్తులు భుజింపవలయును. ఇంతప్రశస్తమైనదని యమితముగా భుజింపక మితముగా భుజింపవలయును.

భగవద్యాగయోగ్యం య త్తదే వాశనకర్మణి ।
భోజనార్హ మిదం దేవయాగాజ్ఞ మితి నేష్యతే ॥ ౧౪౬॥

తా॥ ఏపదార్థము భగవత్పూజ కుపయోగింపఁదగినదో యది భగవన్తున కారగింపఁజేసినయెడల నట్టివస్తువే తనకు భుజింపఁదగినదిగాని తనకిష్టమైన నిషిద్ధవస్తువును భగవన్తున కారగింపఁజేసి భగవన్తున కారగింపఁజేయఁబడినదికదా యిది యని దానిని భుజింపఁగూడదు.

నభర్త్సయ న్బాలవృద్ధా న్వివదన్న చభార్యయా ।
అన్యేభ్యో దాపయే ద్ద్రవ్యా ణ్యశ్నీయా త్సహబాన్ధవైః ॥

తా॥ బాలురను వృద్ధులను బెదిరింపఁగూడదు. భార్యతోఁగలహింపఁగూడదు యాచకులకు శక్త్యనుసారముగాఁ గించిత్కారము నొసంగవలయును తన బంధువులతోఁగూడ భుజింపవలయును.

శక్తిహీనో యథాశక్తి దాపయ న్నన్న మమ్బుచ ।
భృత్యవర్గే సమశ్నీయా న్నైవభ్యోఽదత్వా కదాచన ॥౧౪౮॥

తా॥ శక్తి లేనివాఁడయ్యేనేని శక్త్యనుసారముగా భృత్యవర్గమునకు నన్నోదకము లిచ్చుచుండవలయును. ఆభృత్యవర్గమున కియ్యక యెప్పుడును దాను భుజింపగూడదు.

పిబే ద్భోజనపాత్రే న పాణినా పానభోజనే ।
ప్రభూతం నపిబే త్తోయం తద్వినా నాశనం చరేత్ ॥ ౧౪౯॥

తా॥ భోజనకాలమున నీళ్లు త్రాగునపుడు జలము చేత నంచుకొని త్రాగఁగూడదు. పాత్రములోనే త్రాగవలయును. తాను భుజించినయన్నాదికము జీర్ణ మగుటకుఁదగినంత జలమును త్రాగవలయునుగాని యధికముగాఁ ద్రాగఁగూడదు. జలమును ద్రాగకుండ నన్నమును మాత్రము భుజింపఁగూడదు.

పీత్వాఽవశిష్టం చషకే పున స్తన్నపిబే జ్జలమ్ ।
శాకాద్యం నోత్సృజే త్స్థాల్యాం పాణినా వాపి భుఞ్జతామ్॥

తా॥ పానపాత్రమందుఁ ద్రాగఁగా మిగిలినజలమును మఱలఁద్రాగఁగూడదు. తానుచేతితో భుజించునపుడు జలముంచుకొన్న స్థాలియందుఁ గూర మొదలైనవి చెదిరి పడునట్లు భుజింపఁగూడదు.

ఆద్యా చాద్య న్తయో శ్చార్ద్రం మధ్యే స్విన్న మివాదనమ్ ।
అనోన్నపదంశపానీయై స్త్రిభాగ ముదరం భరేత్ ॥ ౧౫౧॥

తా॥ భోజనాదియందును భోజనాన్తమందును దడివస్తువులు భుజింపవలయును. అనఁగా నెయ్యి గలిపినయన్నమును మొదటను పెరుగుతోఁగాని మజ్జిగతోఁగాని కలి పినయన్నమును గుడను భుజింపవలయును. భోజనమధ్యమందుఁ బులుసు చారు మొద లగు ద్రవపదార్థములతోఁజేరినయన్నమును భుజింపవలయును. అన్నము ఊఱఁగాయ జలమున నెడ్డివదార్థములచే నుదరమును మూఁడింతికభాగములు నిండింపవలయును- (ఇవ శబ్దము వాక్యాలఙ్కారము)

యే భుఞ్జతే సమీపస్థా యేభోక్ష్యన్తి తతఃపరమ్ ।
సర్వం తన్మనసా బుద్ధ్వా తదర్హ మశనం చరేత్ ॥ ౧౫౨॥

తా॥ మొదటిబంతిని భుజింపఁదగినయత్యావశ్యకు లెవరు గలరో పిమ్మట భుజిం పఁగలవా రెవరో వెనుకముందుసమస్తమును మనస్సుతోఁ దెలిసికొని దానికిఁదగునట్లు అన్నమును భుజింపవలయును.

భగవద్భుక్తశేషం యద్భుక్తం భాగవతై స్తథా ।
తదేవ భోజ్య ముద్దిష్టం భగవద్యాగసేవిభిః ॥ ౧౫౩॥

తా॥ భగవత్పూజాధురంధరు లగువారు భగవన్తుఁ డారగింపఁగా మిగిలినది యేదో యట్లే భాగవతులు భుజింపఁగా మిగిలినది యేదో యదియే భుజింపఁదగిన దని చెప్పఁబడెను.

వాసోభూషణపుష్పాణి గన్ధం తైలం తథౌషధమ్ ।
సర్వం భగవతే నిత్య ముపయుఞ్జ్యా న్నివేదితమ్ ॥ ౧౫౪॥

తా॥ వస్త్రములు భూషణములు పుష్పములు చన్దనము తైలము ఔషధము మొదలుగాఁగలవానినన్నింటిని నిత్యము భగవన్తున కారగింపఁజేసి మఱి తా నుపయోగించుకొనవలయును.

స్నానాచమనపాదార్థ మర్ఘ్యాద్యర్థ మప్యుయత్ ।
ఉపయుక్తం భగవతా పానీయం తత్ప్రకల్పయేత్ ॥ ౧౫౫॥

తా॥ స్నానము ఆచమనము పాద్యము మొదలైన యుపచారముల నిమిత్తమైన దేజలముకలదో యట్టిదానిని భగవన్తున కుపయోగింపఁబడిన పిదపదానిని బుచ్చుకొనవలయును, అందఱికి నియ్యవలయును

భోజనాద్యన్తయో ర్దివ్యం పాదతోయం సమన్త్రకమ్ ।
పిబే ద్దవశ్యం సద్భక్తో మిశ్రితం చార్ఘ్యాణాదిభిః ॥ ౧౫౬॥

తా॥ స్నానాద్యుపచారములచేఁ జేరిన దివ్యభగవత్పాదోదకమును మంచిభక్తిగలవాఁడై భోజనాదియందును భోజనాన్తమందును దప్పక మన్త్రపూర్వకముగఁబుచ్చుకొనవలయును,

భోజనం భగవత్కర్మ యద్యపి స్యా న్మనీషిభిః ।
న కార్యం భగవద్దేహే విశేషా ద్దేవసన్నిధౌ ॥ ౧౫౭॥

తా॥ విచారింపఁగా భగవత్కైంకర్యమునకు దేహధారణ మావశ్యకము గనుకఁ దాను భుజించుట భగవదుల్లాసకర మైనకర్మమే యగును. అయినను దానిని భగవత్సన్నిధిరమండుఁ జేయఁగూడదు. భగవత్సన్నిధియందుఁ ముఖ్యముగాఁ జేయఁగూడదు.

తన్మయో హ మితి జ్ఞాత్వా పాత్రశయ్యాసనాదికమ్ ।
ఉపయుఞ్జ న్భగవతః పాతిత్యాయ ప్రకల్పతే ॥ ౧౫౮॥

తా॥ నేను భగవత్స్వరూపుఁడనే కదా యని భగవన్తుని పాత్రశయ్యాసనాద్యుపకరణములను దానుపయోగించుకొనినయెడలఁ బాపమున కాశ్రయమైనవాఁ డగును.

తన్మయశ్చాపి పుత్రస్య పితుఃపుత్రో యథాభవేత్।
నిత్యం భిన్నశ్చ సయథా తథా భాగవతోహరేః॥ ౧౫౯॥

తా॥ "ఆత్మావైపుత్రనామాసి" అను శ్రుత్యర్థప్రకారముగాఁ బుత్రుఁడు పితృస్వరూపుఁడేయయినను బుత్రుఁడు తండ్రికంటె నెట్లు నిత్యము భిన్నుఁడో యట్లే భాగవతుండును భగవంతునికంటె భిన్నుఁడని యెఱుఁగునది.

భుక్తోత్సృష్టం యథాస్వార్థం భోజ్యం తస్మైని వేదితమ్।
ఉపయోజ్యం భవేత్సర్వం నసాఙ్కర్యం సమాచరేత్॥ ౧౬౦॥

తా॥ ఇంద్రియానుభవింపఁగా మిగిలిన కొన్నివస్తువులుమాత్రమెట్లు పునరుపయోగించుకొనఁదగినవో యట్లే భగవంతునకు సమర్పింపఁబడిన కొన్నివస్తువులే భాగవతునకును పయోగించుకొనఁదగినవి గనుక సర్వమునుపయోగించుకొని సాఙ్కర్యమును జేయఁగూడదు.

ఫలత్రయమపూపంచ గుడాన్నం పాయసం తథా।
సర్వం భగవతే దత్తం భోజ్యం తన్మన్త్రమూర్తయే॥ ౧౬౧॥

తా॥ మూఁడుఫలములు అప్పము చక్కెరపొంగలి పాయసము ననునట్టిసమస్తంబును దనమన్త్రమునకు దేవతయైనభగవంతునకు సమర్పింపఁబడినయెడల భుజింపఁదగినది యగును.

చన్దనం గన్ధపుష్పంచ ఖడ్గం కర్పూరమేవచ।
నోపయుఞ్జీత రాజార్హ మన్యార్చనసమన్వితమ్॥ ౧౬౨॥

తా॥ రాజునకుఁ దగినచన్దము పువ్వులు సాంబ్రాణి మొదలైనవాసనద్రవ్యములు తాలియేనుఁగుఁగొమ్ము కర్పూరము ననునీవస్తువు లితరదేవతలకుపయోగింపఁబడినయెడలఁ బెరుమాళ్లు కుపయోగింపఁగూడదు

శ్వసూకరహతం యత్స్యా దుచ్ఛిష్టం యచ్చ మానుషమ్।
నాపద్యపి తదశ్నీయా ద్వ్యద్యద్వా నాపి కర్మణే॥ ౧౬౩॥

తా॥ కుక్క పంది తాఁకినవస్తువును గాని మనుష్యునియెంగిలి కలిసినవస్తువును గాని కర్మమందుపయోగింపఁబడనివస్తువులను గాని యాపత్కాలమందుఁగూడ భుజింపఁగూడదు

మాషాదిచూర్ణైర్మృద్భిర్వా ప్రక్షాళ్య కరయో ర్ద్వయమ్
ప్రక్షాల్యాఽఽజానుపాదౌచ దన్తా న్కాష్ఠై ర్విశోధయేత్॥ ౧౬౪॥

తా॥ మినుములు లోనగువానిపిండులచేతనైనను మృత్తులచేతనైనను బాగుగాఁ జేతులను బులిమి కడిగికొని యట్లే మోకాళ్లవఱకుఁ బాదములను గడిగికొని పుల్లలతో దన్తములను శుద్ధిపఱచుకొనవలయును

విశుద్ధవదనో మన్త్రీ స్వాచాన్తో ద్వి రనాకులః।
ప్రవిశ్య భగవద్గేహం నత్వా పుష్పాఞ్జలిం క్షిపేత్॥ ౧౬౫॥

తా॥ పరిశుద్ధమైనముఖము గలవాఁడై రెండుసార్లు ఆచమించి తనమన్త్రమును దలంచుచు స్వస్థచిత్తుఁడై భగవన్మన్దిరమును బ్రవేశించి పెరుమాళ్లను నమస్కరించిపుష్పములను దోసిలితోఁజల్లవలయును.

ఆదాయ తులసీం త్యక్తాం భగవత్పాదమణ్డితామ్।
భక్షయే చ్ఛోధయే ద్దేహం భగవత్పాదవారిణా॥ ౧౬౬॥

తా॥ భగవత్పాదములయం దలఙ్కరింపఁబడినతులసి నిచ్చినయెడల దానిని దీసికొని భక్షింపవలయును. మఱియును భగవత్పాదోదకముచే దేహమును శుద్ధిపఱచుకొనవలయును.

భక్షితం భగవత్పాదసంస్పృష్టం తులసీదలమ్।
ఆరోగ్యం భక్తివృద్ధించ పాపహానిం కరోత్యపి॥ ౧౬౭॥

భగవత్పాదములయందు సమర్పింపఁబడినతులసీదలమును భక్షించినయెడల నారోగ్యంబును భగవత్పాదారవిందములయం దధికభక్తియును బాపనివృత్తియును గలుగును

అష్టాఙ్గయోగప్రీతించ కృత్వా ధ్యానపరో వశీ।
స్వాధ్యాయమపి సంకల్ప్య యథాశక్తి జపే న్మనుమ్॥౧౬౮॥

తా॥ జితేన్ద్రియుండై యమనియమాద్యష్టాఙ్గయోగముల నభ్యసించి భగవన్తని ధ్యానించుటయం దాసక్తి గలవాఁడై వేదాధ్యయనము చేసి యథాశక్తిగాఁ దన కుపదిష్టమైనమన్త్రమును జపింపవలయును

స్తోత్రపాఠైశ్చ సంతోష్య శక్త్యశ్చ గానవిద్యయా।
స్వయం యోగేన దేవేశం తోషయే ద్భక్తివృద్ధయే॥ ౧౬౯॥

తా॥ స్తోత్రపాఠములచేతను సమర్థులైన యెడల గానవిద్యచేతను భగవంతుని సంతోషపఱచి భగవద్భక్తి వృద్ధిఁబొందుటకై తాను భగవత్సుఖోల్లాసకరంబులైనసద్వృత్తికర్మముల నాచరించి భగవంతుని సంతోషపెట్టవలయును.

పఞ్చకాలక్రమపరా గానవిద్యావిశారదాః।
శుద్ధాచారా మహాత్మానః పూజ్యా భాగవతా స్స్వయమ్॥ ౧౭౦॥

తా॥ అయిదుకాలములయందును జేయంచగినకర్మంబులను వరుసగాఁ దప్పక చేయువారును గానవిద్యయందు నేర్పరులును, పరిశుద్ధమైన నడత గలవారును, పూజ్యమైనబుద్ధి గలవారు నైనభగవద్భక్తులను దాను బూజింపవలయును.

సుస్నిగ్ధకణ్ఠా స్తాలజ్ఞా స్స్వరచారాదివేదినః।
మాగధాభినయాగ్ర ప్రీత్యా అనిన్ద్యా భగవానివ॥ ౧౭౧॥

తా॥ మంచిశారీరము తాలలయాదిజ్ఞానసంపత్తియుఁగలిగి షడ్జము మొదలగు స్వరములను రాగసఞ్చారములను బాగుగా నెఱింగినవారును మాగధ మనెడియభినయ మెఱింగినవారు నైనభగవద్భక్త లెవరో వారు నిన్దింపఁదగనివారు గనుక భగవంతునివలె వారిని బ్రీతితో సేవింపవలయును

భక్త్యా పులకితస్వాఙ్గా ఆనన్దాశ్రుపరిప్లుతాః।
గద్గదస్వరయోగశ్చ యథా హి స్యా త్తథా చరేత్॥ ౧౭౨॥

తా॥ తాను భగవంతుని పాడునపుడు తనశరీరమంతు గగ్గురుపాటుగలుగునట్లును ఆనన్దబాష్పముచే శరీరము తడియునట్లును ఆనన్దపారవశ్యముచేతను భక్త్యతిశయము చేతను మాటలాడునపుడు డగ్గుత్తిక కలుగునట్లును భగవంతుని కీర్తనము చేయవలయును

అతివేలా యదిభవే ద్భక్తిస్సంకీర్తనాదిభిః।
తదా నోపరమే త్తస్మా ద్యత్ర య త్కీర్త్యతే ముదా॥ ౧౭౩॥

తా॥ మఱియు నెచ్చట నేభగవన్నామము సంతోషముతోఁ జెప్పఁబడునో యట్టి భగవన్నామసంకీర్తనము మొగలైనవానిని జేయునపుడు భక్తి మేర లేనిది యైనయెడల నప్పు డాచోటును విడువక యీభగవద్భక్తగోష్ఠితోఁగూడ భగవన్నామసంకీర్తనము చేయవలయును గాని యుపేక్షింపఁగూడదు.

తత స్సజడతాం ప్రాప్త స్త్యక్తలజ్జో గతక్లమః।
అనుభూయ హరిం భక్త్యా శనై రుపరమే త్స్వయమ్॥ ౧౭౪॥

తా॥ ఇట్లు భక్త్యుద్రేకతో భగవన్నామసంకీర్తనము చేసినపిమ్మట జడపదార్థము వలె నిశ్చేష్టుండై యితరు లేమనుకొనుదురో యనుసంకోచమును విడిచి శ్రమముచు పోఁగొట్టుకొని భక్తితో హరినామసంకీర్తనము చేయుటచేఁ గలిగెడిసుఖము ననుభవించి మెల్లగాఁ దాను శాన్తుఁడైయుండవలయును

గానవిద్యాసమర్థస్స గ్గానేన పురుషోత్తమమ్।
తోషయే త్తు యథాకాల మనన్య స్సన్నిధౌ హరేః॥ ౧౭౫॥

తా॥ గాన విద్యయందు సమర్థుఁ డగుచు శ్రీహరిసన్నిధియం దితరచిత్త లేని వాఁడై యేయేకాలములయందు గానము చేయవలయునో యాయాకాలములయందు గానవిద్యచేతఁ బురుషోత్తముని సంతోషపఱుపవలయును

అలఙ్కారాసన స్యాన్తే స్వాధ్యాయాద్య న్తయో స్తథా।
మధ్యరాత్రేచ యోగాన్తే గానే నారాధయే ద్ధరిమ్॥ ౧౭౬॥

తా॥ ఎప్పుడెప్పుడు గానముచే భగవన్తు నారాధించి సంతోషపెట్టవలయు ననఁగా భగవన్తు నలఙ్కరించినప్పుడును ఆసనము సమర్పించినతరువాతను స్వామిసన్నిధియందు వేదము స్వస్తి చెప్పుటకు నాదియందు నన్తమందును నడిరేయియందును నిదురలేచినతరువాతను గానముచే సేవించి భగవన్తుని సంతోషపఱుపవలయును.

ఉపరమ్య శనై ర్విద్వాన్ స్తుతిగీతిజపాదికాత్।
తోషయే దచ్యుతం భక్త్యా భక్ష్యాపూపఫలాదిభిః॥ ౧౭౭॥

తా॥ భగవత్కీర్తనములను బాగుగా వెతింకి యనేకవిధములఁ బొగడియుఁ గానముఁ జేసియుఁ గొంతసేపుస్వమన్త్రమును జపించియు నింకభగవన్ముఖోల్లాసకరము లైన కార్యము లేవో వానింజేసియుం గొంతకాల మూరకుండి పిమ్మట భక్తితో నానాభక్ష్యంబులను అప్పములను నానావిధఫలంబులను ఇంకభగవన్తున కారగింపఁజేయందగినవస్తువులను ఆరగింపఁజేసి భగవన్తుని సంతోషపెట్టవలయును.

సమాలిప్య జగన్నాథం కర్పూరాగరుచన్దనైః।
చామరై ర్వ్యజనై ర్వాపి యథాకాలం సమర్చయేత్॥౧౭౮॥

తా॥ మఱియును బచ్చకర్పూరము అగరు వీనితోఁ గలిసినచన్దనములను జగన్నాథునికిఁ సమర్పించి వింజామరలతోను ఆలవట్టములతోను సగినకాలములయందు సేవింపవలయును.

భావయన్తో జగన్నాథం బోధయన్తః పరస్పరమ్।
సుసంభూయ కథాం కుర్యాత్సచ్ఛాస్త్రాణి విలోకయన్॥ ౧౭౯॥

తా॥ భక్తులందఱు కూడి జగన్నాథుని భావించుచు ఒకరికొకరు భగవత్స్వరూపమును బోధించుకొనుచుండవలయును-మఱియు భగవద్గుణములను దెలుపునట్టి శాస్త్రములను జూచుచుఁ దాను భక్తగోష్ఠియందుఁ జేరి శాస్త్రానుసారముగా హరికథను జెప్పుచుఁ గాలమును గడపవలయును.

సత్కర్మ సతతం కుర్యాదసత్కర్మ వివర్జయేత్।
ఏవ మేకాయనం శాస్త్రం సాక్షాద్బ్రహ్మప్రకాశకమ్॥ ౧౮౦॥

తా॥ ఇట్లెప్పుడును మంచికర్మమును జేయవలయును. చెడ్డకర్మంబును విడువవలయును బ్రహ్మము నొక్కనినే తెలుపునట్టిశాస్త్రము నవలంబింపవలయును. అనేకదేవతలను దెలుపునట్టిశాస్త్రము నవలమింపఁగూడదు.

అన్యాని సర్వశాస్త్రాణి వద న్త్యాచ్ఛాద్య తత్పరమ్।
సచ్ఛాస్త్రపఠనై స్సద్భిశ్శాస్త్రార్థస్యాపి శిక్షయా॥ ౧౮౧॥
శాస్త్రార్థజ్ఞాపనై ర్వాపి శిక్షయే చ్ఛాస్త్ర మాదరాత్।
వ్యాఖ్యయా లేఖనేనాపి గ్రన్థనిర్మాణకర్మణా॥ ౧౮౨॥

తా॥ ఇతరము లైనసకలశాస్త్రంబులును సర్వోత్కృష్టమైన తచ్ఛబ్దవాచ్యమైనపరబ్రహ్మమును స్పష్టముగఁ బకటింపకఁజెప్పుచున్నవి గావున సజ్జనులతోఁ జేరి సచ్ఛాస్త్రములను జదివియు నాసచ్ఛాస్త్రములయర్థమును బాగుగాఁదెలిసికొనియును నాసచ్ఛాస్త్రములను దెలియనివారికిఁ దెలిపియు నక్కడగా నాయర్థములను వివిధగాఁ దెలుపునట్టి యొకవాఖ్యానగ్రన్థమును సంప్రదాయానుసారముగా నిర్మించి దానినివ్రాసియు నాప్రకారముగా నితరులకు నేర్పవలయును

శిష్యాణాం శిక్షయా వాపి స్వాధ్యాయార్థో యముచ్యతే।
స స్మర్తవ్యో విశేషేణ దేవమన్త్రోప్యవైష్ణవః॥ ౧౮౩॥

తా॥ ఇట్లు శిష్యులకు నేర్పుట చేతను ఈవేదార్థము చెప్పఁబడుచున్నది. మఱియును మన్త్రములు దేవతాప్రతిపాదకంబులైనను విష్ణుదేవతాకమంత్రములైనచో స్మరింపవలయును అవి యితరదేవతాక మన్త్రములైనచో వానిని స్మరింపఁగూడదు

కావ్యాలాపోఽపి జప్యః సౌ యత్ర సంకీర్త్యతేఽచ్యుతః।
గన్తవ్యం యది తీర్థార్థ ముపాదానార్థ మేవవా॥ ౧౮౪॥
స్వాధ్యాయ కాలే గమనప్రారమ్భోఽథ యథాసుఖమ్।
అవశ్య మిష్ట్వా భుక్త్వా చ దత్త్వా చైవ యథాబలమ్॥౧౮౫॥
గన్తవ్య మిష్టసిద్ధ్యర్థం భగవద్యోగసేవిభిః।
శుభేఽనుకూలే నక్షత్రే ముహూర్తేఽపిచ మఙ్గలే॥ ౧౮౬॥

తా॥ ఆసత్కావ్యం బైనను దానియందు హరినామములు చెప్పఁబడినయెడల వానిని జదువచ్చును. గఙ్గాదిపుణ్యనదులయందు స్నానము చేయుటకైగాని ఉపాదానముకొఱకుఁగాని పోవలయునన్న నుచితకాలమందు భగవన్తుని బాగుగా ధ్యానించి యాత్రారమ్భమును యథాసుఖముగాఁ జేయవలయును మఱియుఁదన కిష్టసిద్ధి గలుగుటకై మంచియనుకూలనక్షత్రముతోఁ గూడినశుభముహూర్తమందు భగవన్తుని శక్త్యనుసారముగాఁబూజించి భగవత్ప్రసాదమును దానుభుజించి యితరులకునొసంగి భగవన్తుని ధ్యానించుచు సేవించుచునుండెడివారితోఁగూడఁ నేపోవలయును

దీర్ఘాధ్వానం వ్రజే ద్విద్వా న్నసహాయోఽప్రమత్తధీః ।
వ్యోమ్ని దేవం యజే న్నిత్యం బాహుభ్యాం న నదీం తరేత్॥ ౧౮౭॥

తా॥ అది దూరదేశయాత్రగా నుండినయెడలఁ దెలిసినవాఁడు తగినసహాయముతోఁ బరాకు లేకుండఁ బోవలయును అట్టియాత్రాకాలమందు వ్యోమ మనెడి భగవన్నివాసస్థానమంమ భగవన్తుని బ్రతిదిన మారాధింపవలయును మార్గమధ్యమందు నది దాటవలసివచ్చినపక్షమున బాహువులతో నీఁది దాటఁగూడదు.

సందిగ్ధాం నాశ్రయే న్నావం నివే ద్యారోహయే ద్బుధః।
ప్రయాణారమ్భసమయే మధ్యే విశ్రమ్య చోత్థితే॥ ౧౮౮॥
ఆచమ్య పున రుత్థానే కర్మారమ్భం జపేద్బుధః।
వల్మీకం గోమయం చైవ ఛాయా మశ్వత్థతాలయోః॥ ౧౮౯॥

నలఙ్ఘయే న్నవ్రజే ద్విప్రో గవాం నిత్య మనాపది।
ఛాయాయాం విశ్రమే న్నాపి కాలి ర్యస్యాం హి తిష్ఠతి॥౧౯౦॥

తా॥ తెలిసినవాఁడు ముందుగా విచారించి తెలిసికొని దృఢమైననావ నెక్కవలయునుగాని మునిఁగిపోయే నేమో యనుసందేహాము గలుగఁజేయునట్టిశిథిలమైననావ నెక్కంగూడదు. మొదటిమజిలి తటస్థించినప్పుడధికప్రయాసము కలుగునట్లు నడచిన మార్గమధ్యమందుఁ గొంచెము నిలిచి శ్రమతీర్చుకొని పోవలయును. మఱియు నారయా కాలములయందు మలమూత్రములను విడిచి పాదప్రక్షాళనము చేసికొని మజిల లేచిపోవునప్పుడు కొంచెముసేపు కర్తారమ్భమన్త్రిమును జపించి మఱి బయలుదేర వలయును ఆపత్కాలము తప్ప తక్కిన కాలములయందుఁ దెలిసినబ్రాహ్మణుఁడు ప్రత్తియు గోమయమును రావిచెట్టునీడను దాటి చెట్టునీడను దాఁటిపోఁగూడదు. ఏ చెట్టునీడ యందుఁ త్రాఁచుఁబా మున్నదని తెలియునో యాచెట్టునీడయందు విశ్రమింపఁగూడదు

బుద్ధరుద్రాదివసతిం శ్మశానం శవ మేవవా।
అటవీం రాజధానీంచ దూరతరి పరివర్జయేత్॥ ౧౯౧॥

తా॥ బుద్ధమతస్థులు రుద్రుఁడు మొదలైనవా రుండుచోటును శ్మశానమును శవముండుచోటును అడవిని రాజధానిని దూరముగా విడువవలయును. అనఁగా నట్టిస్థలములయందు మజిలిచేయఁగూడదు

పుణ్యతీర్థం సమాసాద్య క్షేత్రం భాగవతంతు వా।
యథాశక్తి జపం దాన ముపవాసం తథా చరేత్॥ ౧౯౨॥

తా॥ పుణ్యనదియుండుచోటునుగాని భగవత్సన్నిధిదివ్యదేశమునుగాని పొందినప్పు డుపవాసము చేసి శక్త్యనుసారముగా జపము దానము మొదలైనపుణ్యకార్యములను చేయవలయును

కుటుమ్బినో వినాఽన్యేషాం దృష్టం తీర్థాదిసేవనమ్।
కుటుమ్బినాం గృహే సర్వం వికలో నిర్గతో గృహాత్॥౧౯౩॥

కుటుమ్బవన్తులు తప్ప తక్కినవారికీ పుణ్యతీర్థాదికము చెప్పఁబడినది. కుటుమ్బవన్తులకు గృహమందే సమస్తము చెప్పఁబడినది ఒకవేళఁ గుటుమ్బవన్తుఁడు గృహమునుండి తీర్థయాత్రాదులకై బయలుదేరినయెడలఁ జెడిపోవును.

యత్ర భాగవతా నిత్యం పఞ్చకాలపరాయణాః।
నివసన్తి సదా యుక్తా స్తత్క్షేత్రం నైమిశాద్వరమ్॥ ౧౯౪॥

తా॥ నిత్యము ఐదుకాలములయందును జేయందగినకర్మములను జేసెడిభగవద్భక్తు లెచ్చట నిత్యము భగవద్యోగము గలవారై నివసించుచున్నారో యట్టిపుణ్యక్షేత్రము నైమిశారణ్యముకంటె శ్రేష్ఠమైనది.

యత్ర చైకాన్తినో నిత్యం స్నానపానార్చనాదికమ్।
కుర్వతే తజ్జలం జ్ఞేయం సుతీర్థం పుష్కరాదపి॥ ౧౯౫॥

తా॥ భగవన్తునియందు దనన్యభక్తి గలవారు నిత్య మెచ్చట స్నానముపానము భగవదారాధనము మొదలైనకర్మములను జేసికొనుచున్నారో యచ్చోట నుండుజలము పుష్కరజలముకంటెను బరమపావనతీర్థమని తెలిసికొనవలయును

నివసన్తి మహాత్మానో యత్ర చైకాన్తినో ద్విజాః।
దేవా దేవర్షయో నిత్యం తం దేశం పర్యుపాసతే॥ ౧౯౬॥

తా॥ భగవదనన్యభక్తులును గనుకనే మహాత్ములు నైనద్విజు లెచ్చట నివసించుచున్నారో యట్టిదివ్యదేశమును దేవతలు దేవర్షులును నిత్యము వచ్చి సేవించుచున్నారు. గావున నట్టిదివ్యదేశములను సేవింపవలయును

నిర్గతస్తు పున ర్గేహం ప్రవిశంస్తు కుటుమ్బికః।
సమిత్పుష్పకుశోపేతః ప్రవిశే న్నతు కేవలమ్॥ ౧౯౭॥

తా॥ కుటుమ్బవన్తుఁ డిల్లు వెడలి పోయి మరల నింటినిఁ బ్రవేశించునపుడు సమిత్తులను బుష్పములను దర్భలను దీసికొని ప్రవేశింపవలయును గాని యూరక యుత్తచేతులతోఁ బ్రవేశింపఁగూడదు

యాగహోమజపస్తోత్రదానధ్యానాదికాః క్రియాః।
శ్రద్ధయైవాధికం కుర్యా త్కర్మవైకల్యశాన్తయే॥ ౧౯౮॥

తా॥ తిరువారాధనము హోమము జపము స్తోత్రము దానము ధ్యానము మొదలైనక్రియలను దాను గృహమునుండి వెడలిపోవునప్పుడు గలిగినకర్మలోపముయొక్క శాన్తికై శ్రద్ధతో ముందుకంటె నధికముగా జేయవలయును.

లౌకికం వైదికం చాపి జ్ఞాన మేక మిదం మతమ్।
లౌకికజ్ఞానహీనస్య వైదికం నిష్ఫలం భవేత్॥ ౧౯౯॥

తా॥ లౌకికజ్ఞానంబును వైదికజ్ఞానంబును జనులకు ముఖ్యములైనవి. లోక వ్యవహారజ్ఞానము లేనివానికి వైదికజ్ఞానమున్నను అది లోకమునం దుపయోగింపదు.

భక్తిమానపి సత్కర్మా శాస్త్రజ్ఞో ధనవానపి।
లౌకికజ్ఞానహీనశ్చేచ్ఛోచ్యతే భువి సజ్జనైః॥ ౨౦౦॥

తా॥ పరమపదము కావలయు నన్న భగవద్భక్తి నయను సంపాదించుకొనవలయును దానిని సంపాదించుకొనుటకు వేదాన్తశాస్త్రజ్ఞానము వలయును అట్టిజ్ఞానమో పరిశుద్ధమైనమనస్సు గలవారికే కలుగును గాని యితరులకుఁ గలుగదు. మనస్సు పరిశుద్ధమగుటకు భగవదుల్లాసకరములైన సత్కర్మంబులను భగవద్భక్తి గలిగి చేయవలయును సత్కర్మంబుల ననుష్ఠించుటకు శరీరము నారోగ్యముగా ధరించి యుండవలయును. శరీరధారణమునకో ధన ముండవలయును, ఈసామగ్రి యంతయుఁ గలుగుటకు లోకవ్యవహారజ్ఞానము ముఖ్యముగా నుండవలయును భక్తి సత్కర్మానుష్ఠానము శాస్త్రజ్ఞానము ధనము ననునివి యన్నియు నుండియు లోకవ్యవహారజ్ఞానము లేనియెడల నట్టివానిని గూర్చి సజ్జనులు, అయ్యోయనుకూలసామగ్రి యుండియు ముఖ్యమైన లౌకికజ్ఞానము వీనికిలేకపోయెనే యని చిన్తింతురు గావున లౌకికజ్ఞానము ముఖ్యముగా నుండవలయును.

వ్యాసాద్యా మునయస్సర్వే నియన్తా భగవానపి।
లోకజ్ఞానానురోధేన ధర్మసంస్థాపనేఽభవన్॥ ౨౦౧॥

తా॥ ఏల యనఁగా వ్యాసాదిమునులును సర్వమునకు నియామకుండైన భగవన్తుఁడును లోకవ్యవహారజ్ఞానము ననుసరించియే ధర్మసంస్థాపనమును జేసినవారైరి కావున లౌకికజ్ఞానము ముఖ్యముగాఁ గావలసియున్నది.

భక్తిర్భగవతి జ్ఞానం శాస్త్రీయం కర్మ చాఖిలమ్।
అలఙ్కుర్వన్తి పురుషం లోకజ్ఞ మనహఙ్కృతిమ్॥ ౨౦౨॥

తా॥ మఱియును కేవలలౌకికజ్ఞానముండినను బ్రయోజనము లేదు లౌకికజ్ఞానము గలిగి యహఙ్కారములేనివానికి భగవద్భక్తియు వేదాన్తశాస్త్రజ్ఞానంబును కర్మానుష్ఠానమంతయు నున్నయెడల నవి వానికిఁ బ్రకాశకరములై యుండును

సర్వభూతావిరోధేన చేష్టితం ధర్మసంహితమ్।
సత్కీర్తియుక్తిర్యస్య స్యాల్లోకజ్ఞస్స చ కథ్యతే॥ ౨౦౩॥

తా॥ లోకవ్యవహారజ్ఞానము గలవాఁడెట్టివాఁ డనఁగా నెవఁడు సర్వప్రాణులకును విరోధము లేకుండ ధర్మకార్యముల ననుష్ఠించునో యేవాఁడు మంచికీర్తి గలవాఁ డగునో యట్టిపురుషుఁడు లోకజ్ఞానము గలవాఁ డని చెప్పఁబడును.

సుశీల ఇతిచ ప్రోక్తో గుణవా న్ధార్మిక స్త్వతి ।
పరోద్వేగకరో యస్తు ధార్మికోఽపి మహాసుర॥ ౨౦౪॥

తా॥ మఱియు సత్పురుషుఁడు మంచినడత గలవాఁడనియు మంచిగుణములు గలవాఁడనియు ధార్మికుం డనియుం జెప్పఁబడును ఇతరులకు భయము గలుగఁజేయువాఁ డెవఁడో వాఁడు ధర్మకార్యములను జేయువాఁడైనను గొప్పరాక్షసుం డని చెప్పవలయును.

బహుశ్రుతస్య విదుషో లోకజ్ఞస్యాపి దేహినః ।
దుర్లభా మూలశాస్త్రేతు భక్తి ర్మోక్షైకసాధనే ॥ ౨౦౫॥

తా। లోకప్రసిద్ధుఁడును విద్వాంసుండును లోకవ్యవహారముచు బాగుగా నెఱింగినవాఁడునగు వానికిఁగూడ మోక్షమునకు ముఖ్యసాధనంబైన వేదాన్తశాస్త్రమందుభక్తి గలుగుట దుర్లభమైయున్నది- ఏలయనఁగా, 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే' అను వచనము ననుసరించిచూడఁగా నందఱికి నాశాస్త్రమందు భక్తిగలుగదు. జన్మాన్తరకృత పుణ్యాతిశయముచే నొకానొకనికే కలుగును.

శాస్త్రాభ్యాసపరస్యాపి శాస్త్రే భక్తి స్సుదుర్లభా ।
శాస్త్రే భక్తిమతామేవ సులభంశాశ్వతంపదమ్॥ ౨౦౬॥

తా॥ శాస్త్రము నభ్యసించు వానికిఁగూడ దానియందు మిక్కిలి భక్తి గలుగుట దుర్లభమైయున్నది. అట్లుండ నితరులకెట్లు కలుగును. విచారింపఁ మోక్షసాధన మైనవేదాన్తశాస్త్రమందు భక్తిగలవారికే మోక్షము గలుగునుగాని యితరులకుఁ గలుగదు

శ్రవణం శ్రావణం చిన్తా తదర్థే తస్య సంగ్రహః ।
చోదితానా మనుష్ఠానం శాస్త్రభక్తస్య లక్షణమ్॥ ౨౦౭॥

తా॥ శాస్త్రమందు భక్తి గలవాఁడనుటకు గుర్తేదనఁగా నెవఁడు వేదాన్తశాస్త్రమును సద్గురువు చెప్పఁగా విని విన్నది విన్నట్లు శ్రవణాధికారము గలయితరులు వినునట్లు చెప్పి దినదినము దానిని మఱవక మనంబునఁ దానును దలంచుచు నాయర్థములను సంగ్రహించివ్రాయుచు గురువు చెప్పినవిధముగా ననుష్ఠించుచు నుండునో యట్టివాఁడు శాస్త్రమందు భక్తిగలవాఁడనుటకు నట్టియనుష్ఠానము లక్షణమని యెఱుంగునది

శాస్త్రాభ్యాసపరాణాంచ కర్మ చానుతిష్ఠతామ్ ।
హృదయే భక్తిహీనానాం నశాస్త్రం తు ప్రకాశతే॥ ౨౦౮॥

తా॥ శాస్త్రోక్తప్రకారముగా సత్కర్మంబుల ననుష్ఠింపక మనస్సునందు భగవద్భక్తిలేక యెన్నిశాస్త్రముల నభ్యసించినను, అట్టివారి కాశాస్త్రములు ప్రకాశింపవు. అనఁగా శాస్త్రజ్ఞానము వ్యర్థమనుట

అభక్తానా మనన్యానాం సచ్ఛాస్త్రం శ్రూయతేపివా।
అన్యథా ప్రతిభా త్యేవ విషాక్తానాం యథాపయః॥ ౨౦౯॥

తా॥ భగవద్భక్తి గలవారు శాస్త్రము వినుటకుఁ దగుదురుగాని యితరులు తగరు అట్టియయోగ్యులు అనఁగా భగవద్భక్తిలేనివా రొకవేళ నట్టిసచ్ఛాస్త్రమును విన్నను, ఆశాస్త్రము వారికి వేఱువిధముగాఁ దోఁచునే కాని మోక్షప్రాప్తికి సాధన మైనది కాదు విషముచే నోరు చేదుగా నున్నట్టిజనులకుఁ బాలు చేదుగాఁ నుండునే కాని మధురముగా నుండదు గదా,

ప్రకాశయితు మాత్మానం భక్తానాం హితకామ్యయా।
అవతీర్ణో జగన్నాథ శ్శాస్త్రరూపేణ వైప్రభుః॥ ౨౧౦॥

తా॥ జగన్నాథుండును నిగ్రహానుగ్రహసమర్థుండు నగుభగవంతుఁడు తనయందు భక్తిగలవారికి హితమును గోరి తన్నుబాగుగాఁ దెలుపుటకై తాను శాస్త్రరూపముగా నవతరించె ననియెఱుంగవలయును,

తస్మా చ్ఛాస్త్రే దృఢం కార్యా భక్తిర్మోక్షపరాయణైః।
అభక్తస్య పరే శాస్త్రే భగవా న్న ప్రకాశతే॥ ౨౧౧॥

తా॥ కావున మోక్షమునుగోరువారు మోక్షముఖ్యసాధన మైనశాస్త్రమందు దృఢమైనభక్తి గలవారై యుండవలయును. అట్టిదృఢభక్తి లేనివానికి శాస్త్రమందు భగవంతుఁ డగఁబడఁడు అనఁగా వానికి విపరీతజ్ఞానము గలుగును గనుక నెంతచదివినను శాస్త్రభక్తి లేనివానికి శాస్త్రముచేత భగవత్స్వరూపము దెలియఁబడదనుట.

తామసానాం విమూఢానాం పతితానాం భవార్ణవే।
విపరీతం చ సకలం ధర్మజ్ఞానం ప్రకాశతే॥ ౨౧౨॥

తా॥ తమోగుణప్రధానులై యెవ రుందురో వారు మూఢులై సంసారసాగరమందు మునుఁగుదురు. అట్టివారికిఁ జెప్పెడి ధర్మోపదేశము విపరీతముగాఁ దోఁచును

ఉత్కీర్ణ ఇవ మాణిక్యే విరలామ్బరవేష్టితః।
దృశ్యతే వివరేష్వేవం భక్తా న్తస్సంస్థితో హరిః॥ ౨౧౩॥

తా॥ సానఁబెట్టిన మాణిక్యమందుఁ పలుచనివస్త్రముచేఁ జుట్టఁబడిన వాఁడెట్లు తెలియునో యట్లుభక్తులహృదయారవిందమం దుండు శ్రీహరి వారి హృదయద్వారమునం దుఁ బ్రకాశించును.

నిష్ప్రదీపస్య గేహస్య ద్వారై రివ దురాత్మనః ।
దృశ్యతే కరణై రన్త రన్ధకారసమం నిశి॥ ౨౧౪॥

తా॥ రాత్రియందు దీపములేనియింటిలోనున్న వస్తువులు ద్వారములచేతవలె భక్తిలేనిదురాత్ముని హృదయమునందున్న సర్వేశ్వరుఁడు వానియిన్ద్రియములచేత నంధకారమువలె నుండునుగాని కనఁబడఁడు.

హృదయస్థే జగన్నాథే కార్యకారీన్ద్రియం భవేత్ ।
కాలయోగ్యం చ కృత్వైవ యోగీ భోజన మాచరేత్॥ ౨౧౫॥

తా॥ భగవన్తుఁడు హృదయమం దుండఁగా సర్వేన్ద్రియంబులును దమతమకార్యములను జేయుచున్నవి గావున సర్వకారణభూతుండైనభగవన్తునిదయ సంపాదించుకొనుటకు ధ్యానయోగము గలవాఁడై యాయాకాలములయందుఁ జేయఁదగిన సత్కర్మములను జేసియే తాను భుజింపవలయును.

రాత్రౌ మజస్రయోగ స్సన్యథా కామం సమాచరేత్ ।
భగవత్సన్నిధావేవ వివిక్తేఽన్యత్ర వా స్థలే॥ ౨౧౬॥

తా॥ రాత్రియందు భగవత్సన్నిధియందైనను జనులులేని మఱియొకప్రదేశమందైననుండి యెడతెగనిధ్యానయోగము గలవాఁడై యప్పుడు కర్మానుష్ఠాననియమము లేదుగనుక మనసువచ్చినంతవఱకు భగవన్తుని దలంపవలయును.

యోగం కుర్యాత్సమాధాయ యథాస్థానాసనో వశీ ।
ఉపలిప్తే శుచౌ దేశే కుశా నాస్తీర్య భూతలే॥ ౨౧౭॥

తా॥ గోమయముతో నేల నలికి యట్టిపరిశుద్ధప్రదేశమందు దర్భలను బఱచుకొని యుట్టితగినస్థానమందుఁ గూర్చుండి మనస్సును సరిపఱచుకొని జితేన్ద్రియుండై ధ్యానమును జేయవలయును.

శుచ్యాసనం సమాధాయ వస్త్రేణా స్తృణుయాచ్ఛుతత్ ।
చీరం శుక్లం కృతంచర్మ మార్గం వేత్రకృతం తథా॥ ౨౧౮॥
అజీర్ణ మేకవర్ణంచ యోగేస్స్యా దాసనం దృఢమ్ ।

తా॥ తాను బరమాత్మను ధ్యానము చేసికొనుటకుఁ గూర్చుండుటకై పరిశుద్ధమైనయాసనమును సరిగా వేసికొని దానిమీఁద నొకవస్త్రమును వేసి కప్పవలయును. ఆవస్త్రము తెల్లనిది గాను నాఁచమఁడిగాను ఉండవలయును. జింకతోలైనను జేముల చాపనైనను ఆయాసనముమీఁద వేసికొనవచ్చును. ఆయాసనము జీర్ణము గానిదిగాను ఒకరంగుగలదిగాను గట్టిదిగాను ఉండవలయును. అట్టియాసనము పరమాత్మను ధ్యానము చేయుటకుఁ గూర్చుండుటకు సరియగును.

ఈదృశః పరమాత్మాయం ప్రత్యగాత్మా తథేదృశః॥ ౨౧౯
తత్సంబన్ధానుసన్ధాన మితియోగరి ప్రకీర్తితః।
యోగో నామేన్ద్రియై ర్వశ్యై ర్బుద్ధే ర్బ్రహ్మణి సంస్థితిః॥ ౨౨౦
వదన్తి న తథా జ్ఞేయం త్రయ మేకం విదు ర్బుధాః।

తా॥ పరమాత్మ యిట్టివాఁడనియు జీవాత్మయిట్టివాఁడనియుం దెలిసికొని వారికుండు నవవిధసంబన్ధముల ననుసన్ధించుట యోగమని చెప్పఁబడెను. కొందఱు యోగమనఁగా నిన్ద్రియములను వశపఱచుకొని బ్రహ్మమందు మనస్సు నిలుపుట అని చెప్పుచున్నారు అదియట్లుగాదు. ఆమాటినొక్కటిగా జ్ఞానులు తెలిసికొనుచున్నారు అనఁగాఁ బరమాత్మజ్ఞానము జీవాత్మజ్ఞానము వారిరువురి సంబన్ధముల ననుసన్ధించుట. యను నీమూటినొక యోగమునుగా జ్ఞానులు దెలిసికొనుచున్నారనుట.

భిత్తివర్ణవియోగేన యథా చిత్రం న లభ్యతే॥ ౨౨౧
కర్మజ్ఞానం తథా యోగం వినా యోగో న లభ్యతే।

తా॥ గోడ రంగు ఇవి లేకుండఁ జిత్తరువెట్లులభింపదో కర్మయోగము జ్ఞానయోగము లేకుండఁ బూర్వోక్తయోగము లభింపదు.

అజ్ఞాస్త్వేకాయనాచారం కర్మయోగం వదన్తిహి॥ ౨౨౨
సమ్యగ్జ్ఞాన మిదం ప్రాజ్ఞా వదన్త్యచ్యుతయోగినః।

తా॥ యోగస్వరూప మెఱుఁగనివారు పరబ్రహ్మప్రాప్తి సాధనమైన యనుష్ఠానముగల కర్మమును యోగమనుచున్నారు, బాగుగా యోగస్వరూపమును దెలిసినవారు పూర్వోక్తమైన మంచిజ్ఞానమును అనఁగా జీవాత్మ పరమాత్మజ్ఞాన తత్సంబన్ధానుసన్ధాన రూపజ్ఞానమును యోగమనుచున్నారు

యోగధర్మ ఇతి ఖ్యాత స్సాక్షా ద్భాగవతో విధిః॥ ౨౨౩

తా॥ ఇట్టి యోగధర్మము ముఖ్యముగా భాగవతులకుఁ గావలసిన కార్యమని చెప్పఁబడినది.

సర్వేన్ద్రియై రపి సదా యోగో యుజ్యత ఇత్యతః ।
అనుసన్ధానవిజ్ఞానయోగేన బ్రహ్మ శాశ్వతమ్ ॥ ౨౨౪॥

తా॥ కనుకనిట్లు సర్వేన్ద్రియములతోఁగూడ నెల్లప్పుడు మనస్సును బరమాత్మయందు నిలిపి ధ్యానించుట యోగమని చెప్పఁబడును ఇట్లనుసన్ధించుటచేఁ గలిగినవిజ్ఞానసంబన్ధముచే శాశ్వతమైనపరమపదము పొందఁబడును.

యథార్చ్య మిన్ద్రియై రాత్మా సేవ్యతే సత్క్రియాపరైః ।
స్వామీ వ్యవస్థితో గేహే భృత్యైవర్గై రివాన్తరః॥ ౨౨౫॥

తా॥ భృత్యులు తమయజమానుని గృహమం దెట్లు సేవింతురో యట్లు సర్వేన్ద్రియంబులను లోనున్నపరమాత్మను యోగ్యతానుసారముగా సత్కర్మానుష్ఠానముచే సేవింప వలయును.

యథా యథా హరిం భక్త్యా జానాతి పురుషోత్తమమ్ ।
తథా తథా సముత్సృజ్య పాపాని కురుతే శుభమ్॥ ౨౨౬॥

తా॥ పురుషోత్తముం డగుశ్రీహరిని భక్తితో నెట్లెట్లు సేవించుచున్నాఁడో అట్లట్లు పాపకార్యములను జేయుట మాని పుణ్యకార్యములను జేయుచున్నాఁడు

సదాచారస్య వైకల్య మల్పం వా యత్ర దృశ్యతే ।
వికలా భక్తి రత్రేతి బోద్ధవ్యం తామసాన్వయాత్॥ ౨౨౭॥

తా॥ ఏపురుషునియందు సదాచారము కొంచె మైనను లోపించినట్లు తోఁచుచున్నదో వాఁడు దామసగుణసంబన్ధము గలవాఁడనియు, కావుననే వానికి భగవన్తునియందు సంపూర్ణభక్తి లేదనియుం దెలిసికొనవలయును.

రజస్తమఃక్షయాదేవ శుద్ధే సత్త్వే తతోఽమలమ్ ।
జ్ఞానం భవతి విజ్ఞానా ద్భక్తిరి పుంసాం ప్రజాయతే॥ ౨౨౮॥

తా॥ లోకమం దందఱికిని సత్త్వరజస్తమోగుణములు మిశ్రమైయే యుండును. పుణ్యవశముచేత రజోగుణతమోగుణములు నశించినయెడల సత్త్వగుణము పరిశుద్ధమై యుండును. అట్లు శుద్ధమైనసత్త్వగుణ ముండుటచేత నిర్మలమైనజ్ఞానము గలుగుచున్నది. అట్టినిర్మలజ్ఞానముచేతఁ బురుషులకు భగవద్భక్తి సంపూర్ణముగాఁ గలుగుచున్నది.

కర్మణా జ్ఞానమిశ్రేణ స్థిరప్రజ్ఞో భవే త్పుమాన్ ।
సత్త్వికాశే న తు తమో రజోవా వర్తతే క్వచిత్ ॥ ౨౨౯॥

తా॥ పురుషుఁడు జ్ఞానమిశ్రితముగాఁ గర్మములను జేయుటచేత దృఢమైనజ్ఞానము గలవాఁడగును జ్ఞానమువర్జిల్లినయెడల రజస్సును దమస్సును గొంచెమైననుండదు.

శుద్ధాచారపరత్వంహి శుద్ధసత్త్వస్య లక్షణమ్ ।
నిషిద్ధకార్యే యోగశ్చ సత్త్వేతరగుణోద్భవః ॥ ౨౩౦॥

తా॥ పరిశుద్ధమైనయాచార మండవని కాసక్తియుండునో వాఁడు శుద్ధసత్త్వగుణమే కలవాఁడని యెఱుంగవలయును- శాస్త్రనిషిద్ధకార్యముల నెవఁడు చేయునో వాఁడు రజోగుణతమోగుణములు గలవాఁడని యెఱుంగునది.

సచ్ఛాస్త్రనిరతా ఏవ శుద్ధసత్త్వా హి యోగినః ।
అక్లేశేన సముత్తీర్య భవాబ్ధిం యాన్తి తత్పదమ్ ॥ ౨౩౧॥

తా॥ మఱియు నెవరు సచ్ఛాస్త్రములయం దాసక్తి గలవారో వారే శుద్ధసత్త్వగుణముగలవారు అట్టివా రనాయాసముగా సంసారసముద్రమును దాటి పరమపదము నొందుచున్నారు

వేదశాస్త్రార్థతత్త్వజ్ఞ స్సమ్యక్స్వాధ్యాయతత్పరః।
యోగధర్మైకనిరతో బ్రహ్మభూయాయ కల్పతే॥ ౨౩౨॥

తా॥ బాఁగుగా వేదములను శాస్త్రములను జదివి వానిలోనిసారాంశమును దెలిసికొని నిత్యము పరమాత్మను ధ్యానము చేయువాఁడు పరబ్రహ్మమును బొందుచున్నాఁడు.

సకృదావర్తితోఽప్యేష స్వాధ్యాయో ద్వాదశాక్షరః ।
భక్తానాం పాతకాన్యాశు నాశయత్యవశాదివ ॥ ౨౩౩॥

తా॥ ద్వాదశాక్షరవేదమన్త్రమును భక్తితో నొకసారి జపించినమాత్రాన నదియట్లు జపించినవారిపాపముల నప్రయత్నముగా శీఘ్రముగాఁ బోఁగొట్టును.

నిత్యం స్వాధ్యాయశీలానాం స్వాధీనేన్ద్రియవర్తినామ్ ।
యజతాం జుహ్వతాం చైవ జీవన్ముక్తి రుదీరితా॥ ౨౩౪॥

తా॥ ప్రతిదినము వేదాధ్యయనమును జేయుచు జితేన్ద్రియులై భగవన్ముఖోల్లాసకరములైనసత్కర్మంబుల ననుష్ఠించుచు ఆజ్యాదిహవిస్సు నగ్నియందు వ్రేల్చుచుండువారికిఁ బ్రతికియుండునపుఁడె ముక్తినివకిలె బ్రహ్మానందముకలుటయందు సందియమించుక యైన లేదు-

ఉపవాసం వినై వాయం మహాపాతకనాశనః ।
నిషిద్ధే కర్మణి ప్రాప్తే సోపవాసం జపేన్మనుమ్ ౨౩౫॥

తా॥ ఈమన్త్రముపవాసము లేకుండనే గొప్పపాపములను బోఁగొట్టును అయి నను, అధికారిపూర్తిగాఁ బాట శాస్త్రనిషిద్ధకర్మంబులను జేసినయెడల దానివలనఁ గలిగెడి పాపమును బోఁగొట్టుకొనుటకునుపవాసమును జేసి యామన్త్రమును జపింపవలయును అట్లు జపించిన నాపాపము పోవును

పరిహృత్యచ పాపాని జప న్కుర్వ న్సదా క్రియాః।
ఉపవాసపరో భూయ శ్శక్తి కృచ్ఛ్రాణి చాచరేత్॥ ౨౩౬॥

తా॥ ఆమన్త్రమును జపించుచు సర్వదా సత్కర్మంబులను జేయుచుండువాఁడు తనపాపములను బోఁగొట్టుకొని యుపవాసముచేయశక్తిగలవాఁడయ్యేనేని ఉపవాసమును జేసి యనేకకృచ్ఛ్రములనుజేయవలయును.

ఉపవాసపరాణాం తు కదాచి న్నేన్ద్రియభ్రమః।
ఇన్ద్రియభ్రమహీనానా మచిరా ద్బ్రహ్మ సిధ్యతి॥ ౨౩౭॥

తా॥ ఉపవాసము చేయువారి కెప్పుడు నిన్ద్రియములకు భ్రమ కలుగదు. ఇన్ద్రియభ్రాన్తి లేనివారికి శీఘ్రముగా బ్రహ్మసాక్షాత్కార మగును.

అక్షతర్పణయుక్తానాం యతతా మపి యోగినామ్।
నిత్యాం పార్శ్వగతో మృత్యు స్సన్న్యాసినామపి॥ ౨౩౮॥

ఇన్ద్రియములకుఁ దృప్తిచేయువారికిని ఆకు అలము కందమూలఫలములు మొదలైనవానిని భక్షించి యిన్ద్రియములకుఁ దృప్తిచేయక మోక్షమునకు యత్నించునట్టి యోగులకును అట్టియాహారమునుగూడవిడిచిన సన్న్యాసులకును నిత్యము ఎల్లైనను చావు సమీపించియున్నది

అవశ్యం భవసంతార మిచ్ఛ న్నవిజితేన్ద్రియః।
శరీరం శోషయే న్నిత్యం కృచ్ఛ్రచాన్ద్రాయణాదిభిః॥ ౨౩౯॥

తా॥ సంసారసముద్రమును దాటవలయు నని కోరిక కలదు. ఇన్ద్రియములను జయింప శక్తిలేదు. అట్టివాఁడేమి చేయ వలయు ననఁగాఁ గృచ్ఛ్రచాన్ద్రాయణాది తపస్సులచేత దేహమును గృశింపఁజేయవలయును

ఉపవాసపరాణాంతు కేవలం నాత్మనిగ్రహః।
క్రియమాణం కృతం యద్వా కృతం పాపంవినశ్యతి॥ ౨౪౦॥

తా॥ ఉపవాసము చేయువారికి యింద్రియజయము మాత్రమే కాదు. మఱియేమనఁగా, ఇప్పుడు చేయఁబడుచున్న పాపమును, ఇదివఱకుఁ జేసిన పాపమును, చేయఁబోయెడి పాపమును నశించును.

ఏకరాత్రం ద్విరాత్రం వా త్రిరాత్రమథ పక్షయోః ।
యథాశక్త్యుపవాసీ స్యా ద్ధృతవాక్కాయమానసః॥ ౨౪౧॥

తా॥ ఉపవాస మెట్లు చేయవలయు ననఁగా శుక్లకృష్ణపక్షములయం దొకరాత్రియైనను రెండురాత్రులైనను మూఁడురాత్రులైనను మనోవాక్కాయనియమములుగలవాఁడై శక్త్యనుసారముగా నుపవాసము గలవాఁడుఁగావలయును

ఏకాదశీ ముపవసే ద్దినషట్కం తు శాన్తిమాన్ ।
శ్రవణైకాదశీపర్వ కృష్ణాష్టమ్యాఖ్య మాదరాత్ ॥ ౨౪౨॥

తా॥ ప్రతియేకాదశియందును శ్రవణైకాదశియందును కృష్ణాష్టమియందును పర్వములయందును, ఈయాఱుదినములయందు శక్తిగలవాఁడై యాదరముతో నుపవాసముండవలయు.

ఉపోష్యైకాదశీం వాపి భగవత్ప్రీతయే బుధః ।
స్వాధ్యాయతత్పర శ్శశ్వ ద్ద్వాదశ్యాం పారణం చరేత్॥ ౨౪౩॥

తా॥ మఱియును భగవత్ప్రీతికై తెలిసినవాఁడు వేదపారాయణము చేయుచు నేకాదశియం దుపవాసము చేసి ద్వాదశియందుఁ బారణము చేయవలయును. ఎల్లప్పు డట్లే చేయవలయును.

ఉపోష్య విధివ ద్దేవ మభ్యర్చ్యచ పరేఽహని ।
భక్తై స్సహాశ్నతాం తుష్టాః శ్వేతద్వీపనివాసినః॥ ౨౪౪॥

తా॥ ఇట్లేకాదశియం దుపవసించి పరదినమందు శాస్త్రోక్తప్రకారముగా భగవంతుని బూజించి సంతోషముగ నుండియును భగవద్భక్తులతోఁగూడ భుజింపవలయును శ్వేతద్వీపమందు నివసించువారి కిది విహితకర్మము.

ఉపవాసదినే విద్వా న్నాత్మయాగం విహాయతు ।
అన్య త్సమాచరే త్సర్వం యథాపూర్వం తు విజ్వరః॥ ౨౪౫॥

తా॥ తెలిసినవాఁ డుపవాసదినమందు సాపాటు తప్ప తక్కిన సమస్తకార్యములను, ఎప్పటివలెఁ గష్టమని తలంపక చేయవలయును.

అథవా జపనిష్ఠానాం దాన్తానాం మితభోజినామ్ ।
అచ్ఛిద్రకారిణాం నిత్యం షాణ్ముకాల మలం భవేత్ ॥ ౨౪౬॥

తా॥ బాగుగా భుజించువారి కుపవాసము చేయ శక్తి యుండును గాని యల్పముగా భుజించువారి కెట్లు శక్తి యుండును, వారెట్లుపవాసము చేయఁగలరు వారికతి యేమియనఁగా మితముగాభుజించువారెవరో వారు నిత్యము తప్పక తమమన్త్రములను జపించువారై దాతలై యెవ్వరికిని కెడుగును జేయనివారై నిత్యము కాలము తప్పక సంధ్యావన్దనాది కృత్యములనుజేయువారైనయెడల వారికదియే చాలును, ఉపవాసము క్కఱలేదు

స్వాధ్యాయ మభ్యసే న్నిత్యం మనసా మౌన మాచరేత్ ।
అవిరోధేన భూతానాం ముక్షో ద్వాచ మనాకులః ॥ ౨౪౭॥

తా॥ ప్రతిదినము వేదము నభ్యసింప వలయును విశేషముగా మాటలాడఁగూడదు, సర్వప్రాణులకును విరోధము లేకుండ నిర్మలాన్తఃకరణము గలవాఁడై మాటాడవలయును.

యదుద్వేగకరం వాక్య మన్యార్థార్థావబోధకమ్ ।
అసత్యం నిహితార్థంచ నోచ్చరే దపి గర్హితమ్ ॥ ౨౪౮॥

తా॥ మఱియును భయంకరముగాను విపరీతార్థజ్ఞానము గలుగునట్లుగు అసత్యముగాను చెప్పినదానికి నర్థము గానట్లును నిన్దగాను మాట లాడఁగూడదు.

అర్థయుక్తంచ సత్యంచ శ్రావ్యం ప్రియకరం మృదు ।
శుద్ధం మితంచ యుక్తంచ కాలయోగ్యం వదే ద్వచః॥ ౨౪౯॥

తా॥ మాట లాడునపుడామాట గమ్భీరార్థము గలది గాను సత్యముగాను వినసింపైనదిగాను సంతోషకరమైనది గాను మృదువు గాను అపశబ్దములు లేనిది గాను బరిమితము గాను యుక్తియుక్తము గాను గాలమునకుఁ దగినది గాను,ఉండవలయును.

వేదవిద్యావ్రతస్నాతై ర్బహ్వాన్తస్సమచేష్టితైః।
అసూయారహితై రస్మి క్ష్యా ఫ్షై భక్తై స్సహావసేత్ ॥ ౨౫౦॥

తా॥ బ్రహ్మచర్యాశ్రమమందు యథావిధిగా వేదాధ్యయనము పొందలైనవానిని శేసి గుర్వాజ్ఞచే స్నాతకవ్రతము పొంది గృహస్థులై లోపలను బైటను సమమైన వ్యా

పారము గలవారై యసూయలేనివారై యీధర్మశాస్త్రమందు భక్తిశ్రద్ధలు గలవారేవ రో వారితోఁగూడ సహవాసమును జేయుచుండవలయును. గుణములయందు దోష బుద్ధి యసూయ

మూర్ఖాశ్చ పణ్డితంమన్యా అధర్మ్యా ధార్మికా ఇవ ।
ధర్మయుక్తాన్ప్రబాధన్తే నాథూనాం లిఙ్గమాస్థితాః ॥ ౨౫౧॥

తా॥ లోకమందుఁ గొందఱు మూఢులు తాము పణ్డితుల మనితలంచి యధర్మం బులనే చేయుచు బైటికిమాత్రము ధార్మికులవలె సాధులక్షణములు గలవారై ధార్మికు లను బాధించుచున్నారు గావున నట్టి వారితో సహవాసము చేయఁగూడదు.

ఏకత స్త్వపవర్గార్థ మనుష్ఠానాది కౌశలమ్ ।
లోకానుసార స్త్వేకత్ర గురుఁరి పశ్చా దుదీరితః॥ ౨౫౨॥

తా॥ మఱియు నొకవైపున మోక్షముకై తగినయనుష్ఠానాదికమందు నేర్పు గలిగి యుండుట,పిమ్మట మఱియొకవైపున శాస్త్రోక్తకర్మంబుల నాచరించుచు లోకము ననుసరించి యుండుటయు నింకొకవైపున సదాచార్యసమాశ్రయణముచేయుటయు, చెప్పఁబడినది ఈమూఁటి నవలమ్బించియే యుండవలయును, అట్లుండిననే మోక్షము లభించుననుట.

భవన్తి బహవో మూర్ఖారి క్వచి దేకో విశుద్ధధీః ।
త్రాసితోఽపి సదా మూర్ఖై రచలో యస్య బుద్ధిమాన్॥ ౨౫౩॥

తా॥ లోకమందు మూర్ఖులనేకు లున్నారు ఎక్కడనో యొకచోటఁ బరిశుద్ధా న్తఃకరణము గలజ్ఞాని యొకం డుండును అట్టిబుద్ధిమన్తుండు తన్నట్టిమూర్ఖులు భయప ఱచినను నిత్యము ధర్మమార్గమునుండి తొలంగనివాఁడై యుండవలయును.

న విశ్వాసరి క్వచి త్పాపిష్ఠే విశేషాత్తు కలౌ యుగే ।
పాపిష్ఠా వాదవర్షేణ మోహాయ న్త్యవిచక్షణాన్॥ ౨౫౪॥

తా॥ ఎప్పుడును పాపిష్ఠులను నమ్మఁగూడదు,అందును గలియుగమందు బొత్తిగా నమ్మఁగూడదు, ఏల యనఁగా నట్టిపాపులు,ఏమో మేలుచేయువారివలెఁ బుంఖాను పుంఖముగా దుర్వాదములతో ధారావర్షమువలె నుపన్యాసములను జేయుదురు. అట్టి యుపన్యాసములను జూచి తెలివిలేనివారు తమయజ్ఞానముచే మోహమునొంది వారికి వశు లగుచున్నారు గావున వారిమాటలను నమ్మఁగూడదు.

గోపయే న్నోచ్చరే ద్ధర్మం నాపృష్టః కించిదుచ్చరేత్ ।
పృష్టోఽపి నవదే ద్ధర్మం గుహ్యాం సిద్ధాన్త మేవచ॥ ౨౫౫॥

తా॥ తాను జేసినధర్మకార్యములను మఱుఁగుపఱుపవలయును గాని తానుగాఁ జెప్పుకొనఁగూడదు, తన్నడగని విషయంబు నెవ్వరికిని జెప్పఁగూడదు, ఒకవేళ నడిగినను రహస్యార్థమైన మతసిద్ధాన్తమును యోగ్యతిగలవానికిఁదప్ప యితరులకుఁ జెప్పఁగూడదు,

ఆశ్రితా యాతిభక్తాయ శాస్త్రే శ్రద్ధాపరాయచ ।
న్యాయేన పృచ్ఛతే సర్వం వక్తవ్యం శౌచయోగినే॥ ౨౫౬॥

తా॥ రహస్యార్థమును మతసిద్ధాన్తమును జెప్పుటకుఁ దగినవాఁడెట్టివాఁడనఁగా, అడుగునట్టివాఁడు తన్నాశ్రయించి తనయందు భక్తియు శాస్త్రమందుఁ బ్రమాణబుద్ధియుం గలిగి యుక్తియుక్తముగా నడుగవలయును, మనోవాక్కాయశుద్ధిగలవాఁడై యుండవలయును. అట్టివానికేది యడిగినం జెప్పనొప్పును.

ఆత్మపూజార్థ మర్థార్థం దమ్భార్థమపి ఖిన్నధీః ।
అయోగ్యేషు వదఞ్ఛాస్త్రం సన్మార్గా త్ప్రచ్యుతో భవేత్॥ ౨౫౭

తా॥ తనకు గౌరవము గలుగుటకుఁగాని ధనసంపాదనముకొఱకుఁగాని దమ్భముకొఱకుఁగాని ఖేదయుక్తమైనమనస్సుగలవాఁడై శాస్త్రమును దెలిసికొన యోగ్యతలేని వానికి శాస్త్రమును జెప్పఁగూడదు అట్లు చెప్పినవాఁడు సన్మార్గమునుండి తొలంగినవాఁడగును.

ఊషరే నివపే ద్బీజం షణ్డే కన్యాం ప్రయోజయేత్ ।
విసృజే ద్వానరే మాలాం నాపాత్రే శాస్త్ర ముత్సృజేత్ ॥

తా॥ ఏల యయోగ్యులకు శాస్త్రము చెప్పఁగూడదనఁగా, చవిటినేలయందు విత్తనము వేసినను నపుంసకునకుఁ గన్యనిచ్చినను గోఁతికిఁబూలదణ్డనొసంగినను బ్రయోజనమేమైనను గలదా? లేదు అట్లే శాస్త్రార్థమును దెలిసికొన యోగ్యత లేనివానికి శాస్త్రమును జెప్పినం బ్రయోజనము లేదు గనుక నయోగ్యునకు శాస్త్రమును జెప్పఁగూడదు.

అచ్ఛిద్రకర్మ నిరత శ్శాస్త్రాభ్యాసరత స్సదా ।
స్వాధ్యాయాభ్యాసయోగేన నయేత్కాల మతన్ద్రితః॥ ౩౪౯॥

తా॥ మతియు బుద్ధిమన్తుఁడు వేదోక్తకర్మముల నేవిధమైనలోపము లేకుండ ననుష్ఠించుచు నిత్యము వేదశాస్త్రముల నభ్యసించుచు జాగరూకుఁడై కాలమును గడపవలయును.

ఇతి శాణ్డిల్యస్మృతౌ విశిష్టధర్మశాస్త్రే చతుర్థోఽధ్యాయః

శాణ్డిల్యస్మృతి యనెడి విశిష్ట పరమధర్మ శాస్త్రమందు నాల్గవ యధ్యాయము ముగిసెను.

---

పఞ్చమాధ్యాయ ప్రారమ్భః.

యామిన్యాం యోగకాలేతు య త్కార్యం యోగిభి ర్నరైః
త ద్వక్ష్యామి సమాసేన శృణుధ్వం మునిపుఙ్గవాః॥ ౧॥

తా॥ ఓమునిశ్రేష్ఠులారా! రాత్రి యోగకాలమందు యోగులచేఁ జేయఁదగినది యేదో యద్దానిని సంగ్రహముగాఁ జెప్పెద వినుఁడు. యోగమనఁగా ధ్యానము.

అధివృక్షప్రమాణేన దృశ్యమానే దివాకరే ।
విధాయ దేహశుద్ధించ వాసో విపరిధాయ చ॥ ౨॥

ప్రోక్షణాచమనే కృత్వా దద్యా దర్ఘ్యంచ పూర్వవత్ ।
ధ్యాయ న్నేవ పరం బ్రహ్మ యావ న్నక్షత్రదర్శనమ్ ॥

తా॥ సూర్యుఁడు, ఒకగొప్పవృక్షమంతయెత్తునకు రాఁగానే తాను దేహశుద్ధిని జేసికొని మడివస్త్రమును ధరించి శిరస్సున జలమును బ్రోక్షించుకొని యాచమించి మునుపటివలె సూర్యున కర్ఘ్యము నొసఁగి పరబ్రహ్మమును నక్షత్రములు గనఁబడునంతవఱకు ధ్యానించుచునే యుండవలయును.

జపే ద్బ్రహ్మ పవిత్రంవా మానసం మౌన మాస్థితః ।
అభిగమ్య యథాపూర్వ మర్చయిత్వా యథావిధి ॥ ౪॥

తా॥ మనస్సును బరిశుద్ధమునుగాఁ జేసికొని యెవరితోను మాటలాడక మును పటివలెఁ బరబ్రహ్మమందు మనస్సు నిలిపి యథావిధిగాఁ బూజించి పరబ్రహ్మమంత్రము ను జపింపవలయును.

సన్ధ్యయో రుభయోరపి కార్యా పూజా పరమపావనైః ।
త్రికాలం ద్రవ్యయోగేన తథా నైమిత్తికార్చనా ॥ ౫౪॥

మఱియుఁ బరిశుద్ధాన్తఃకరణము గలవారై ప్రాతస్సాయంకాలములయందుఁ బరమాత్మ నుద్దేశించి మానసపూజ చేయువలయును కాలత్రయమందును ద్రవ్యములతోఁ బూజింపవలయును, మఱియు నష్టైయేకాదశీవ్రతము మొదలగువానియందు నైమిత్తికపూజను జేయవలయును.

హుత్వా జప్త్వా తథా స్తుత్వా యోగం కుర్యా దతన్ద్రితః ।
పుష్పానులేపనైర్దివ్యై రర్ఘ్యపూర్వై ర్యథావిధి ॥ ౬॥

తా॥ అగ్నియందు వ్రేల్చఁదగినవస్తువులను వ్రేల్చి జపించి పొగడి దివ్యపుష్పములను దివ్యచన్దనమును,అర్ఘ్య మిచ్చినతరువాత యథావిధిగా సమర్పించి యెచ్చరికతోఁ బరమాత్మను ధ్యానింపవలయును.

భక్తిజ్ఞానక్రియావృద్ధి రయత్నేనైవ సిధ్యతి ।
నక్తం కుటుమ్బికోఽశ్నీయా ద్ధితం పథ్యం సుతృప్తిమత్ ॥ ౭॥

తా॥ కుటుమ్బవన్తుఁడురాత్రి హితంబును బథ్యంబునైనపదార్థమును నిత్యము తృప్తిగా భుజింపవలయును. అట్లు భుజించినయెడల భక్తియు జ్ఞానంబును గర్మానుష్ఠానంబునప్రయత్నముగానే సిద్ధించును.

సర్వంచ తిలసమ్బద్ధం దధిశాకంచ వర్జయేత్ ।
ముద్గసంబన్ధి సర్వంచ శుక్తం కాలాన్తరే భవేత్ ॥ ౮॥

తా॥ నూనెకలిసినపదార్థములును పెరుగుతోటకూరయును పెసరపప్పుతోఁ జేరినపదార్థములను భుజించుచుండినఁ దత్కాలమునం దేమియుం జేయకున్నను గొంతకాలమునకు శరీరమున కేదైనను వ్యాధిని గలుగఁ జేయును గావున దుఃఖకరములై యుండును గనుక వానిని విడువవలయును.

అపూపవర్జం తచ్చాపి వర్జ్యమేవ దినాన్తరే ।
శుష్కం పక్వం తథా వస్తు సఘృతంశాకమేవచ ॥ ౯॥

తా॥ అపూపముల నంతగా భుజింపఁగూడదు, బూర్వదినమందుఁ జేసినవానిని బొత్తిగా భుజింపనే కూడదు ఎండిపోయినయాహారము వండి భుజింపఁ గూడదు. నేతిబీర కాయ మొదలైన చచ్చురుగలశాకంబులను భుజింపఁగూడదు

పరిభూతంచ నిర్ణిక్తం నపర్యుషితదోషభాక్ ।
దధ్యన్నం పాయసాన్నంచ గుడాన్నంచ ఘృతౌదనమ్॥ ౧౦॥

తా॥ పెరుగన్నము పాయసము చక్కెరపొంగలి నేతియన్నము ఇవిబాగుగాఁ బక్వములై పరిశుద్ధము లైనయెడలఁ జల్దిదోషము గలవి గావు.

అపూపానిచ భర్జ్యాని నపర్యుషితదోషభాక్
తద్రూపేణ పునరపి పక్వం రసగన్ధాన్తరాన్వితమ్ ॥ ౧౧॥

తా॥ వేయింపఁబడిన యప్పడము మొదలైన యపూపములును మఱలఁ బక్వములై మునుపటి రసగన్ధములకంటె వేఱురసగన్ధములు గలవి యైనపక్షమునఁ జల్దిదోషము గలవి గావు

అన్యోపయుక్తశేషంచ వర్జ్యం స్యాద్ద్రవ్యవర్జితమ్ ।
భక్ష్యాపూపఫలాదీనాం గవ్యానామపి భోజనే ॥ ౧౨॥

తా॥ ఇతరులు భుజింపగా మిగిలిన యన్నమును భుజింపఁగూడదు. గోవుపాలు పెరుగు మొదలైన పదార్థము లట్లుకాదు. అనఁగా నన్యులుభుజింపఁగామిగిలినను భుజింపవచ్చును అట్లే భక్ష్యములు అపూపములు ఫలములు మొదలగుపదార్థములును ఆవు నెయ్యి పెరుగు పాలు గలిసినపదార్థములు నొకరు భుజింపఁగా మిగిలినను భుజింపఁదగినవి యగును

రోగోపఘాతసేవనస్యాత్పునర్భోజనదోషభాక్ ।
కాలయోగంచ కృత్వైవ భోజనం యోగమాచరేత్॥ ౧౩॥

తా॥ రోగప్రతిబన్ధము గలిగినపుడు మఱలమఱల భుజించినను దోషము లేదు. అయిన నప్పుడు కాలోచితముగా భుజించియే ధ్యానింపవలయును.

రాత్ర్యామజస్రయోగస్స న్యథాకామం సమాచరేత్ ।
భగవత్సన్నిధానేవా వివిక్తేఽన్యత్ర భూతలే ॥ ౧౪॥

తా॥ రాత్రియందు భగవత్సన్నిధియందైనను మఱియొకనిర్జనమందైనను నివసించి యెడతెగకుండఁ బరమాత్మను గనయిష్టప్రకారము ధ్యానింపవలయును.

యోగం కుర్యాత్సమాధాయ యథాస్థానాసనో వశీ।
ఉపలిప్తే శుచౌ దేశే కుశానాస్తీర్య భూతలే॥ ౧౫॥

తా॥ తగినచోటు తగినయాసనము గలవాఁడై జితేన్ద్రియుండై గోమయముతో నలికినపరిశుద్ధప్రదేశమందు దర్భలను బఱచుకొని కూర్చుండి మనస్సును సరిపఱచుకొని పరమాత్మను ధ్యానింపవలయును,

శుద్ధాసనం సమాధాయ వస్త్రేణాస్తృణుయాచ్చ తత్।
చీరం శుక్లీకృతం చర్మ మార్గం వేత్రకృతం తథా॥ ౧౬॥
అజీర్ణ మేకవర్ణంచ యోగే స్యాదాసనం దృఢమ్।

తా॥ పరిశుద్ధమైనయాసనమును సరిగావేసికొని దానిని వస్త్రముతోఁ గప్పవలయును ఆవస్త్రము తెల్లనినారమడిగా నుండవలయును ఆయాసనము జింకతోలుగానైనను, పేములతో నల్లినదిగానైన నుండవలయును అట్టియాసనము జీర్ణించినదిగా నుండఁగూడదు, ఒకరంగు గలదిగా నుండవలయును, గట్టిదిగా నుండవలయును. అట్టియాసనమునే యోగమం దుపయోగించుకొనవలయును యోగలక్షణ ముత్తరశ్లోకమునఁ జెప్పఁబడును.

ఈశ్వరః పరమాత్మాఽయం ప్రత్యగాత్మా తథేశ్వరః॥ ౧౭॥
తత్సంబన్ధానుసన్ధాన మితి యోగః ప్రకీర్తితః।
యోగో నామేన్ద్రియై ర్వశ్యై ర్బుద్ధే ర్బ్రహ్మణి సంస్థితిః॥ ౧౮

తా॥ పరమాత్మ యిట్టివాఁడు అట్లే యీప్రత్యగాత్మ యిట్టివాఁ డని ఆపరమాత్మప్రత్యగాత్మలసంబన్ధము ననుసన్ధించుటయు, ఇన్ద్రియములను వశపఱచుకొని బుద్ధిని బ్రహ్మమందు నిలుపుటయు ననది యోగమనఁబడును

సర్వేన్ద్రియైః ప్రయుక్తైర్వా భగవత్కర్మవిస్తరే।
అథ సజ్జ్ఞానినో జ్ఞానం యోగం కర్మ పృథక్పృథక్॥ ౧౯॥
వదన్తి నతథా జ్ఞేయం త్రయమేకం విదుర్బుధాః।
భిత్తివర్ణవియోగేన యథా చిత్రం నలభ్యతే॥ ౨౦॥
కర్మజ్ఞానం తథా యోగం వినా యోగో నలభ్యతే।
అజ్ఞాస్త్వేకాయనాచారం కర్మయోగం వదన్తిహి॥ ౨౧॥

తా॥ భగవన్ముఖోల్లాసకర మైనకర్మమును బూర్తిగాఁ జేయుటకై సర్వేన్ద్రియములను భగవత్తువియందు లగ్నము లగునట్లుపయోగింపవలయును. అట్లుపయోగింపఁబడినసర్వేన్ద్రియములచేతను గలిగెడిజ్ఞానమును యోగముగ నర్చింబును ఆభాసజ్ఞానముగలవారు అనఁగా సామాన్యులు వేఱువేఱుగాఁ జెప్పుచున్నారు గాని యట్లు తెలిసికొనఁగూడదు తెలిసినవారు మూఁటినొకదానినిగా ననఁగా యోగమునుగాఁ దెలిసికొనుచున్నారు, ఎలయనఁగా నొకగోడయందు రంగులు వ్రాయుటవలనఁ జిత్తరువు లభించుచున్నదిగాని గోడ రంగులు వీనిచేరిక లేనిమెడఁ జిత్రము లభింపదుగదా. అట్లేకర్మము జ్ఞానము వీనిచేరికగలిగినప్పుడే యోగములభించుచున్నదిగాని వానిచేరికలేకున్నయోగము లభింపదు గనుకఁ గర్మజ్ఞానములు వానిసంయోగము, యోగమని చెప్పవలయును. తెలియనివారు ఏకాయనాచారమైనకర్మమును యోగమనుచున్నారుగదాయన్ననో అట్లు జ్ఞానులుచెప్పరుగనుక నది సరిగాదని తెలిసికొనవలయును అట్లు త్తరశ్లోకమునఁ జెప్పఁబడును, భగవన్తుఁడొక్కఁడే లక్ష్యస్థానముగలయనుష్ఠానముగలది, యేకాయనాచారము

సమ్యగ్జ్ఞాన మిదం ప్రాజ్ఞా వద న్త్యచ్యుత యోగినః ।
యోగధర్మ ఇతిఖ్యాత స్సాత్త్వా ద్భాగవతో విధిః ॥ ౨౨॥

తా॥ యోగస్వరూపమును బాగుగానెఱింగినవారీమంచిజ్ఞానమును యోగమనిచెప్పుచున్నారు. ఇట్టియోగము ముఖ్యముగా భాగవతులకుఁ గావలసినవిధియని చెప్పఁబడినది

సర్వేన్ద్రియై రపి సదా యోగో యుజ్యత ఇత్యతః ।
అనుసన్ధానవిజ్ఞానయోగేన బ్రహ్మశాశ్వతమ్ ॥ ౨౩॥

తా॥ ఇది సర్వేన్ద్రియములతో నెప్పుడును జేరుచున్నదిగనుక యోగమనఁబడెను జీవాత్మపరమాత్మలసంబన్ధముల ననుసన్ధించుట జీవాత్మపరమాత్మజ్ఞానము వీనిసంబన్ధముచేత శాశ్వత మైనబ్రహ్మము పొందఁబడుచున్నది-

యథార్హ మిన్ద్రియై రాత్మా సేవ్యతే సత్క్రియాపరైః ।
బుద్ధిసంస్థం పరంజ్ఞానం బుద్ధ్వా బుధ్య[illegible] తత్పరమ్ ॥ ౨౪॥

G. R. VENCATACHAR, B.A., B.L.
HIGH COURT VAKIL,
24 Telugu Brahmans St.

తా॥ సత్కర్మంబుల ననుష్ఠించెడివారు తమయోగ్యతానుసారముగా నిన్ద్రియములతో నాత్మను సేవించుచున్నారు మఱియును బుద్ధియం దున్నట్టిదియు బుద్ధికిమాత్రమే గోచరమైనదియు సర్వోత్కృష్టంబును జ్ఞానరూపంబు నైనపరబ్రహ్మ[illegible]చున్నారు.

విశుద్ధైరిన్ద్రియైరేవ బోద్ధుం తచ్ఛక్యతేఽనయా ।
ఇన్ద్రియాణాం విశుద్ధత్వం భగవత్కర్మ యోజనాత్ ॥ ౨౫॥

తా॥ ఇట్టి బుద్ధితోఁగూడిన పరిశుద్ధేన్ద్రియములచేతనే యాపరబ్రహ్మము తెలిసి కొన శక్యమైనది. భగవన్ముఖోల్లాసకరము లైనకర్మములయందుఁ జేరుటవలన నిన్ద్రియములు పరిశుద్ధము లగుచున్నవి.

సర్వకర్మనివృత్తిర్యా దుర్లభా సా శరీరిణామ్ ।
అసద్విషయసంసర్గై రిన్ద్రియై ర్విహతా మతిః ॥ ౨౬॥

తా॥ శరీరధారులేకర్మంబులను జేసినను ఫలమును గోరక భగవన్ముఖోల్లాసార్థము చేయవలయునుగాని ఫలమును గోరి చేయఁగూడదు లోక మందట్లు చేయుట దుర్లభము. ఇన్ద్రియములు చెడ్డవిషయములతోఁ జేరుటవలనఁ జెడ్డవి యగుచున్నవి. అట్టిచెడ్డయిన్ద్రియములతోఁ జేరుటవలన బుద్ధి చెడిపోవుచున్నది.

నశక్నోతి పరం గన్తు మవిధేయాశ్వయానవత్ ।
భగవత్కర్మసంసక్తై రిన్ద్రియై ర్విమలా మతిః॥ ౨౭॥
ప్రయ్యాతి తత్పరం దీప్తైః పదార్థా నివ దృఙ్నిశి ।

తా॥ తనకణఁగని గుఱ్ఱముచేఁ దాను బోఁదలఁచినచోటి కెట్లుపొంద శక్తుఁడుగాఁడోయట్లు దుర్విషయములతోఁజేరిన స్వాధీనములుగానియిన్ద్రియములచేతఁ బరబ్రహ్మమును బొందశక్తుఁడుగాఁడు, కావున నిన్ద్రియములను జెడ్డవిషయములయందుఁబోనీయఁగూడదు-అట్లు పోనిచ్చిన నవి చెడును, చెడిన యాయిన్ద్రియములతోఁజేరిన బుద్ధి చెడును. అట్లు చెడకుండ నిన్ద్రియములను భగవన్ముఖోల్లాసకరము లైనకర్మములయందుఁ బ్రవర్తింపఁజేయవలయును, అట్లు చేసినయెడల భగవత్కర్మాసక్తము లైన యిన్ద్రియములచే బుద్ధి పరిశుద్ధమైయుండును ఆట్టిబుద్ధి భగవత్కర్మాసక్తేన్ద్రియములచేత, రాత్రి దీపములచే నేత్రేన్ద్రియముపదార్థములను దెలిసికొన్నట్లు ఆపరబ్రహ్మమును దెలిసికొనును

యథాఽచ్ఛిద్ర ఘటస్యాన్తః ప్రదీపే స్థాపితే నిశి ॥ ౨౮॥
జ్యోతిర్మయాని చ్ఛిద్రాణి తథా ద్వారాణి యోగినః ।
అజ్ఞానతమసాపూర్ణే హృదయే మూఢచేతసామ్॥ ౨౯॥

ద్వారాణ్యేవతమః పూర్ణాన్యకృత్వా న్యేవ కుర్వతే ।
సర్వథా యోగ ఏవాయ మేవ మేకాయనో మునిః ॥ 30॥

తా॥ యోగముగల రోమహర్షణా! చిల్లులకుండలో దీపముంచినప్పుడు తేజోమయములైన యారన్ధ్రద్వారములెట్లు ద్వారములేయగునో అనఁగా వస్తువులను దెలుపునవికావో యట్లు అజ్ఞానాన్ధకారముచే నిండిన మూఢులహృదయములో నున్న జ్ఞానేన్ద్రియము లజ్ఞానావృతములై యుండును అనఁగా నిట్లు కార్యము చేయవలయు ననెడిజ్ఞానము గలవిగావు గనుకఁ బాపకార్యములను జేయుచుండును. కావున నీయోగమిట్లు పాపనివర్తకమై సర్వవిధముల చేతను మననశీలమై పరబ్రహ్మప్రాప్తిసాధనమైయుండును.

మనసా కేవలం రాత్ర్యాం సంప్రీయేత న చాన్యథా ।
ఇన్ద్రియైరినికృతైస్తైర్హి మనో బ్రహ్మణి బధ్యతే ॥ 31॥

తా॥ ఇట్టి యోగముగలవానిమనస్సు నిర్వికారమగుటచే మిక్కిలియానన్దముగలదై యుండునుగాని యోగాభ్యాసముకంటె వేఱుమార్గముచేనట్టియానన్దముగలదిగాదు మఱియు నవ్వడిన్ద్రియములును నిర్వికారములై యుండునుగావున మనస్సు దుర్విషయములకు లోఁబడక బ్రహ్మమందు లగ్నమైయుండును.

న బధ్యతే త న్నిర్మూలం పారదద్రవ బిన్దువత్ ।
అస్థిరే మనసి స్రోతో విషయానే వధావతి ॥ 32॥

తా॥ ఆమనస్సు పాదరసపుబొట్టువలెఁ జఞ్చలమైనది. కావున నది పాదరసపుబొట్టు నీటివెల్లువమీఁదఁ బరుగెత్తినట్లు దుర్విషయములమీఁదికిఁబరుగెత్తును అట్లు పరుగెత్తకుండ మనస్సును, పాదరసమును దానిస్వరూపము మాఱునట్లు విఱిచి బన్ధించినవిధమున సంసారబన్ధమూలమైన యరిషడ్వర్గసంబన్ధము లేకుండునట్లుకట్టివేయ వలయును. అట్లు కట్టఁబడనియెడలఁ బాదరసము వెల్లువమీఁదికిఁ బోయినట్లుమనస్సు దుర్విషయములమీఁదికిఁ బోవును.

మన స్తదాహృతం ముగ్ధం రమతే తత్సమాధిభిః ।
నియోజ్యం సత్క్రియాస్వేవ స్వానిబద్ధం పరే మనః ॥ 33॥

తా॥ మనస్సు తెలివిలేనిదైనయెడల దుర్విషయములచే నీడువఁబడినదై దుర్విషయాసక్తిచే దుర్విషయములయందుఁ దగులుకొని యుండును కావున నట్లుగాకుండ వశపఱుచుకొని పరబ్రహ్మము నిమిత్తము సత్కర్మంబులయందే మనస్సును జేర్పవలయును

పరే-అథచో నిమిత్తార్థమందుసప్తమి నిమిత్తాత్కర్మయోగే-ఇది 'సప్తమ్యధికరణేచ' -౨-౩-౩౬-అను సూత్రమందలి వార్తికము చర్మణిద్వీపినంహన్తి, దన్తయోర్హన్తికుఞ్జరమ్వ చర్మమునిమిత్తము పులినిజంపుచున్నాఁడు దన్తములనిమిత్తము గజమును జంపుచున్నాఁడు ఇది యుదాహరణము పరబ్రహ్మప్రాప్తికై మనస్సును సత్కర్మములయందే చేర్పవలయు ననుట.

రమతే తత్పరే హ్యైవ స్వాధీనాత్మగణ స్సుఖమ్।
సమ్యక్సద్విషయేష్వేవ నియుక్తై రిన్ద్రియైర్మనః ॥ ౩౪॥

తా॥ అట్లు సత్కర్మములయందుఁ జేర్చుటచేతనే చక్షురాదీన్ద్రియములు సుఖముగానుండును. మఱియును సద్విషయములయందు బాగుగాఁజేర్పఁబడిన యిన్ద్రియములచేతనే మనస్సును సుఖముగానుండును.

బద్ధం బ్రహ్మణి కాలేన నిష్ఠితై రేవ తిష్ఠతి ।
యథాతు భగవత్పాదసరసీరుహయోర్మనః ॥ ౩౫॥

అట్లు చక్షురాదీన్ద్రియములు దుర్విషయాసక్తిలేక నియమముగలవిగా నుండిననే మనస్సు సత్కర్మములయందుఁ దగులుకొన్నదై స్థిరముగా నిలిచియుండును. అట్లే కాలక్రమముగా భగవత్పాదారవిన్దములయందును నిలిచియుండును. బ్రహ్మశబ్దమునకు నిచ్చట వేదమర్థము లక్షణచే వేదోక్తసత్కర్మము అర్థము

నిశ్చలం రమతేఽచ్ఛిద్ర కృతకృత్య స్తథాబుధః ।
అనిర్జితేన్ద్రియోఽసిద్ధో భగవద్యోగ ఏవసః ॥ ౩౬॥

తా॥ అట్లు మనస్సును భగవత్పాదారవిన్దములయందు నిశ్చలముగా నిలిపినవాఁడు జ్ఞానియై కృతార్థుఁడగును గనుక నిర్బాధముగా బ్రహ్మానన్దము నొందుచున్నాఁడు. వాఁడే భగవద్యోగముగలవాఁడు నగును జితేన్ద్రియుఁడు గానివాఁడు కృతార్థుఁడుగాఁడు గనుక వానికి బ్రహ్మానన్దంబు భగవద్యోగంబును లేవు

జహాతి భగవత్కర్మ పతితోయాతి రౌరవమ్ ।
"యోగోఽయమేవ యోగాచ్చ బాహ్యా యే నాధయోఽభవత్॥

తా॥ బాహ్యరోగములును మనోవ్యధలును,ఏకర్మయోగమువలనఁగలుగవో యట్టిదే కర్మయోగము. అట్టిభగవత్కర్మయోగమును విడిచినవాఁడు పతితుఁడై రౌరవనరకము నొందును.

సర్వం శరీరక్లేశాయ యేషు కృష్ణోన చిన్త్యతే।
ఉత్సృజ్య భగవత్కర్మ సంన్యాసే హతసంశయాః ॥ 3౮॥
నిష్ప్రయోజన దేహానాం తేషాం న సులభో హరిః।

తా॥ ఏకర్మయోగములయందుఁ గృష్ణుఁడు స్మరింపఁబడఁడో యట్టివారికర్మాను ష్ఠాన మంతయు శరీరాయాసమునకే యుపయోగించును. మఱియును భగవన్ముఖోల్లాసకర ములైన కర్మములనువిడిచి యట్టికర్మత్యాగమందు సందేహములేనివారెవరో యట్టివారిజన్మ ము వ్యర్థము అట్టివారికి శ్రియఃపతి సులభుఁడుగాఁడు

ఇన్ద్రియాణి ప్రవృత్తాని కర్మస్వితి నహీయతే ॥ 3౯॥
హీయతేఽసౌ తథా జ్ఞానీ నిషిద్ధే ష్వనృతో యథా ॥

తా॥ జ్ఞానభక్తి వైరాగ్యములు గలవాఁడై శాస్త్రనిషిద్ధకర్మంబులను విడిచి విహిత కర్మంబులను జేయువాఁడనుగ్రహింపఁబడినట్లు జ్ఞానభక్తివైరాగ్యములులేక కర్మంబులను జేయువాఁడు భగవన్తునిచే ననుగ్రహింపఁబడఁడు. హీయతే-ఓహాజ్ గతౌ - కర్మణిలట్ హీయతే-గమ్యతే-ప్రాప్యత ఇత్యర్థః

భగవన్తం సముద్దిశ్య తదేక శరణా నరాః॥ ౪౦॥
కదాచిన్న చ హీయన్తే కామ్య కర్మరతా అపి॥

తా॥ నారాయణుఁడొక్కఁడే రక్షకుఁడని తలంచి నారాయణు నుద్దేశించి యెవరు కర్మంబుల ననుష్ఠించుచున్నారో యట్టివారొకవేళ నైహికఫలమునుగోరినను భగవన్తునిచే ననుగ్రహింపఁబడుదురేకాని యొకానొకప్పుడును విడువఁబడరు హీయన్తే - ఓహాక్ - త్యాగే - కర్మణిలట్ - హీయన్తే త్యజ్యన్తే

ఉక్తం శ్రుతం స్మృతం దృష్టం స్పృష్టం రసితమేవతత్ ॥౪౧॥
అవశాద్యాతి తచ్చిత్త మిదం తస్మాద్వినర్జయేత్ ॥

తా॥ ఏకారణమువలన, చెప్పఁబడినదియు వినఁబడినదియు తలంపఁబడినదియు చూడఁబడినదియు తాకఁబడినదియు అనుభవింపఁబడినదియు అవశాత్తుగా, అనఁగా నున్న స్థితియుండి పోవుచున్నవో యాకారణమువలన నట్టి చిత్తమును,అనఁగా ధారణశక్తి లేని చిత్తమును విడువవలయును. అనఁగాఁ జెప్పఁబడినవని మొదలైనవి పూనికతో మన స్సున నిలుచునట్లు చేసికొనవలయును అట్లుచేసికొనుటచేతనే ఫలముగలదుగాని లేకున్న ఫలము లేదనుట

యథాయథా పరిచయం యత్రయత్ర కరోత్యయమ్ ॥ ౪౨॥
తథాతథా స తన్నిష్ఠో రమతే తత్రతత్రచ॥

తా॥ ఈజనుఁ డేయేవిధముగా నేయేచోటఁ బరిచయమును జేయుచున్నాఁడో యాయావిధముగా నయ్యెచోట దానియందే లగ్నమైనమనస్సుగలవాఁడై క్రీడించుచున్నాఁడు

అభాగవతభాగస్థా క్షీయతే వాసనా యథా । ౪౩॥
తథా యతేత పురుషో మనోవాక్కాయ కర్మభిః ।
సర్వత్ర మైత్రీం కుర్వీత వివాదం నాచరేత్క్వచిత్ ॥ ౪౪॥

తా॥ భగవద్భక్తులు గానివారి దిక్కునఁనున్న మనః ప్రవర్తన మెట్లు నశించునో యట్లు పురుషుఁడు మనోవాక్కాయ కర్మములచే యత్నింపవలయును మఱియు నందఱితోను మైత్రిచేయవలయును గాని యొకానొకప్పుడును గలహమును జేయఁగూడదు.

న నాసాచపలః కర్మీన జిహ్వాచపలో భవేత్ ।
అన్యేషా మిన్ద్రియాణాంచ చాపల్యం వర్జయేద్బుధః ॥ ౪౫॥

తా॥ ఇన్ద్రియములు విద్వాంసునిగూడ వశపఱుచుకొనునుగావునఁ దత్త్వము దెలిసినవాఁ డగుకర్మరుఁడు ముక్కు నాలుక మొదలగు సర్వేన్ద్రియముల చాపల్యమును విడువవలయును. అనఁగా శాస్త్రసంమతములుగాని స్రక్చన్దనవనితాదిభోగములయం దాశను విడువవలయుననుట.

నాన్యైర్వమతో ద్రుహ్యే న్నాన్యభక్తాన్ సమాశ్రయేత్ ।
అధీనం నోత్సృజేచ్ఛాస్త్రం నబ్రూయా దనృతం క్వచిత్ ॥౪౬॥

తా॥ ఇతరులు తన కవమానమును జేసినను వారికిఁ దాను ద్రోహమును జేయఁగూడదు. నారాయణునికంటె నితరులకు భక్తులైనవారిని సేవింపఁగూడదు. తనకు స్వాధీనమైన శాస్త్రమును విడువఁగూడదు. ఎప్పుడు నసత్యమును జెప్పఁగూడదు.

శపథం నాచరేత్పాదం సంస్పృశ్య గురుదేవయోః ।
వాచి కర్మణి చిత్తేచ సర్వదా యశ్శుచి ర్భవేత్ ॥ ౪౭॥
అతన్ద్రితశ్చ శాస్త్రార్థే యోగసిద్ధిం స గచ్ఛతి ।

తా॥ గురుపాదమును దేవపాదమును దాఁకి ఒట్టు పెట్టఁగూడదు. మఱియు నెవఁడెల్లప్పుడును మనోవాక్కాయకర్మశుద్ధియు, శాస్త్రార్థమందు జాగరూకతయును గలవాఁడగునో వాఁడు యోగసిద్ధిని బొందుచున్నాఁడు.

అనుల్బణాచ్ఛిద్రవాసా నియతాసన భోజనః ॥ ౭౯॥
అనుల్బణజనైర్యుక్తో యోగసిద్ధిం స గచ్ఛతి ॥

తా॥ సన్ననిదియు చినుగనిదియునైన వస్త్రమును ధరింపవలయును ఆసననియమము భోజననియమమును గలవాఁడై యుండవలయును గర్వింపనిజనులతోఁ గలిసిమెలసి యుండవలయును. అట్లుండువాఁ డెవఁడో వాఁడు యోగసిద్ధిని బొందుచున్నాఁడు

నక్తం నసంచరేద్యోగీ సంచరేద్యది దండధృత్ ॥ ౮౦॥
ససహాయ స్స్వవకాశే సంచరేత్కార్య గౌరవాత్ ॥

తా॥ యోగముగలవాఁడు రాత్రి సంచరింపఁగూడదు ఒకవేళ ముఖ్యమైనకార్యమునకై పోవలసినపక్షమునఁ జేతఁగొయ్యను బెట్టుకొని యొవనినైనను దోడుచేసికొని విశాలమైన వీధియందు నడిచిపోవలయును.

కూపంచ వృక్షమూలంచ సభావాసం రిపోర్గృహమ్ ॥ ౫౦॥
శూన్యాయతనమేవాపి నవిశేన్నక్త మఞ్జసా ॥

తా॥ రాత్రియందు బావి చెట్టుమొదలు సభాప్రదేశము శత్రునిగృహము పాడుపడినయిల్లు వీనియందు విచారింపక శీఘ్రముగాఁ బ్రవేశింపఁగూడదు

నక్తముచ్చైర్న వక్తవ్యం వివాదం నస్మరేద్బుధః ॥ ౫౧॥

తా॥ తెలిసినవాఁడు రాత్రియందు గట్టిగా మాటలాడఁగూడదు. కలహవార్తనుస్మరింపనుగూడదు,

నిష్ప్రదీపే నభుఞ్జీత విశేషాన్నిభృతే పునః ।
ప్రాగ్రాత్రే ర్యోగ మాస్థాయ భుక్త్వాచ మిత మత్వరః॥ ౫౨॥
ప్రోక్షితం సపవిత్రాద్భి రావిశేచ్ఛయనోత్తమమ్ ।
యావన్నిద్రా సమభ్యేతి తావచ్ఛ్రమనసా జపేత్ ॥ ౫౩॥

తా॥ దీపములేనియింట భుజింపఁగూడదు భుజించుచుండఁగా దీపమాఱిపోయిన పక్షమున శేషించిన యన్నమును బొత్తిగా భుజింపఁగూడదు రాత్రి మొదటి యామమందు భగవస్తుని ధ్యానించి మితముగా భుజించి కొంతసేపు భుక్తాయాసమును దీర్చికొని మెల్లగాఁ బడకదగ్గఱకుఁబోయి యాపడకను నీటిలో ముంచినదర్భలతోఁ బ్రోక్షించి దానిమీఁదఁ బ్రవేశింపవలయును నిద్రవచ్చునంతవఱకు మనస్సులో భగవన్మన్త్రమును జపింపవలయును

నిద్రాన్తరే ప్రబుద్ధస్స న్కీర్తయే ద్భగవద్గుణాన్ ।

తా॥ నిద్రామధ్యకాలమందు మెలఁకువ వచ్చినపక్షమున లేచికూర్చుండి భగవద్గుణములను గీర్తింపవలయును,

సువస్త్రవేషధరయా స్నాతయా శుద్ధచిత్తయా ॥ ౫౪॥
అరోగయా దయితయా స్వాయమేవం విధో విశేత్ ।

తా॥ గృహస్థు, స్నానముచేసి పరిశుద్ధశరీరముగలదై మంచివస్త్రమును మంచినగలను ధరించి మంచివేషముగలదై మనశ్శుద్ధిగలదై రోగములేని దైనభార్యతోఁగూడఁదాను నట్టిగుణములు గలవాఁడై పడకమీఁదఁ బ్రవేశింపవలయు

భాతుక్షయో రోగవృద్ధి రశ్రీ స్సత్కర్మవిప్లవః ॥ ౫౫॥
సౌభాగ్యాయు ర్యశోనాశః పుంసాం స్త్రీష్వతిసజ్గినామ్ ।

తా॥ స్త్రీలయం దతిసఙ్గముగలపురుషులకు, వీర్యనాశము రోగవృద్ధి ముఖమున వర్చస్సులేకుండుట సత్కర్మములకు విఘ్నము విరూపత్వము ఆయుర్నాశము కీర్తినాశమును ఇవి గలుగును.

గాయతాం భగవద్గాథాం కుర్వతాం స్తోత్ర ముచ్చకైః॥౫౬॥
శృణ్వ ఞ్ఛ్రోత్ర సుఖం నాదం నిద్రా మనుభవే ద్బుధః ।

తా॥ భగవత్కథలను గానముచేయువారియొక్కయు భగవస్తుని బాగుగా స్తోత్రముచేయువారియొక్కయు, శ్రోత్రసుఖకరమైననాదమును వినుచుఁ దెలిసినవాఁడు నిద్రననుభవింపవలయును.

స్వప్నేషుచైవ దృష్టేషు ప్రియాం భార్యాం గురుం తథా॥౫౭॥
వినా న కథయే త్స్వప్నమన్యేషాం స్వప్నమేవవా ।

తా॥ స్వప్నవృత్తాన్తమును ప్రియభార్యకును గురువునకును జెప్పవచ్చునుగాని యితరులకుఁ జెప్పఁగూడదు నాకు స్వప్నమైన దనియుం జెప్పఁగూడదు.

దుస్స్వప్నదర్శనే సద్య ఉత్థాయాఽమ్బు కృతక్రియః॥ ౫౮
ప్రణమ్య పాదయోర్దేవం జప్త్వా స్తోత్రాణి కీర్తయేత్।

తా॥ దుస్స్వప్నముం గన్నప్పు డప్పుడే లేచి జలముతోఁ గాలు సేతులు గడిగికొని నేత్రములను శుభ్రపఱుచుకొని భగవత్పాదారవిన్దములకు మ్రొక్కి భగవన్తుని స్తోత్రములను బఠింపవలయును.

దుస్స్వప్నానుగుణం ప్రాత స్స్నానదానార్చనాదిభిః ॥ ౫౯॥
కుర్యా ద్విశేషవ త్కర్మ యథా చిత్తం ప్రసీదతి।

తా॥ తాను గన్నదుస్స్వప్నమునకుఁ దగినట్లు ప్రాతఃకాలమందు స్నానముచేసి తిరువారాధనము దానము మొదలైన కర్మంబులను తనచిత్తము నిర్మలమగునట్లు విశేషముగాఁ జేయవలయును.

సుఖనిద్రారతః కాలే హస్తేత్యుత్థాయ సత్వరః ॥ ౬౦॥
ప్రక్షాళ్య పాదా వాచమ్య యుఞ్జీతాపి యథావిధి।
ఆద్యన్తవర్జం నిద్రాయా యోగ్యం యామద్వయం నిశి॥ ౬౧॥

తా॥ సుఖనిద్ర వలయునని కోరినవాఁడు స్మతసించి త్వరగలవాఁడై లేచి పాదప్రక్షాళనమును జేసికొని ఆచమనమునుజేసి యథావిధిగా భగవన్తునిధ్యానించి నిద్రింపవలయును మొదటిజాము కడపటిజాము విడిచి మిగిలినరెండుజాములకాలము నిద్రింపవలయును రాత్రియం దదియే నిద్రింపఁదగినకాలము

చతుర్థయామ ఉత్థాయ యోగీ యోగం సమాచరేత్।
సాక్షా త్పరమయోగస్తు ద్వాదశాక్షరవిద్యయా ॥ ౬౨॥

తా॥ నాల్గవజామున లేచి యోగశీలుఁడు యోగమును ( ధ్యానమును ) జేయవలయును ఆయోగము ద్వాదశాక్షరమన్త్రముతో సాక్షాత్తుగాఁ జేయవలయును. "ఓంనమోభగవతే వాసుదేవాయ" అనునది ద్వాదశాక్షరవిద్య యని పరశ్లోకములచే స్పష్టమగుచున్నది.

భగవద్వాసుదేవస్య పాదామ్బురుహచిన్తనమ్।
ఓమిత్యేకాక్షరం సాక్షా ద్వాసుదేవస్య వాచకమ్ ॥ ౬౩॥

తా॥ భగవన్తుండగు వాసుదేవునియొక్క పాదారవిన్దములను దలంచుటయే యుత్తమమైన యోగమగుటచేతను ఆద్వాదశాక్షరమన్త్రమందు మొదటిదైన "ఓమ్' అను నొక యక్షరము సాక్షాత్తుగా వాసుదేవుని జెప్పుచున్నది.

ఓమిత్యుచ్చారణేనైవ వాచ్యమనీయతే పరమ్।
ఓమిత్యానీయ తద్బ్రహ్మ నమస్కారపదేనతు॥ ౬౪॥
మదీయం మత్కమఙ్గంచ తవైవేతి నివేద్యచ।
అవ్యక్తార్థతయా తస్య ప్రణవస్య విశేషతః॥ ౬౫॥
తదర్థద్యోతనాయేదం భగవత్పద మీరితమ్।
అన్యత్రాపిచ తద్దృష్ట మిత్యనన్యపరం వచః॥ ౬౬॥

తా॥ కనుక నీమన్త్రమందు, "ఓమ్' అని యుచ్చరించుటచేతనే తద్వాచ్యమైన పరబ్రహ్మము స్మరింపఁబడెను ఇట్లు "ఓమ్"అని పరబ్రహ్మమును స్మరించి "నమః"అనుపదముచేత నాదియగు శరీరము నితరంబును నీదేయని తెలియఁజేసికొని ప్రణవార్థము గూఢముగానుండుటచే విశదముగా దానియర్థమును దెలుపుటకు నీభగవత్పదము అనఁగా ననన్యసాధారణమైన వాసుదేవత్వచిహ్నము "వాసుదేవాయ" అను పదముచేఁ జెప్పఁబడినదికావున నన్యమన్త్రములయందును ఆభగవత్పదము చేర్పఁబడియున్నదని యిది యితరదేవతావాచకంబు నగునని చెప్పఁగూడదు.

వాసుదేవేతి యదిద ముదితం తస్యచోపరి।
నమఃపదాత్పరం యత్స్యా దుపరిష్ఠం పదద్వయమ్॥ ౬౭॥
చతుర్థ్యన్త మభూన్నిత్యం యోగినాం యోగసిద్ధయే।
ఓంకారపదమప్యేకం యోగినాం యోగసిద్ధయే॥ ౬౮॥
ద్వాదశాక్షరరూపేణ పరిణామ ముపాగతమ్।

తా॥ వాసుదేవ, అనుపదము పూర్వోక్తమైన భగవచ్ఛబ్దమునకు మీఁదఁ జేర్పఁబడియును, నమః, అనుపదమునకుఁ బిమ్మటఁ జతుర్థ్యన్తములైన యీరెండుపదంబులను జేర్చి నమః పదమునకు మొదట నోంకారమును జేర్చినయెడల నది ద్వాదశాక్షరరూపముగాఁ బరిణమించిన మన్త్రమగును దానినెట్లు చెప్పవలయుననఁగా, ఓంనమో భగవతే వాసుదేవాయ, అని చెప్పవలయును. అది నిత్యము జపించినయోగులకు యోగసిద్ధినిగలిగించును ప్రత్యేకముగా నోంకారమును జపించిన నదియును యోగులకు యోగసిద్ధిని గలిగించును.

మన్త్రాన్తరే ష్వపి బుధా దేవతాన్తరభావిను ॥ ౧౯॥

ప్రయుఞ్జన్తే తమోంకారం మన్త్రాణాం ప్రాణసిద్ధయే।
మన్త్రాన్తరే ప్రయుక్తత్వా ద్దేవతాన్తరగోచరే ॥ ౨౦॥

అవ్యక్తార్థతయోంకారః కేవలైర్నైన సాధకః।
పక్వయోగ శరీరాణామేవం జ్ఞానవతామపి ॥ ౨౧॥

తా॥ ప్రాణములేని శరీరములెట్లు నిష్ప్రయోజనములో యట్లు ప్రణవముతోఁజేరని మన్త్రములు ప్రయోజనములేనివి. శరీరమునకు ప్రాణమువలె మన్త్రములకుఁబ్రణవము ప్రధానము, కావున దాని నితర దేవతాబోధకమన్త్రములయందును దెలిసినవారు చేర్చుకొనుచున్నారు అప్పుడితర దేవతా బోధకమునగునని సందేహము గలుగుచున్నదిగాని ప్రణవమునకప్పు డర్థము లేదు అయినను సిద్ధించిన కర్మయోగముగలవారికిని జ్ఞానయోగముగలవారికి నీప్రణవము మన్త్రపూర్తినిజేసి ఫలమునిచ్చుచున్నది

సమాపన్నేఽపి తజ్జ్ఞానే తన్మాత్రం నైవసాధనమ్।
అపక్వయోగజ్ఞానానా మపి వేదవిదాం నృణామ్ ॥ ౨౨॥

ద్వాదశాక్షరయోగేన దూరస్థం తదిహాన్తికే।

తా॥ ఆప్రణవార్థజ్ఞానము గలిగినను అదిమాత్రము సాధనము కాదు యోగముజ్ఞానము పక్వము కాకున్నను వేదార్థము నెఱిఁగిన వారికి ద్వాదశాక్షరమన్త్రానుసన్ధానముచే దూరమునందున్న సర్వేశ్వరుఁడు దగ్గఱకు వచ్చును.

స్మృతమాత్రే మహామన్త్రే సుసూక్ష్మే ద్వాదశాక్షరే। ౨౩॥
చిత్తదర్పణ సంక్రాన్త స్సుసుఖం లక్ష్యతే హరిః।

తా॥ మిక్కిలి సూక్ష్మమైనద్వాదశాక్షరమహామన్త్రమును స్మరించినంతమాత్రముచే శ్రీహరి వారి చిత్తమనెడి యద్దమందుఁ బ్రతిఫలించినవాఁడై సుఖముగా సేవింపఁబడుచున్నాఁడు. అనఁగా నామన్త్రముచే ధ్యానించువారిమనస్సు మురికిలేనియద్దమువలెఁ గామక్రోధాదిరూపమలములేక స్వచ్ఛమైయుండునుగావున నట్టిమనస్సునందు భగవన్తుఁడు దర్పణమునందుఁ బ్రతిబిమ్బమువలె స్పష్టముగాఁగనఁబడును.

అతశ్చ ద్వాదశార్ణేన స్వాధ్యాయేన జనార్దనః ॥ ౨౪॥
ఆసన్నతాం ప్రయాత్యాశు బ్రహ్మణ్యర్పిత చేతసామ్।

తా॥ కావునఁ బరిశుద్ధాన్తఃకరణముగలవారై బ్రహ్మము దామనస్సును నిలిపి ద్వాదశాక్షరమన్త్రముఁ జపింపవలయును వేదపారాయణమును జేయవలయును అట్లు చేసిన యెడల భగవన్తుఁడు శీఘ్రముగాఁ బ్రత్యక్షమగును

స్వాధ్యాయా ద్యోగ మాసీత యోగా త్స్వాధ్యాయ మామనేత్॥
స్వాధ్యాయయోగసంపత్త్యా పరమాత్మా ప్రకాశతే ।

తా॥ వేదపారాయణానన్తరము యోగమునుయోగానన్తరము వేదపారాయణమును ఇట్లెడతెగకుండఁ జేయుచుండవలయును అట్లు చేయుచుండినయెడల నారెంటికలిమి చేతను బరమాత్మ మనస్సునందుఁ జక్కఁగాఁ గనఁబడును

పఞ్చేన్ద్రియస్య మర్త్యస్య ఛిద్రదోత్యేక మిన్ద్రియమ్ ॥ ౭౬॥
తతోఽస్య స్రవతి ప్రజ్ఞా బుద్ధేః పాదా దివోదకమ్।

తా॥ త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడియైదుజ్ఞానేన్ద్రియములు మనుష్యులకుఁగలవు వానిలో నొకొక్కయిన్ద్రియము దుర్విషయాసక్తమై యేదైన నొకచెఱుపును గలిగించుచునే యుండునుగావున మంచిజ్ఞానము, పాదమునుండి జలమువలె బుద్ధినుండి తొలఁగి పోవుచున్నది.

యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ॥ ౭౭॥
బుద్ధిశ్చ నవిచేష్టేత తమాహుః పరమం హితమ్ ।

తా॥ అయిదు జ్ఞానేన్ద్రియంబులు నెప్పుడు మనస్సుతోఁగూడఁ జేరియుండునో యప్పుడు బుద్ధి నిశ్చేష్టమైయుండును అట్లుండుటయు బరమహితముగాఁ బెద్దలు చెప్పుచున్నారు

దేవానా మపి సర్వేషాం యథా నాథో జనార్దనః ॥ ౭౮॥
ద్వాదశాక్షరమన్త్రోయం మన్త్రాణాం నాథ ఉచ్యతే ।

తా॥ ఎల్లదేవతలకును జనార్దనుఁడెట్లు నాథుఁడో యట్లు మన్త్రములకన్నిటికిని ద్వాదశాక్షరమన్త్రము నాథమైనది. అనఁగా నన్నిమన్త్రములకంటె శ్రేష్ఠమైనదనుట

యథౌషధీనా మమృతం మణీనాం కౌస్తుభో యథా॥ ౭౯॥
సర్వేషా మపిధర్మాణాం శ్రేష్ఠో భాగవతో విధిః ।

తా॥ ఓషధుల కన్నిటికి నమృతమెట్లో మణులకన్నిటికిఁ గౌస్తుభమణియెట్లో అట్లు సర్వధర్మములకును భగవద్భక్తులసేవ శ్రేష్ఠమైనది

సర్వధర్మాన్ సముత్సృజ్య పఞ్చకాల్య మనువ్రతాః ॥  ౭౦॥
వ్యామిశ్రయాగనిర్ముక్తా గచ్ఛన్తి పురుషోత్తమమ్ ।

తా॥ ఇట్టి సర్వధర్మములను విడిచి యీశాస్త్రమందుఁ జెప్పఁబడిన యయిదుకాలములయందును జేయందగిన ధర్మముల ననుష్ఠించువారెవరో దేవతాన్తరపూజను విడిచిన వారెవరో వారు పురుషోత్తమసాక్షాత్కారము నొందుచున్నారు

వ్యామిశ్రయాజినాం బ్రహ్మపావార్పితసువృత్తినామ్ ॥  ౭౧॥
యతతా మపివా నిత్యం పద మేషాం పరంస్థితమ్।

తా॥ ఎవరు తమచిత్తవృత్తిని భగవత్పాదారవిన్దములయందు బాగుగా నిలిపి కర్మజ్ఞానములచే భగవన్తుని ధ్యానించుచు మోక్షమునకు యత్నించుచున్నముముక్షువు లెవరో వారికిఁ బరమపదము సిద్ధమైయుండును సువృత్తినామ్ అనుచో దీర్ఘాభావమార్షము.

అకర్మ కర్మచైవస్యాత్ జ్ఞానంయత్కర్మ సంభవేత్ ॥  ౭౨॥
కర్మయోగ స్తథాచస్యా ద్యోగః కర్మ పర స్తథా ।
నాస్మా త్పరమకం శాస్త్రం నాస్మా త్కర్మ పరం తథా॥ ౭౩॥

తా॥ ఈశాస్త్రమందుఁ జెప్పఁబడిన కర్మమేదో యది కర్మాభావమునకును అనఁగా మఱల నీలోకమందుఁబుట్టి కర్మము చేయకుండుటకును బ్రహ్మజ్ఞానమునకును యోగమునకును గారణమైనదిగావునఁ గర్మము సర్వోత్కృష్టమైనది కనుక నీశాస్త్రముకంటె నుత్తమ శాస్త్రములేదు, ఈశాస్త్రమందుఁజెప్పఁబడినకర్మముకంటె నుత్తమమైన కర్మంబునులేదు

నాస్మా త్పరమకం శాస్త్రం నాస్మా త్పరమకం సుఖమ్ ।
ఋగ్యజుస్సామసంజ్ఞేషు వేదశబ్దః ప్రయుజ్యతే ॥  ౭౪॥
ఇదం సదాగమాఖ్యంతు వేదశాస్త్రసమీరితమ్ !
ఇతిసంక్షేపతః ప్రోక్త స్సదాచారో యథాగమమ్ ॥  ౭౫॥
తథా శాస్త్రస్య మాహాత్మ్యం విశేష శ్చైకయాజినామ్ ।

తా॥ మఱియును ఋగ్యజుస్సామము లనెడిపేళ్లు గలశబ్దసమూహములయం దేవేవశబ్దము ప్రయోగింపఁబడుచున్నదోయట్టి వేదమునకును మన్వాదిధర్మశాస్త్రములకును ఈశాస్త్రము సంమతమైయున్నది. మఱియును శిష్టాచారంబును దీనియందు నితరధర్మశా

స్త్రముల ననుసరించి సంగ్రహముగా జెప్పఁబడినది. గావుననీశాస్త్రముకంటె నుత్తమమైన ధర్మశాస్త్రములేదు. ఈశాస్త్రమందుఁ జెప్పఁబడినయాచారముల ననుష్ఠించుటచేఁ గలుగు నట్టిసుఖముకంటె నుత్తమమైన సుఖంబును లేదు. శ్రీమన్నారాయణు నొకనినే నమ్మి పూజించుభాగవతుల మాహాత్మ్యమెట్లు సర్వోత్కృష్టమైనదో యట్లీశాస్త్రమాహాత్మ్యంబును సర్వాధికముగాఁ నున్నది

ఇదంశాస్త్రి మధీయానో బ్రాహ్మణో భగవత్పరః । ౮౬॥
శ్రియం యశశ్చ విపులం పరమాయు రవాప్నుయాత్॥౮౬౪॥

ఇతి శ్రీశాణ్డిల్యస్మృతౌ విశిష్టపరమధర్మశాస్త్రే
పఞ్చమోఽధ్యాయ స్సమాప్తః

తా॥ భగవద్భక్తిగలవాఁడై యేబ్రాహ్మణుఁడీ శాస్త్రమును జదువునో యతఁడు సిరిని దిగన్తవిశ్రాన్తమైన కీర్తిని బొంది చిరకాలము జీవించియుండును

దీనియందుఁ గార్యకారణముల కభేదోపచారము చెప్పఁబడెను.

ఇట్లు శాండిల్యవిశిష్టపరమ ధర్మశాస్త్రమునందు నైదవయధ్యాయము ముగిసెను

సంపూర్ణము,



శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాన్త
ప్రవర్తన ధురీణరాన

శ్రీమాన్ - ముశరపాక్కమ్ - అనన్తాచార్యర్ స్వామి

అరుళిచ్చెయ్త

# శరణశబ్దార్థవిచారమ్

(•o)

తర్కతీర్థరాన-శ్రీమాన్-శిఙ్గప్పెరుమాళ్ కోవిల్
మాడభూషి - రామానుజాచార్యరాలుమ్,
శ్రీమాన్-తిరుమళిశై-వఙ్గీపురమ్-తిరుమలాచార్యరాలుమ్
శ్రీమాన్-కరాలపాటి-అళ్వారయ్య అవర్కళాలుమ్,
పరిశోధిప్పిక్కప్పట్టు,

శ్రీవైష్ణవగ్రన్థ ముద్రాపక సభైయారాల్
శ్రీపరాఙ్కుశ తిరువవతారాది ౫౦౦౮-వతు సంవత్సరమాన
పరాభవ సంవత్సరత్తిల్

చెన్నపట్టణమ్
ప్రెసిడెన్సి ముద్రాక్షరశాలైయిల్
అచ్చిట్టు ప్రచురమ్ శెయ్యప్పట్టతు.
విజయ త్రేతరామ్.

# శ్రీవైష్ణవ గ్రన్థ ముద్రాపక సభ (లిమిటెడ్).

## ఈ సభలో తెనుఁగులిపిలో నచ్చువేసిన గ్రన్థములు.



| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| తనిశ్లోకమ్ సవ్యాఖ్యానము ప్రతిపదతాత్పర్యసహితము. | ... | ౩ | ౪ | ౦ |
| భారతాదితనిశ్లోకమ్ ,, ,, | ... | ౦ | ౫ | ౦ |
| రామచరమశ్లోకమ్ ,, | ... | ౦ | ౩ | ౬ |
| దుష్కరశ్లోకటిప్పణి | ... | ౦ | ౫ | ౦ |
| శాణ్డిల్యవిశిష్ట పరమధర్మశాస్త్రము తాత్పర్యసహితము | ... | ౧ | ౨ | ౦ |
| ముతల్ తిరువన్దాతి సవ్యాఖ్యానము అరుమ్బద ప్రతిపదసహితము | .. | ౧ | ౩ | ౦ |
| ఇరణ్డామ్‌తిరువన్దాతి ,, ,, | .. | ౦ | ౧౨ | ౦ |
| మూన్ఱామ్‌తిరువన్దాతి ,, ,, | ... | ౦ | ౧౨ | ౦ |
| నాన్ముకన్ తిరువన్దాతి ,, ,, | ... | ౦ | ౧౪ | ౦ |
| తిరువిరుత్తమ్ వ్యాఖ్యానద్వయసహితము ఉరై ప్రతిపద తాత్పర్యసహితము. | ... | ౪ | ౭ | ౦ |
| తిరువాశిరియమ్ సవ్యాఖ్యానము అరుమ్బద సహితము-ప్రతిపద తాత్పర్యసహితము | ... | ౦ | ౬ | ౦ |
| పెరియతిరువన్దాతి ,, అరుమ్బద ప్రతిపదసహితము | ... | ౦ | ౧౪ | ౦ |
| తిరువెழுకూత్ తిరుక్కై ,, ,, | ... | ౦ | ౪ | ౦ |
| శిఱియతిరుమడల్ ,, ,, | .. | ౦ | ౮ | ౬ |
| పెరియతిరుమడల్ ,, ,, | ... | ౦ | ౧౫ | ౦ |
| శ్రీవచనభూషణమ్ ,, | ... | ౩ | ౮ | ౦ |
| శరణాగతి విచారమ్ | ... | ౦ | ౪ | ౦ |
| ప్రపత్త్యనుపాయత్వవిచారమ్ | ... | ౦ | ౧ | ౬ |
| నామమాత్మాభావ్యమ్. | .. | ౦ | ౪ | ౬ |

ఈ గ్రన్థములు మట్టకాకితములలో సగము వెలకు నివ్వఁబడును.

యమకరత్నాకరమును ఇరామానుశనూత్తన్దాతియు అచ్చగుచున్నవి.

శ్రీవచనభూషణము నీసభ చందాదారులచే శిపార్సు చేయఁబడువారికిమాత్రము ౨౦౦ కాపీలవఱకు సగం వెలకు నివ్వఁబడును. అనఁగా గ్లేసు రూ. ౧-౭-౦ చొప్పునను రఫ్ఫు రూ. ౧-౦-౦ చొప్పునను నివ్వఁబడును.

ఇట్లు

కరాలపాటి - ఆళ్వారయ్య,

కార్యదర్శి, ధనాధికారి.

నెం ౩౧- వెంకటాచల మొదలి వీధి, చెన్నపట్టణము.





శ్రీమతే రామానుజాయ నమః.

# శరణశబ్దార్థవిచారః



ఆచార్యం వేఙ్కటార్యం పరమగురుమథాచార్యవర్యానశేషాన్
సౌమ్యంజామాతృసూరిం భువనగురువరం భట్టరామానుజార్యౌ ।
శ్రీమన్తంయామునార్యం తదను మునివరం నాథసంజ్ఞం శఠారిం
సేనేశ శ్రీ తదీశా ననవరతమహం చేతసా చిన్తయామి॥ ౧॥

శ్రుత్వా జగద్దేశిక సంప్రదాయం బుద్ధ్వాచ వేదాన్త గురోః ప్రబన్ధాన్ ।
శ్రీద్వయాఖ్యఖణ్డేశరణాఖ్యశబ్దే విచార్యతేऽర్థో విదుషాంముదేऽద్య॥ ౨॥

తత్రభవన్తో లోకాచార్యాః ముముక్షుప్పడి సమాఖ్యానే రహస్యత్రయవ్యాఖ్యానే ద్వయస్థ శరణశబ్దమ్, (౧) "ఇష్టప్రాప్తిక్కు మనిష్టనివారణత్తుక్కుమ్ తప్పాతఉపాయమాక" ఇతివ్యాచఖ్యుః. తత్రవిచార్యతే - కిమత్ర శరణ శబ్దప్రవృత్తినిమిత్తతయాऽభిప్రేత ముపాయత్వమ్;—న తావద్రక్షకత్వమ్,(౨) "ఉపాయేగృహరక్షిత్రోశ్శబ్దశ్శరణమిత్యయమ్" ఇత్యాద్యహిర్బుధ్న్యసంహితావచనేన రక్షకత్వ ప్రవృత్తి

(౧) ముముక్షుప్పడి-౨-౩౪. (౨) పాఞ్చ-అహిర్బు-

నిమిత్తకతాంవ్యాదస్య ఉపాయత్వప్రవృత్తి నిమిత్తకతావ్యవస్థాప నాత్; వ్యాఖ్యాతఞ్చ శ్రీమద్రమ్యజామాతృమునిచరణైః- (౧) «ఉపాయేగృహారక్షిత్రోశ్శబ్దశ్శరణమిత్యయమ్। వర్తతేసాంప్రతంచైవ ఉపాయార్థైకవాచకః' ఎన్గిఱపడియే శరణశబ్దమ్ రక్షితావుక్కుమ్ గృహత్తుక్కుమ్ ఉపాయత్తుక్కుమ్ వాచకమేయాకిలుమ్ ఇవ్విడత్తిల్ ఉపాయత్తుక్కే వాచకమాకైయాలుమ్, ఉపాయకృత్యమ్ ఇష్టానిష్టప్రాప్తి పరిహారకరణమాకైయాలుమ్, «ఇష్టప్రాప్తిక్కుమ్ అనిష్టనివారణత్తుక్కుమ్ తప్పాత ఉపాయమాక' ఎన్ఱు ఇప్పదత్తుక్కర్థ మరుళిచ్చెయ్కిఱార్'' ఇతి, వ్యాఖ్యాతఞ్చాఽఽచార్య చరణైరేవ చరమశ్లోకాధికారే- (౨) «ఇన్ద శరణశబ్దమ్ రక్షితావైయుమ్ గృహత్తైయు ముపాయత్తైయుమ్ కాట్టక్కడవతేయాకిలుమ్ ఇవ్విడత్తిలుపాయత్తైయేకాట్టుకిఱతు'' ఇతి. నచతత్ర చరమశ్లోకస్థ శరణశబ్దఏవ వ్యాఖ్యాత ఇతివాచ్యమ్;- విధ్యనుష్ఠానయోరైకరూప్యాత్ ద్వయస్థశరణశబ్దస్యాపి తత్సమానార్థతాయా ఆవశ్యకత్వాత్, అన్యథా వివరణ వివరణిభావస్యాప్యసిద్ధి ప్రసఙ్గాత్.

ఉపాత్తవచనస్యచాఽయమర్థః - శరణమిత్యయంశబ్దః ఉపాయే గృహే రక్షితరి స్వప్రవృత్తి నిమిత్తభూత ఉపాయత్వ గృహత్వ రక్షకత్వవత్తాసంబన్ధేనవర్తతే - ఉపాయత్వ గృహత్వ రక్షకత్వ ప్రవృత్తి నిమిత్తకఇతిభావః. సాంప్రతమ్ - అస్మిన్స్థలే, ద్వయఇత్యర్థః, యద్యపి ఇదానీంశబ్దపర్యాయస్య సాంప్రతమిత్యస్య బుద్ధిస్థకాలవిశేష పరత్వమేవ, తథాఽపి ద్వయోచ్చారణ కాలస్యైవ బుద్ధిస్థతయాఽభిప్రేతత్వాత్ యథోక్తపవార్థః - చస్త్వర్థే; ద్వయఘటకస్త్విత్యర్థః; సాంప్రతస్త్వేవ ఇతిపాఠేతు స్పష్టోఽర్థః. తేన, (3) «ప్రణాయతేహి కపోతేన శత్రుశ్శరణమాగతః''(౪) «త్వమనాదిరనిర్దేశ్య స్త్వామహం

(౧) ముముక్షుప్పడి-౨-3౪-వ్యాఖ్యానమ్. (౨) ముముక్షుప్పడి-3-౫౬. (3) రా యు-౧౮-౨౪. (౪)

శరణంగతః''(౧) ''సర్వాత్మనాయశ్శరణం శరణ్యాం నారాయణం లోక
గురుం ప్రపన్నః'' ఇత్యాదిషు శరణశబ్దస్య వ్యావృత్తిః. ఉపాయశబ్దః-
ఉపాయత్వపరః ; ఉపాయార్థైకస్యవాచకఇతి షష్ఠీతత్పురుషః ; ఉపా
యార్థైకస్య - ఉపాయత్వరూపైకార్థస్య; వాచకశబ్దః-శక్యతానిరూపక
పరః , షష్ఠ్యర్థశ్చ - అవచ్ఛిన్నత్వమ్; తస్యవాచకపదార్థైకదేశే శక్య
తాయా మన్వయః;ససంబన్ధికస్థలేభేదసంబన్ధేనఏకదేశాన్వయస్య వ్యుత్ప
త్తిసిద్ధత్వాత్ ; తత్స్వరూపే పూర్వపదలక్షణాపక్షే, ఉపాయార్థైకశబ్దస్య
ఉపాయత్వరూపైకార్థావచ్ఛిన్నేలక్షణా,తస్యచవ్యుత్పత్తి వైచిత్ర్యేణ
పదార్థైకదేశేపి శక్యతాయా మభేదసంబన్ధేనాఽన్వయః ; ''చైత్ర
దాసః''ఇత్యాది ససంబన్ధికసమాసస్థలే తథావిధవ్యుత్పత్తి స్వీకారాత్.
ఏకపదార్థతావచ్ఛేదకైకత్వఞ్చ - స్వానాశ్రయధర్మావచ్ఛిన్నశక్యతా
నిరూపకత్వసంబన్ధావచ్ఛిన్న స్వనిష్ఠప్రతియోగితాకాభావవత్వ సంబ
న్ధేన ధర్మిపారతన్త్ర్యేణ ఏతచ్ఛబ్దార్థే శరణశబ్దేఽస్తీతి. తథాచ- ఉపా
యత్వరూపైకత్వ విశిష్టార్థావచ్ఛిన్న శక్యతానిరూపకః, స్వానాశ్రయ
ధర్మావచ్ఛిన్న శక్యతానిరూపకత్వ సంబన్ధావచ్ఛిన్న స్వనిష్ఠప్రతియోగి
తాకాబావవత్వసంబన్ధేన తదేకత్వ విశిష్ట శ్శరణశబ్ద ఇతిబోధః. స్వసజా
తీయనిష్ఠభేద ప్రతియోగితావచ్ఛేదకైకత్వ వాచకపదస్య తథా వ్యు
త్పత్తేః అతఏవ- (౨) ''పశునాయజేత''ఇత్యాదౌ, అనేకపశుకరణక
యాగాదపూర్వోత్పత్తి వారణాయ పశునేత్యేకవచనార్థైకత్వస్య-స్వా
నాశ్రయ పశుకరణకత్వ సంబన్ధావచ్ఛిన్న స్వనిష్ఠప్రతియోగితాకాభావ
వత్వసంబన్ధేన యజిధాత్వర్థయాగేఽన్వయ స్స్వీకృతః. యథాశ్రుతే,
చైత్రకర్తృకైకపశుకరణకయాగీయపశునిష్ఠ భేద ప్రతియోగితావ
చ్ఛేదకత్వాన్మైత్రయాగీయ పశ్వేకత్వస్య ; ఏవంమైత్రయాగీయ పశ్వే

---

(౧) భార-   (౨)

కత్వస్యాఽసితధాత్వాత్, కస్యాఽప్యేకత్వస్య స్వసజాతీయ నిష్ఠభేద ప్రతియోగితావచ్ఛేదకత్వాభావేన బాధాపత్తేః. ఏవఞ్చ రక్షకత్వోపాయత్వయోరేకత్వే "గృహరక్షిత్రోః" ఇతి పృథగుపాదానస్య, ప్రసక్తరక్షకత్వ గృహత్వ ప్రవృత్తినిమిత్తకతావ్యుదసనాయ ఉక్తసంబన్ధేనైకత్వబోధ తాత్పర్యకైకశబ్దస్యచాఽసాఙ్గత్యం దుర్వారమేవ.

యద్యపి నానార్థకశబ్దస్య ప్రకరణాదినా ఏకార్థతాత్పర్యకత్వేఽపి నానాప్రవృత్తి నిమిత్తనిషేధో నోపపద్యతే, తథాపి, నానార్థకస్థలే ప్రాకరణికార్థస్యైవ శక్త్యాభానమ్, అన్యస్యతు శబ్దశక్తిమూలవ్యఞ్జనయైవేత్యాలఙ్కారికరీత్యా శ్రయణేనాఽదోషః. తదుక్తం కావ్యప్రకాశికాయామ్, (౧) "అనేకార్థస్య శబ్దస్య వాచకత్వేనియన్త్రితే । సంయోగాద్యైరవాచ్యార్థ ధీకృద్వ్యాపృతి రఞ్జనమ్" ఇతి. అఞ్జనమ్-వ్యఞ్జనమ్, వ్యఞ్జనావృత్తి రితిపర్యవసితార్థః వస్తుతస్తు - ఉపాత్తవచనే వాచక శబ్దస్య శాబ్దబోధేచ్ఛాప్రయుక్తే లక్షణా, శాబ్దబోధేచ - ఉపాయత్వరూపైకత్వ విశిష్టార్థస్య స్వావచ్ఛిన్న విషయతాకత్వసంబన్ధేనాన్వయః; ఏకత్వస్యపూర్వోక్తరీత్యా ధర్మిపారతన్త్ర్యేణస్వానాశ్రయధర్మావచ్ఛిన్న విషయతాశాలిశాబ్ద బోధేచ్ఛాప్రయుక్తత్వ సంబన్ధావచ్ఛిన్న స్వనిష్ఠ ప్రతియోగితాకాభావవత్త్వ సంబన్ధేన శరణశబ్దేఽన్వయ ఇతి నకిఞ్చిదనుపపన్నమ్

నచ - ఉపాత్తవచనేన ద్వయస్థశరణశబ్దో నవ్యాఖ్యాతః, కిన్తు- (౨) "ఇదంశరణమజ్ఞానామ్" ఇతివచనస్థశరణశబ్దఏవ వ్యాఖ్యాతః, తత్ర హి-(3) "ఉపాయాపాయనిర్ముక్తా మధ్యమాంస్థితి మాస్థితా। శరణాగతిరగ్ర్యైషా సంసారార్ణవతారణీ" ఇతి పూర్వప్రస్తుతా శరణాగతిఃఇదం శబ్దేన పరామృశ్యతే, శరణశబ్ద ప్రధానత్వాన్నపుంసకత్వమ్, శరణాగతేశ్చ - భగవత్ప్రీనాదాత్మకాఽ దృష్టద్వారక ఫలసాధనతారూప కరణత్వాత్మక ముపాయత్వం సంభవతి, నతుగృహత్వం రక్షకత్వంవా,

(౧) కావ్యప్రకాశికాసూత్రే-౧౯. (3) లక్ష్మీతన్త్రే-
(౨) లక్ష్మీతన్త్రే-

అతోఽరక్షకత్వ ప్రవృత్తి నిమిత్తకతావ్యుదసన పూర్వకోపాయత్వ ప్రవృత్తి నిమిత్తకతావ్యవస్థాపనం సఙ్గచ్ఛత ఇతివాచ్యమ్,- "ఇదంశరణమ్" ఇత్యాదివచనస్య లక్ష్మీతన్త్రసంహితాస్థత్వాత్, "ఉపాయేగృహరక్షిత్రోః" ఇత్యాదివచనస్యాఽహిర్బుధ్న్య సంహితాస్థత్వేన తత్రశరణాగతి విషయశరణశబ్దాదర్శనాత్, శరణాగతౌ గృహత్వ రక్షకత్వయోర్బాధాదేవ శరణాగతివిషయ శరణశబ్దే గృహత్వరక్షకత్వార్థకతా ప్రసక్త్యభావేన, "ఉపాయార్థైకవాచకః" ఇత్యస్యాఽప్రసక్త ప్రతిషేధత్వాపత్తేశ్చ ; భగవతితు సర్వాధారత్వేన, ఆవాసత్వాపరపర్యాయగృహత్వస్య ఫలప్రదత్వేన రక్షకత్వస్యచ సంభవాత్ తద్విషయక శరణశబ్దే తదర్థకతానిషేధోఽయుక్తః.

నను - నిరపేక్షరక్షకత్వ ముపాయత్వమ్, సంభవతిచ భగవతి నిరపేక్షరక్షకత్వమ్ ; అన్యత్ర ప్రపత్త్యఙ్గకేనోపాసనేన దేయస్య ఫలస్యాఽకిఞ్చనవిషయే ప్రపత్తిమాత్రేణ ప్రదాతృత్వేన గురుభూతోపాసననిరపేక్షత్వాత్ ; ఏతదభిప్రాయేణైవ "ఉపాయేగృహరక్షిత్రోః" ఇత్యాది నిష్కర్షకవచనమ్, నైరపేక్ష్యానవచ్ఛిన్న రక్షకత్వార్థకతాం వ్యుదస్య తదవచ్ఛిన్నాశ్రితరక్షకత్వార్థకతా వ్యవస్థాపనపరత్వాత్. యద్యపి నిరపేక్ష రక్షకత్వస్య కేవలరక్షకత్వస్యచ భేదాభావేన "ఉపాయార్థైకవాచకః" ఇత్యనేన కేవలరక్షకత్వార్థకతానిషేధో నోపపద్యతే,- తథాపి, నిరపేక్షరక్షకత్వావచ్ఛిన్నాఽవిషయక ప్రతీతివిషయతావచ్ఛేదక రక్షకత్వరూప పారిభాషికభేదస్య విద్యమానతయా, తదభిప్రాయేణ వచనముపపన్న మితిచేన్న ;—నిరపేక్షరక్షకత్వమ్, కిముపాయశబ్దశక్యతావచ్ఛేదకమ్, ఉత లక్ష్యతావచ్ఛేదకమ్, ఆద్యే - యాగాదా భక్త్యాచ ఉపాయశబ్దప్రయోగానుపపత్తిః, తేషామచేతనత్వేన రక్షకత్వాసంభవాత్, తదర్థం శక్త్యన్తరకల్పనే గౌరవమ్, ప్రమాణాభావశ్చ. కిఞ్చ - నిరపేక్షరక్షకత్వమ్ - భక్తినిరపేక్ష రక్షకత్వమ్, ప్రపత్తినిరపేక్ష రక్షకత్వమ్, ఉభయనిరపేక్ష రక్షకత్వమ్, గురూపాయనిర

క్షేపరక్షకత్వమ్, ప్రపత్తి వ్యతిరిక్తోపాయనిరపేక్షరక్షకత్వం వా,— నాద్యః - జ్యోతిష్టోమాదిస్థలే గోప్తురుపాయత్వాపత్తేః. నద్వితీయః- భక్తిస్థలేఽపి గోప్తుస్తథాత్వప్రసఙ్గాత్. తృతీయే - ఉభయనిరపేక్షత్వమ్- ఉభయాభావరూపం, అభావద్వయరూపం వా,— నాఽద్యః- ఉక్తదోషానిస్తారాత్, నద్వితీయః - జ్యోతిష్టోమాదిస్థలేఽతివ్యాప్తేః, ప్రపత్తిస్థలే తదసిద్ధ్యాఽసంభవాచ్చ. నచతుర్థః- ద్వాదశవార్షికాద్యశక్తప్రతి సేతుస్నానేన ఫలదాతురుపాయత్వప్రసఙ్గాత్. నపఞ్చమః- స్వవ్యతిరిక్తోపాయనిరపేక్షరక్షకత్వస్య సర్వోపాయ(అనుష్ఠాతృ)సాధారణతయా ప్రపత్తిస్థలే తస్య విశిష్యోక్త్యా వైలక్షణ్యాభావాత్. నప్రథమకల్పే ద్వితీయః- (౧) "త్వమేవోపాయభూతో మే" (౨) "తదేకోపాయతాయాచ్ఞా" (౩) "అహంమత్ప్రాప్త్యుపాయో వై" (౪) "ఉపాయోపేయత్వే తదిహ తవ తత్త్వమ్" ఇత్యాదిషు బహూనా ముపాయ శబ్దానాం గౌణత్వప్రసఙ్గాత్.

కిఞ్చ - ఉపాయత్వం రక్షకత్వమిత్యేతత్ పరికరవిభాగాధికారవిరుద్ధమ్, తత్రహి - (౫) "ఉపాయమెన్ఱాల్ ఒరువిరకెన్ఱ మాత్రమాకైయాలే ఇవ్వుపాయమ్ చేతనాచేతనసాధారణమాకైయాలుమ్, (౬) 'రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా' (౭) 'ససర్వజ్ఞోఽపి విశ్వేశస్సదా కారుణికోఽపి సన్। సంసారతన్త్రవాహిత్వా ద్రక్షాపేక్షాం ప్రతీక్షతే' ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే చేతనైకాన్తమాన గోప్తృత్వమనుసన్ధేయమాకైయాలుమ్ గోప్తృత్వవరణమివ్విడత్తిలే వివక్షితమ్ ; అతిల్ శరణశబ్ద మొరుప్రయోగత్తిలే ఇరణ్డర్త్తై అభిధానమ్ పణ్ణమాట్టామైయాలే ఇవ్వధికారిక్కు అసాధారణమాన ఉపాయత్వాధ్యవసాయమ్ ఇవ్విడత్తిలే శాబ్దమాయ్, సర్వాధికారి సాధారణమాన గోప్తృత్వవరణ మార్థమాకక్కడవతు" ఇత్యుక్తమ్, యది

(౧) పాఞ్చ-అహిర్బుధ్న్య §
(౨) పాఞ్చ-
(౩) పాఞ్చ-
(౪) ర-స్త-౨-
(౫) రహస్యత్రయసారే-
(౬) పాఞ్చ-లక్ష్మీతన్త్రే.
(౭) పాఞ్చ-లక్ష్మీత-
§ కుణ్డలితమధికమ్.

నిరపేక్షరక్షకత్వముపాయత్వమ్, కథంతర్హి చేతనాచేతనసాధారణ్యమ్;
కథంవా రక్షకత్వప్రార్థనారూపగోప్తృత్వవరణస్యాఽఽర్థత్వమ్. నచ,
"ప్రపూర్వకపద్ధాతోః§(అధ్యవసాయేరూఢత్వాత్)రక్షకత్వాధ్యవసా
యే రూఢత్వాత్ రక్షకత్వాధ్యవసాయకార్య రక్షకత్వప్రార్థనా
ఆర్థైవ" ఇతి సారాస్వాదిన్యుక్తం యుక్తమితివాచ్యమ్,- నిరపేక్షరక్ష
కత్వాధ్యవసాయేన తాదృశ రక్షకత్వప్రార్థనైవాఽఽర్థీస్యాత్, నతు
తదవిశేషిత రక్షకత్వప్రార్థనా, - నచేష్టాపత్తిః; నిరపేక్ష రక్షకత్వ
ప్రార్థనాయాస్సర్వాధికారిసాధారణ్యాసంభవాత్. నచ రక్షకత్వ
ప్రార్థనాత్వేన సాధారణ్యమితివాచ్యమ్,- నిరపేక్షరక్షకత్వాధ్యవసాయ
రూపోపాయత్వాధ్యవసాయస్యాఽపి రక్షకత్వాధ్యవసాయత్వేన
సర్వసాధారణత్వేనోభయోస్తుల్యతయా సాధారణ్యాఽసాధారణ్య
యోరార్థత్వశాబ్దత్వబీజత్వోక్త్యసఙ్గతేః

కిఞ్చ - నిరపేక్షరక్షకత్వాధ్యవసాయేన తత్ప్రార్థనా కథమ
ర్థాత్సిద్ధ్యేత్, అధ్యవసాయోహి సిద్ధవిషయకః, ప్రార్థనాహ్యసిద్ధవిష
యిణీ, ఇచ్ఛారూపప్రార్థనాంప్రతి విషయాభావనిశ్చయస్య కారణ
త్వాత్, విషయనిశ్చయస్యవా ప్రతిబన్ధకత్వాత్, ఉక్తాధ్యవసాయస్య
విషయనిశ్చయరూపత్వాత్.

యత్తు - నిరపేక్షరక్షకత్వాధ్యవసాయస్య శాబ్దత్వోపపాద
నాయ తదధికరణ సారాస్వాదిన్యాం ప్రక్రియోక్తా, "ఉపాయార్థైక
వాచకః" ఇతి నిష్కృష్టశ్శరణశబ్దః చరణశబ్ద సమానాధికరణఃచేతనా
చేతన సాధారణేనైవాఽఽకారేణ సిద్ధోపాయాభేదంసాధ్యోపాయాభేద
ఞ్చాభిధత్తే; తత్ర సిద్ధోపాయాభేదః - రక్షకత్వరూపో వాస్తవఏవ,
సాధ్యోపాయాభేదో వాస్తవత్వయాఽఽరోప్యమాణః, సిద్ధోపాయా
భేదరూపే రక్షకత్వే నైరపేక్ష్యంవ్యఞ్జయతి" ఇతి. — సా పరీక్షకపరిహాస
నీయా— శరణశబ్దేన చేతనాచేతన సాధారణాకారేణోపస్థితస్య యస్య
కస్యచిదుపాయాభేదోబోధనీయః, నతుసిద్ధోపాయాభేదస్సాధ్యోపాయా

§ అయమపరః పాఠః

